


## తిరువాన్కూరు రీజెంటురాణి

వరదలు ముంచెత్తినవి. పచ్చికబయళ్లు చెఱువులైనవి. పంటపొలములు సముద్రములైనవి. సర్వనాశనమైనకుటుంబములు లెక్కకందలేదు. స్వరూపనాశనమైనగ్రామములు పుంజీలుగ లెక్కతేలినవి. పేదవారికి నిలువనీడ, తినతిండి దొరకుట కష్టముగానుండెను. ఈవరదలపీడకుతోడు సంస్థానమును వైకామ్ సత్యాగ్రహమొకటి గజిబిజిచేయుచుండెను. ఈవిషమపరిస్థితులలో - 1924-వ సంవత్సరము సెప్టెంబరు 1-వ తేదీని శ్రీమతి రాజరాజేశ్వరి మహారాణీ సేతు లక్ష్మీబాయిగారు తిరువాన్కూరుసంస్థానమునకు రీజెంటుగ నియమింపబడిరి. తోడనే తిరువాన్కూరుప్రజలకు రాత్రిపోయి అరుణోదయమైనట్లయ్యెను. రీజెంటురాణీగారి పరిపాలనాకౌశల్యముచే వరదలపీడ వారింపబడెను; వైకామ్‌సత్యాగ్రహము పరిష్కరింపబడెను. సంస్థానకార్యములను సమర్థతతో నిర్వహించుచు ఆమె లోకమువారి మెచ్చుకోలునకు గుఱియయ్యెను. ఈసంవత్సరము నవంబరు 6-వ తేదీని ఆమె సంస్థానమును మహారాజా శ్రీరామవర్మగారికి అప్పగించెను. సంస్థానవ్యవహారములను ఆమె సప్తవర్షములు చక్కబెట్టెను. ఒకసంస్థానముయొక్క జీవితములో ఏడువత్సరములన నెంత? ఐనను ఈయేడు వత్సరములపరిపాలనములో తిరువాన్కూరుసంస్థానము కొలదియిడరాని అభివృద్ధినందినది. 1923-24 సంవత్సరమున సంస్థానముయొక్క ఆదాయము 199½ లక్షలుండెను. 1928-29 సంవత్సరమున ఆఆదాయము 256½ లక్షలకు బెరిగెను. రాబడితోబాటు ఖర్చుకూడ నభివృద్ధి నొందినది. ఖర్చు 195½ లక్షలనుండి 250 లక్షలకు బెరిగెను. క్రొత్తరోడ్లువేయబడినవి. హార్బరుపనులు క్రమాభివృద్ధినందినవి. రైల్వేలైనులు పెంపొందింపబడినవి. తిరువనంతపురమున నీటిసప్లయి సౌకర్యములుచేయబడినవి. విద్యుచ్ఛక్తిదీపములు నెలకొల్పబడినవి.

చేయబడిన సంస్కరణములకు కొలదిలేదు. దేవదాసీచట్టము నిర్మూలింపబడినది. సంస్థానదేవాలయములందు జంతుబలులు నిషేధింపబడినవి. ఉద్యోగవిషయమున జాతి

భేదము, లింగభేదము విడనాడబడినవి. స్త్రీలకు సర్వవిషయములయందును పురుషులతో సమానమైనహక్కులు ప్రసాదింపబడినవి. విద్య, వైద్యశాఖలే సంస్థానముయొక్క ఆదాయములో యెక్కువ కబళించినవి. ఒక్కబాలికలకే 441 పాఠశాలలు. హిందూదేశమునందలి సంస్థానములందన్నిటిలో తిరువాన్కూరు స్త్రీవిద్యాప్రచారమునందును, స్త్రీలకు ఉద్యోగములిచ్చుటయందును ప్రముఖస్థానము వహించుచున్నది. ఈసంస్థానమున కిట్టిపేరువచ్చుటకు రీజెంటురాణిగారిపరిపాలనమే ప్రధానకారణమైయున్నదనుట సత్యసమీపము.

సంస్థానాధీశ్వరులు విదేశయాత్రలకు పొడుపుచుక్కలు, దుబారాఖర్చులకు పెట్టినపేళ్లు. రీజెంటురాణిగారిమెడ ఈరెండుదోషములును లేవు. ఈవ్యసనవివర్జితురాలు ఈయేడు సంవత్సరములలో ఒక్కసారిగూడ సంస్థానపుసరిహద్దులను దాటలేదు; పరిశీలింపక ఒకపైసానైన ఖర్చుపెట్టలేదు. సంస్థానాధీశ్వరులను చచ్చుతెగవేసి విమర్శించిన '**Pathology of Princes**' గ్రంథకర్త ఈసంస్థానాధీశ్వరినిగూర్చి ఒక్కటొంపు చూపలేకపోయెను. ప్రభుత్వ ధనమును వెచ్చించుటలో ఈమెఎంతగా పరిశీలనసాగించుచుండినదియో ఒక్కవిషయమువలన కనుగొనవచ్చును. కాశీహిందూవిశ్వవిద్యాలయసంస్థాపనాచార్యుడగు మాలవ్యాపండితుకు ఈమెను విద్యాలయమునకు విరాళమీయకోరెను. శాసనసభవారి సమ్మతిగొనికాని ఈయజాలనని ఈమె చెప్పెను. వ్యయవిషయమున ఎట్టిమెలుకువ?

ఇంతటిప్రజ్ఞావతియగు ఈమెవ్యక్తిపరమున ఎట్టిఆడంబరమునెఱుగదు. మాటలయందే గాక ఈమెదుస్తులయందును ముక్తసరిగానుండును. నిరాడంబరత్వమునకు మొక్కవోని అర్చకుడగు మహాత్ముడుగూడ ఈమె నిరాడంబరత్వమునకు నివ్వెఱపడినాడు. ఈమె ప్రజ్ఞావతియగు ప్రభ్విమాత్రమేకాదు. ప్రణయశీలయగు గృహిణియు. ప్రజాసంతానమునకు తోడు ఈమెకు కడుపునబుట్టిన సంతానమునుగలదు. ప్రజ్ఞగలరాణి. ప్రణయముగలగృహిణి. ప్రేమగలతల్లి. ఆధునికభారతస్త్రీలు తమ ప్రజ్ఞాప్రాభవములకు తార్కాణముగా చూపుకొనగల స్త్రీరత్నము. కావుననే ఈమెకీర్తిని శ్రీమతి సుబ్బరాయునుసతి లండనుమహానగరమునపాడి థేమ్సునదీతరంగగీతములతో శ్రుతిగలిపినది.

ఋషి గాంధి ఓహోఅన్నాడు. కవి టాగూరు ఆహాఅన్నాడు. పండితుడు మాళవ్యాలెస్సఅన్నాడు. ప్రభువు ఇర్విను మేలుఅన్నాడు. ఇందరు ఇన్నివిధములమెచ్చుకొన వర్షసప్తకము సంస్థానవ్యవహారములు నిర్వహించి భారతస్త్రీలోకమున శుక్రతారయైవెలుగొందు శ్రీమతి సేతు లక్ష్మీబాయిగారికీర్తి కలకాలముండగలదు. 1895-వ సంవత్సరము నవంబరు 18-వ తేదీ ఈస్త్రీరత్నము పుట్టినదినము. తిరువాన్కూరుసంస్థానమువారి కాదినమొక పర్వదినముకాగలదు. తిరువాన్కూరుసంస్థానమును ఇదివఱకు కొందఱుస్త్రీలు పరిపాలించియున్నారు. కాని వారికాలమున నెప్పుడు సంస్థానమున ఇంతటిఅభివృద్ధి కానరాలేదు. ఆసంస్థానచరిత్రమునందు ఈరెజెన్సీపరిపాలనము సువర్ణాక్షరములతో లిఖింపబడగలదు.

# పథికాంగన

అంబటిపూడి నరసింహశర్మగారు

కాటుకకంటిముత్తెముల గైకొనియీయమసిదిన్న దుర్దినం
బేటికిపారిపోదు తరళించెడిదీని మునుంగులోననే
మాటుమణంగెనాకసము మాపెరటన్ని వసించునట్టియీ
తేటికినింతయాగడమ దేటికి గానుపురాడ దేలనో?

ప్రాపునభర్తయున్నపుడు ప్రాగనుభూతసుఖప్రశస్తులా
పూపొదరిండ్లనర్తనవిభూతులు మంజులమోహనంపుస
ల్లాపములోనిరాంగికవిలాసము లాచిఱునవ్వులోనిజ్యో
త్స్నాపరిలేపనమ్ములును తాపములోపలతాండవించెడిన్.

ఈనువిశాలమైనపథమేకద నాపతిమంజుపాదవి
న్యాసపవిత్రితమ్మవిరతాశుతరంగజలాభిషేకవి
న్యాసములుంచియీపతి పదాంకములందెకదాకవోష్ణని
శ్వాసపరంపరన్ లవినొసంగెద నిత్యమువీజనక్రియల్.

ప్రోదిగనున్నతోక విడిపోవగనృత్యవిధానమందునన్
పాదపరిక్రమమ్మెతడబాటుగజేసెడి యీమయూరము
న్మాదములోననాపరిసమానమె యానటుకానిదీనియు
న్మాదముమోదహేతుకము నాదియెఖేదపరీతమక్కటా!

ఓపికమా! మదీయవిరహోజ్జ్వలమైనవిషాదగీతుల
న్నాపతిజేర్పుమమ్మ కలనాదమనోజ్ఞగళస్వరమ్మునన్.
దాపకజెప్పుమమ్మ పరితాపజమై తగుశూన్యపుంపదా
లాపములన్ విలాపబహుళంబగు మామకవర్తనమ్ములన్.

ఈవిరహాబ్ధివీచికల కెయ్యదిహద్దు మదీయజీవపు
న్నావనుముంచివైచునొ ధ్వనచ్చలదూర్మిపరంపరాహతిన్
దీవికిజేర్చునో యెటువిధించునొ యేమొ మదీయభర్తృపా
దావనిసేవసేయగలయంతటి భాగ్యమునాకుగల్గునే?

# శరదిందిర

హరి రాధాకృష్ణమూర్తి గారు

౧

కలకలలాడునెమ్మొగము కంజదళంబులనోముకన్నులున్
చల్లనమందమందగతి సంతసమొందినది క్తటంబులు
చ్చలితమరందబిందువుల.సాకినపల్కులతోడవచ్చు నీ
వలమటఁజెందిరాకతము నారయఁదెల్పగదే శరద్రమా!

౨

ఇలగలనల్లదేశములకీగతినేగితో? లేకకొన్నిటన్
కలకలనాడుచుంటివో? వికాసముబాయగహేతువేమి? నీ
పలుకులమీరినారలో? సపర్యలచక్కఁగఁజేయనేరరో?
మెలఁకువఁగానరో? సుఖనిమీలితనేత్రలుగారో? మానినీ!

౩

పలుదేశంబులలోనిమానినులు సంపత్సౌఖ్యముల్ గల్గి ని
స్తులశోభస్కరలై సతంబు నిజసంతోషాప్తికై మాతృభూ
మిలనాదేశమునై సమూర్ధమున తామేమోచి సాంధింతు రీ
లలనల్ నేరటంచునీయెడద నేలాగెంతువో మానినీ!

౪

మామగవారలూరకొన మంచితనంబునమాతృదేశభా
మామణిముక్తికై సుఖము, మార్దవమున్ విడనాడి వారె వి
ద్యామహనీయతన్ విధి సమాచరణంబొనరించువార లిం
కేమనువారమమ్మ దయనేలగరమ్మ! విలాససంపదన్.

౫

వారలు లోననుండినను పైకినివచ్చిననేమి యెక్కటే
తీరనిసంశయింపకుమ దివ్యవిలాసిని! నీవె యెంతవా
రీరలటందువారిని; యిదెంతయు నేరిచిపెట్టుకున్న సం
సారమువారికియ్యదియు, సందియమింతయులేదు మానినీ!

# రాత్రిత్రయం

శ్రీమతి యు. సత్యబాల సుశీలా దేవిగారు

అతడామెను పలకరించబోతున్నాడు. ఆతొలిరేయి గాంభీర్యంలో ఆతనియౌవనహృదయ ముద్విగ్నమైపోయింది.

ఆమెముఖ మగోచరము. దాన్ని విపరీతపుసిగ్గుదొంతరలు అవనతక్రియలో దాచేశాయి. నీరవమైన కెంపెదవులు చలించిపోయినవి. ఆమెకరపల్లవ మాతనిచేతుల్లో మృదువుగా నలిగిపోతున్నది. అతడామెను పిలిచిన ఆమొదటిపిలుపు భయదఘీంకారావృతమైనగాలితెరలో ఎచటికోలేచిపోయింది.

ఆమత్తేభం, మదోన్మతలో కట్లువిడిపించుకుంది. సేవకజనం గుండెల్లో రాయిపడి వ్యక్తు లదృశ్యమయిపోయినవి. అతడు క్షత్రియకుమారుడు. కర్తవ్యతాఝంఝూనిలంలో అతనిప్రేమహృదయం తేలిపోయింది.

మదగజం వశవర్తినియయి బంధించబడింది. అతడు తెలివిలేనిచూపుతో ఆశయనగృహద్వారం సమీపించేడు. కుక్కుటారవం హృదయనిర్భేదకమయింది. వెనుదిరిగేడు.

ఆమెకపోలం కరకమలావలంబిత. చూపులో వియోగభారం. హృదయంలో తెలియరాని ఉద్రేకం. జారిపోతూన్న కేశభారంలోంచి రాలిపోతున్న పువ్వులు. దూరంగాపళ్లెంలో అరవిరిసిన విరజాజులదండ నిశ్శబ్దంగా పరిమళిస్తోంది.

ఆదండ నెవరో మెల్లగాతీసి ఆమెజడలో ముడుస్తున్నారు! పరధ్యానం పటాపంచలయింది. జాలిచూపులురక్తిమ వహించేయి. ఆమె తిరిగిచూసింది. అతడు నవ్వుతున్నాడు. మోమాట మామెను ముంచేసింది. అతనిమనస్సు చిన్నవోయింది. అతడామెను రెండోమారు పిలిచేడు "మనోరమా!"

ఏమాధ్వని!! బ్రహ్మాండభాండం బ్రద్దలవుతోంది! రణభేరియా? శత్రువులు! శత్రువులు! దిక్కులు ప్రతిధ్వనించిపోయినవి. అతడు స్తంభించిపోయేడు. మనోరమారాధనకు పువ్వులేరుకుంటూన్న ఆప్రేమహృదయంలో అన్యాయహృతరాజ్యరమాక్రందనం మారుబలికింది. వేదనాపూర్వకమైన దీర్ఘనిశ్వాసమామెయొద్ద సెలవుపొందింది.

మూడవరేయి! నిశ్చలనదీప్రవాహంలో అవ్యక్తవేదనా స్వరం. భయసంభ్రమాలతో చెట్లకొమ్మల్లోంచి సంశయంగా తొంగిచూస్తోన్న సన్ననిచందమామ! యామినీపతి నీలిపట్టు చీరలో ఒత్తుగాచెక్కిన రత్నాల్లామెరిసిపోయ్యే తారకలు.

ఘోరంగా మండుతూన్నచితి. దిక్కులు పిక్కటిల్లేటట్టు మంత్రవిలాపఘోషలు. ఆమె రక్తమాల్యాంబరధారిణి!

ముఖంలో పాదుకుపోయిన దుఃఖం, ప్రవేశిస్తూన్న గాంభీర్యం, హృదయంలో మోయలేనిబరువు. పాలిపోయిన పెదవుల్ని వణకిస్తూన్న ఆహారవాల్లో మనోహరనామం మలగిపోతున్నది.

విధీ! ఆమృదులతమపాదాలు స్వర్గసోపానాలనువలె చితినారోహిస్తూన్నవి. చితిమీద వీరస్వర్గమునందిన మనోరమామనోహరుడగు మనోహరుని శరీరము! ఆనేత్రాల్లోని సౌందర్యజ్యోతిని తారకలు దాచుచున్నవి. ముఖంలో చిరునవ్వువెన్నెల వెన్నెల్లోకరిగిపోయింది. మనసులోనే మాయమైన ప్రేమమూర్తి స్వర్గద్వారంలో మనోరమారాధన కెదురుచూస్తోంది. "సతీ! ధన్యవు! త్వరితముగ మనోహరదర్శన మొందుము! సతికి పతితోడిదె లోకమునుమీ!"

ఆమె ప్రజ్వలితశరీరకాంతికి ప్రజ్వలితాగ్నికుమారుకు మెరుగులుదిద్దేదు. అతని ఉత్తమాంగ మామె యంకస్థితమైనది. నిన్నమొన్న పలుకరించిన పలుకనేరనిముగుద నేడు భర్తతోడి స్వర్లోకప్రయాణ మొనర్చునది!

సతీ!ధన్యవు. ప్రేమమయీ! ప్రణామములు. దేవీస్వరూపిణీ! నమస్కృతులు - ఆసీచూపుల్లో తొంగుతూన్న ధైర్యకాంతి నీవంశవీరుల కభయమొసంగునుగాత! నీ పవిత్ర ప్రేమాంకితనామాక్షరము సతీమతల్లులకు పావనమంత్రమయ్యెడిని-దేవీ! సర్వకాలమునకు భర్తృసహితవై స్వర్లోకమునందలి ప్రేమరాజ్యమున కధీశ్వరివై ప్రకాశింపుము! జననీ! నీజన్మభూమిని నీయట్టిపుత్రికలుకలిగి యుండునట్లుగ నాశీర్వదింతువుగాక!

# ఉత్తమలోకము

కొమరవోలు నాగభూషణరావుగారు (సాహిత్యమండలి)

బాలుఁడు

జననీ! సంభాషణాంశవశమున నీవు
వాకొనుచునుండు వుత్తమలోకమనుచు;
నందునెల్లరుసుఖులుగా నుందురనుచు;
ననిశమానందభరితమైనట్టిదేశ
మెచటనున్నది? పోవుటకేది బాట?
అచటికందఱమునుబోయి హాయిమీఱఁ
గాపురముసేతమింక దుఃఖమ్ముమఱచి—
వృక్షములుపుష్పపరిమళావృతములగుచు
నభినవంబైన తారుణ్యమానహిల్ల
మల్లికాసూనరాజి శోభిల్లుచుండ
జగతినెల్లొందు రమ్యదేశంబుగాదె?

తల్లి

కాదుకాదదితనయుఁడా! కాదుకాదు.

బాలుఁడు

కాదనెద వట్టులైన నింకేదియగును?
అయిననిదియేమొచెప్పు మాయమ్మ! నీవు.
నారికేళవృక్షాళి విన్నాణసరణి
భూమిపై నెల్లయెడల పొల్పొందుచుండ;
సూర్యరశ్మికిఁబండు ఖర్జూరఫలము
లట్టి తరువులనంటి యుయ్యాలలూఁగ;
సౌరభంబులతోడ మహీరుహములు
కాననములనెల్ల దివ్యసుగంధవాత
భరితముగఁజేసి సౌఖ్యసంపదలొసంగ;
లలితముగమందమలయానిలంబువీవ;
వివిధవర్ణంబులనుగల విహగగణము
బారులనుదీర్చినింగిని బరుగులిడఁగ;
ఘనఘనాఘనసంఘాతగర్జనముల
కలరుచు మయూరములు పింఛములనువిప్పి
అతులితానందగరిమ నృత్యములుసలుప;
సాగరుని నిటలప్రదేశముననొప్పు
నిర్మలానందయుతరమణీయహరిత
ద్వీపమా?

తల్లి

కాదు నాచిన్నపాప!

బాలుఁడు

అమ్మ!
జలజలనినాదకరజలంబులనుగలసి
మిసమిసలగొల్చుచున్నట్టి పసిమియిసుక
పైని బ్రవహించు దివ్యశైవలినితోడ
ఆఉషఃకన్య స్వీయగృహాంగణమున
రమ్యముగఁదీర్చు రత్నాలరంగవల్లి
కలనుబోలఁగరత్నముల్ వెలుఁగునట్టి
స్వచ్ఛమౌ సాంద్రశాద్వలస్థలముతోడ;
కృష్ణపక్షవిభావరి నెల్లదిశల
మనమురంజిల దేదీప్యమానములయి
రాజిలుచునుండునట్టి వజ్రములతోడ;
వనజములగేరు శోణప్రవాళమణులు
ధవళదీధితిబర్వు ముక్తామణులును
గనులపంటవుగా నలంకారములుగ
సమరియుండినసికతాతలములతోడ;
నిరుపమంబుగ భోగ్యమైనెగడి—దైవ
భక్తినుద్దీపింపఁబఱచు నవర్ణనీయ
ప్రకృతిలక్ష్మివిలాసప్రభావకలన

బహుళతరమగునానందప్రదమునగుచు
నెచటభూమియు నాకాశ మేకమగునో
అట్టిప్రాచీనసీమల నణఁగియున్న
సుందరంబగుదేశమా!

తల్లి

సుతుఁడ! కాదు

బాలుఁడు

ఓప్రియజననీ! నాకునన్యూహ్యమైన
ఏమహాద్భుతప్రకృతియం దిమిడియున్న
దీమహోత్కృష్టలోకము? ఎఱుఁగఁజెపుమ!

తల్లి

ఆమహోత్కృష్టసామ్రాజ్య మవనిజనుల
కేరికినిగోచరముఁగాదు: ఎవరికర్ణ
ములనులవమేనిఅచ్చటి ముక్తకంఠ
లలితగానరసానందలహరిసోఁక;
దచటివ్యక్తులుగన జరాయాసమరణ
ఖేదములులేక యౌవనోత్కృష్టులగుచు
ననిశమువినోదకేళులం దలరుచుంద్రు;
ఎవరి శిరమందుఁజూచిన నించుకైన
నెరసిపోయినకురులు గాన్పింప; వచటి
ప్రసవరాజంబులెన్నఁడు వాడిపోవు;
ఎల్లపుడుభోగమే ప్రవర్తిల్లుచుండు;
ఘోరకర్మంబులుండవు; కుపితవచన
సరణిపై తమకుఁ హాస్యము; శాంతియుతము
నైన ఆదివ్యలోకమునందు మంచి
వారలేగాని దుష్టులు చేరఁబోరు.—
ఓయినాభాగ్యఫలకమా! ఓకుమార!
అదియె స్వర్గమహోన్నతపదము; నదియె
అఖిలజీవులకును పరమావధియగు—

బాలుఁడు

నీవునచ్చటికేగుదే? నేనుగూడ
వెంటవచ్చెద గొనిపొమ్ము.

తల్లి

ప్రియకుమార!
ధర్మపరులును సత్తపోధనులుసత్య
వాక్యపరతంత్రు లాదివ్యపదవిఁబొందఁ
జాలుదురుగాని పరులకు సాధ్యమగునె?
ఈవు స్వర్గమువడయఁగా నెంతువేని
సత్యపథగామివై సదాచారవృత్తి
ధర్మవర్తనమును భూతదయయుఁగలిగి
సకలసద్గుణమూర్తివై సంచరింపు.

## రాణిసంయుక్త

కీసర వేంకటరామనరసింహారావుగారు

వైవాహికాదుల వనితాస్వతంత్రంబు
సన్నుతంబనినాడె చాటినావు
స్వాతంత్ర్యరక్షణాసక్తిక్రియాలోలత
సుదతులెసగగ దారిఁజూపినావు
అబలలుస్త్రీజనమనుటసత్యంబంచు
తెలుపఁగ త్రినిఁ బూనినిలచినావు
ప్రాణేశునెప్పుడు పాయరాదని కద
సహలినికూడ నడచినావు
హైందవాంగన కాదర్శమగును నీదు
ప్రవిమలంబగు జీవితాప్రసవ మరయ
నవ్యతేజంబులెసగ ననారతంబు
రాణిసంయుక్త! క్షాత్రధర్మప్రయుక్త!

# శరద్వేళ

శ్రీమతి ఓలేటి నిత్యకల్యాణమ్మగారు

౧

జాళువానెమ్మేన లీలసింగారించు
  తెలిపట్టుచీర సొంపులు వెలార్ప
తలిరుచెంగావిరంగుల ఫాలతలమునఁ
  గ్రమమోహనతిలకము రహింప
విద్రుమారుణసుధావిమలాధరమునందుఁ
  గమనీయహాసరేఖలు నటింప
గాత్రహేమాభతోఁ గలసిపోయిన కంక
  ణంబు లమృతనిస్వనములొనర్ప
పాణిచే నొక్క కుంకుమబరిణెనూని
యరుగుచున్నదియొక్క కన్యాలలామ
గొనబుగాఁ దీర్చు బొమ్మలకూటమునకు
నమలహృదయంబుతో పేరటాండ్రఁబిలువ.

౨

బాలార్కసిందూరలీల తోపకమున్నె
  శైవలినీవారి జలకమాడి
ప్రత్యూషపవనాంకురములందు నూగాడు
  తడికొప్పుచే సొంపుముడిసమర్చి
లేఁతవేకువమంచుపూఁతహసించెడు
  వలపుసుమరాజి పదిలపఱచి
సూరిజనస్తుత్యశుభదకావ్యావళి
  నాసనాంతరమందు నమరఁజేసి
భవ్యభావము లెదఁజాలువాఱ నిట్టి
విమలవిజయవాసరసుధాసమయమందు
క్రమపుష్పాక్షతల నొక్క కవికుమారి
భారతీదేవిఁ బూజించు భక్తి నదిగొ!

౩

సిగ్గుచూపులలోనఁ జిందులాడెడుసుధా
  లీలల యౌవనశ్రీలతోడ
చలువనవ్వులలోని చక్కందనముఁగూడి
  జాల్వాఱురాగరసంబుతోడ
అమలమోహనహృదయాంతర్గతంబైన
  తీయనిప్రేమప్రదీప్తితోడ
రమణీయనందనారామనిత్యానంద
  భావార్ద్రసౌఖ్యసంపదలతోడ
మృదుకనీనిక లుత్పలశ్రీనిగురియ
వింతభావాళి డెందాన వెల్లివిరియ
పండుగకు నేఁగుదెంచిన పతినిఁగాంచె
నమ్మచాటుననిల్చి మీనాక్షియోర్తు.

౪

భారతీయపురాణవైభవోన్నతిఁజాటు
  భావార్ద్రగీతముల్ పాడిపాడి
రంగుచిల్కలతోడ రాగిల్లుబాణాలఁ
  గమ్మని క్రొవ్విరుల్ చిమ్మిచిమ్మి
కాలిభూషలుసల్పు క్రమనాదములతో
  వీథివీథులయందు వెడలివెడలి
వాస్తవ్యులర్పించు వడపప్పుబెల్లముల్
  మెదలుచు కడుపార మెసవిమెసవి
చెలఁగి తొంగలికనుఱెప్పచిప్పలందు
ననయుము ప్రమోదరసము తొందొణుకులాడ
చెలువమునునించు బాలికాశ్రేణి పురిని
విజయవాసరప్రవిమలవేళయందు.

# కదంబుని సాహసము

శ్రీమతి ఆదుర్తి సత్యాబాయిగారు

ఆ పెద్దబుర్రా, దొంగచూపులూ, బొర్రకడుపూ, మరగుజ్జుశరీరమూ ఎవరూచూసినా యీవ్యక్తికింత మహోన్నతపదవి ఎలాగువచ్చింది బాబూ అనుకునితీరాలి. పెద్దబుర్రనిండా ఉన్నది మట్టిముద్దేఅయినా పాదుషావారి నిర్హేతుకజాయమానకటాక్షమువల్ల రహమాన్ ఖాను నవనగరద్వీపానికి రాజప్రతినిధి అవగలిగేడు. గుడ్డిలో మెల్లన్నట్లు ఈ పెద్దబుర్రసాయిబుగారిని ప్రధానరాజ్యభాగంలో గాకుండా ఏఅందుబాటులేని మారుమూలనున్న ఈద్వీపంలో వేసినందుకు పాదుషావారిని మెచ్చుకోవలసినదే. గుర్రం గుడ్డిదైనా దానాకి లోటులేదు. ఖాను సహజంగా పిరికిపందఅయినా తలకుమించినగర్వం. దానికితోడు అధికారబలం. అదేనా పాదుషాకందుబాటులేని దూరస్థలంలో. ఇక చెప్పేదేముంది? తనే సర్వాధికారిలాగ చలాయిస్తున్నాడు. దురభిమానము పెరిగిపోయినది. ఆడంబరానికి మితి అగుపడడమేలేదు.

ఒకవాడు భట్రాజులకీడుదియ్యని అంతరంగికమిత్రులు నిజప్రభావం పొగడుతూఉంటే నాగస్వరం వింటున్న పాములాగ పొంగిపోతున్నాడు అయ్యా. ప్రస్తుతకారణం ఏమంటే ఈమధ్యనే కొంతమంది ధైర్యవంతులైన నవనగరవాసులు ఓడదొంగలరాయడయిన కదంబుని ముఖ్యపరిచరులను బంధించి ఈతని కప్పగించేరు. తానే యీసాహసంచేసినట్లు పొంగిపోతున్నాడు ఖాను. ఇటువంటి మహాసమయంలోవచ్చేడు దర్వాజీ. "పాదుషావద్దనుండి వార్తావహుడు వచ్చినాడు ప్రవేశపెట్టుటకుశెలవా"అన్నాడు. 'పాదుషా-వార్తావహుడు' అన్నముక్కలు చెవిని పడేసరికి ఖానుముఖంలో చిక్కినా నెత్తురులేదు. ప్రభువువద్దనుండి వార్తవస్తే సంతోషించాలో భయపడాలోకూడా అతనికి తోచలేదు. తోచేది, మానేది కాని పాదుషాపంపిన మనిషి వద్దడానికి వీలా? ఖాను తలా? "సరే రమ్మనుమ"న్నాడు గద్గదికతోటి. ముఖ్యమిత్రుడొక్కనికితప్ప మిగిలిన అందరకూ శెలవిచ్చిపంపివేసినాడు. ఇంతలో అపురూపసుందరుడైన ఒకపురుషుని దర్వాజీ గదిలోనికి ప్రవేశపెట్టేడు. ఆనూతనపురుషుని విశాలమైననుదురూ, ఆకర్ణాంతములైన కళ్ళూ, ఎదుటివాళ్ళెటువంటివాళ్ళయినా అరక్షణంలో వశపరచుకోగల దృష్టులూ, తీర్చిదిద్దినట్లున్న తక్కిన అవయవములూ, ధరించిన విలువైన అంగరకా, ముఖమలుపనిచేసిన పాదరక్షలూ, రత్నముఅమర్చిన బంగరుపిడి పైకగుపడేటట్లుగా దట్టిలో నిమిడ్చిన బాకూ అతడొక ఉన్నతవంశజుడైన గొప్ప రాజకీయోద్యోగియని చెప్పవక్కరలేకుండానే తెలుస్తున్నాది. ఖానుసముఖానికి రాగానే అతడు తలపాగాలోనితురాయి నేలకు తగిలేటట్లుగావంగి "అల్లా కీర్తింపబడుగాక! పాదుషావారు నన్నొక అగత్యమైన కార్యముపై మీవద్దకంపినారు. మీకు వీలైనయడల మనవిచేసెదను"అన్నాడు.

ఖాను కేంచెయ్యాలోకూడా తోచలేదు. నిలువుగ్రుడ్లతో అతడిని ఒకసోఫాపైకి ఆహ్వానించేడు. తరువాత నీళ్ళునములుతూ జగన్మోహనమైన అతనిరూపముచూస్తూకూర్చున్నాడు. ఎట్టకేలకు "మీనామధేయము?" అన్నమాట లాతనినోటిలోంచి ఊడిపడ్డాయి. ఆగంతకుడు చిఱునగవుతో "అబ్దుల్ గనీ"అన్నాడు.

"(ఆశ్చర్యముతో) గనీ......గనీయా?"

"అవును. ఆశ్చర్యమేల? నేను మీయర్థాంగి హమీదా బేగమున కొకవిధముగ అన్నదమ్ముడనే."

ఈమాటవినేసరికి ఖానుకళ్ళలో భయం మాయమయింది. ఆస్థానంలో తనభార్యయందుగల నిరసత్వమూ, ఆమె బంధువులయందు అసూయ తాండవించేయి. గనీ కిది కష్టమనిపించింది. "అయ్యా! అది యిప్పుడప్రస్తుతముకదా? నేను వచ్చినపని జరుగుట కనుజ్ఞనీయరా" అన్నాడు. ఖాను చకితుడై "అవశ్యము. పాదుషావారి ఆజ్ఞనందుకొనుట ప్రధానకర్తవ్యముకదా" అని సరిపుచ్చుకున్నాడు.

గనీ ఉపోద్ఘాతము ప్రారంభించేడు. "దేశమునువదలి యిచ్చటకు వచ్చేలోపల నేను చాలాఅవస్థలు పడినాను. దారిలో మాయోడ నష్టమైపోయింది. చావుదప్పి కన్ను లొట్టపోయినట్లు నేనుమాత్రం అల్లా దయవల్ల మీవద్దకు రాగలిగేను."

"మీయోడ ఎందుకు భగ్నమయింది?"

"పిమ్మట అది సావధానంగా మనవిచేస్తా. ముందు పాదుషావారి పని కానీయండి. మీరు దేశాని కొనర్చిన సేవలువిని పాదుషావారు చాలాసంతోషించి తమ జన్మదినోత్సవసమయమున మీకీబిరుదము నిచ్చుట కిచ్చగించినారు. కాని ఇప్పుడుచెప్పిన కారణములవల్ల సముద్రముతాకుడు కీబిరుదుపత్రము నలిగిపోయింది. దైవకృతమైన ఈతప్పిదమునకు నన్ను క్షమింతురుగాక"అని చెబుతూ బాగాతడిసి మడతలుపడిపోయిన ఒక కాయితాన్ని ఖానుచేతుల్లో పెట్టేడు. వర్ణింపలేనన్ని ఆలోచనలతో ఆకాయితం విప్పి క్షణంలో అమూలాగ్రంగా చూసేశాడు. నిజంగాఅది బిరుదుపత్రమే. కాని నీటితాకుడువల్లకాబోలు తనపేరూ,పట్టణనామమూ ఏర్పించడానికి వీలులేనిస్థితిలో ఉన్నాయి. ఇంతలో అంగరకాలోని జేబునుండి ఒకతోలుపెట్టె తీసి విప్పినాడు గనీ. అందులోంచి గదంతాకాంతులతో నింపుచున్న రత్నాలతో పొదగబడిన బిరుదుచిహ్నం బయట పడింది. ఇదవుపడేసరికల్లా ఖానుగారిబుర్ర ఖాళీఅయిపోయింది. సంశయాలన్నీ సమసిపోయాయి. తనకోసమే కాకపోతే ఇన్నికష్టాలుపడి ఇంతదూరంవచ్చి పాదుషాకోపమునకు పాత్రుడై గనీ తనకెందుకు దీనినిస్తాడుఅని మనసు సమాధానంచెప్పింది. సంతోషము చేవణకుచున్న చేతుల్తో దాన్నందుకుని నీరుగ్రమ్మిన కళ్ళ కద్దుకున్నాడు ఖాను.

"కార్యనిమగ్నులైయున్నారా? తేలికగాఉన్నారేమో అనుకున్నాను" అని పలుకుచూ మెరుపుతీగ లాంటి సుందరిఒకతె గదిలోప్రవేశించి పరపురుషులున్నందున చప్పున వెనుకకుతగ్గింది. ఖాన్ గనీవైపు చూస్తూ "హహహ. ఏంతెలివి? తీరుబాటుగా ఉన్నాననుకొందిట. రాజప్రతినిధికి తీరికకూడానా?" అని ఒక వెడనవ్వు నవ్వేడు.

మళ్ళీ గదిగుమ్మమువైపుతిరిగి "హమీదా! రావచ్చును. పరాయివారెవ్వరూలేరు. ఈయన నీకాప్తుడే" అన్నాడు. అవనతవదనయై ఆయువిద లోనప్రవేశించింది.

"చూశావా? నన్ను మెచ్చుకుని పాదుషావారిచ్చిన బిరుదమూ" అని గర్వంగా ఆచిహ్నం మావిడకి చూపించేడు ఖాను. కుశాగ్రబుద్ధియగు ఆమె అనర్హుడైన తనభర్త కిది ఎలాగునవచ్చినదియని పూర్తిగా అనుమానిస్తూనే "సంతోషము"అన్నది.

"ఓహో! మాఆవిడకుకూడా సంతోషమయింది. ఇంకేం—ఇదిగో మీఅన్నగారు అబ్దుల్ గనీ."

హమీదా నూతనపురుషునివైపొక్కసారి తలెత్తి వెంటనే వంచినది. ఆమెది చాలా పెద్దకుటుంబం. పాదుషాచే పంపించబడి తనబంధువువని చెప్పుకొనుచున్న యీవ్యక్తిని అనుమానించడం సుళువుకాదు. అయినా హమీదా గనీని బాగాఎరుగును. అందుచేత ఊరుకొనలేకపోయింది.

"గనీని నేనుబాగా ఎరుగుదును. కాని"—

"అవును మనమంతా చాందినీచౌకులో ఆడుకొనేవారంకదూ?" మాటమధ్య నింతచురుకుగా అందుకొన్నందునకామె ఆశ్చర్యపడి మళ్ళీ నిదానించిచూసి "కాని గనీకప్పుడు రాగిజుత్తుండెడిది."

"అయ్యో ఆమధ్యను చాలజబ్బుచేసి జుత్తంతయు నూడిపోయినది. మళ్ళీ ఆశ్చర్యంగా నల్లగా మెలకెత్తుకొచ్చింది."

"అయియుండవచ్చునుకాని గనీవి పిల్లికళ్ళు."

గనీ ఏదియో ప్రత్యుత్తరమియ్యబోతున్నాడు. ఖాను చురచుర చూస్తూ "ఆడదానికి నీకీతర్కం ఎందుకూ? పోయి భోజనం సిద్ధపరిపించు" అన్నాడు.

హమీదా చిన్నబుచ్చుకుంది. మరోమనిషి ఎదుట తన్నట్లు తూలనాడడం ఆమెకెంతో కష్టంతోచింది. బొటనవ్రేలితో నేలవ్రాస్తూ "స్త్రీలెన్న పొమరువని కొన్ని సంగతులుంటాయి."

"ఆహా! చాలా సంతోషించాం. నీ సలహా కోరినప్పుడు వచ్చి చెబుదుగానిలే. ఇంకిక్కడనుండి వెళ్ళవచ్చు."

హమిదా గిరుక్కునతిరిగి వెళ్ళిపోయింది.

గనీకండ్లనుండి జాలిగా రెండు నీటిబిందువులు బుగ్గలపై జారేయి.

భోజనశాల బహుకోలాహలంగా ఉన్నాది. రహమాన్ ఖా నపరిమిత సంతోషముచేత పరవశుడై తదను కూలంగా తప్పతాగుతున్నాడు. ఎదురుగాకూర్చొన్న గనీ గళాసులోకూడాకొంత సారాయము పోస్తూ "పాదుషా నాకీబిరుదిచ్చినందుకు సంతోషమేకాని మొన్న చేసిన సాహసంవింటే ఇంకా ఏంచేసునో?"

"ఏంచేశారేమిటి?"

"ఓడదొంగలలో మేటిదైన కదంబుడిపరివారాన్ని బంధించేశాను."

గనీ ఆతృతతో "చంపేశారా?"

"లేదు. ఆపనే చేద్దామనుకుంటున్నాను."

ఇంతలో ఒకమిత్రుడువచ్చి "ఖాన్ గారూ! మీకీబిరుదువచ్చినందులకు తగినవిధంగా పెల్లడిచెయ్యాలి నుమండీ" అన్నాడు.

"అదే అదే నేనూ అనుకుంటున్నాను. ఏంచేస్తేబాగుంటుంది."

"మాకందరికీ గొప్పవిందు చేయించండి."

గనీ అందుకున్నాడు "నాకుతోచినమాట చెబుతానువినండి. విందులవల్ల ఇది బాగా వెల్లడికాదు. పూర్వం మహారాజులు తాము సింహాసనంఎక్కేటప్పుడుగాని దిగ్విజయం చేసినప్పుడుగాని ఖైదీలనందరిని విడిచి పెట్టేవారు. ఈద్వీపానికి మీరే సర్వాధికారులుగనుక మీరుకూడా ఈశుభసమయంలో అలాచేస్తేబాగుంటుం దని నానమ్మకం."

"అవును. ఇదే చాలాబాగుంది. డబ్బుఖర్చూలేదు. మాటాదక్కుతుంది. కావలిస్తే వాళ్ళని మరో నేరంక్రింద మళ్ళీ శిక్షించవచ్చుకూడాను. కాని కదంబుడిపరివారాన్నివదిలితే ప్రమాదంవస్తుందండీ."

"దానికేమీపరవాలేదు. నేనొకచిన్నఉపాయం చెబుతాను. నేను వెంటనే పాదుషావద్దకు వెళ్ళి పోవాలి. లేకపోతే ఆయన కోపంచేస్తారు. నేను వెళ్ళేటప్పుడుగాని వీళ్ళను నాఅధీనంచేస్తే పాదుషాకు వీళ్ళని సురక్షితంగా అప్పజెప్పి మీకీర్తి పెట్టిస్తాను. నేను వీళ్ళను తీసుకుపోయినతరువాత మీరు ఖైదీలను కులాసాగా వదిలీవచ్చు.

"భేష్. ఏంఉపాయం చెప్పేవయ్యా. గనీ! తప్పకుండా యిలాగేచేదాం."

ఫలహారపుగదిలో ఖానూ, హమీదా, గనీ ముగ్గురేఉన్నారు. ఖాను తనఅదృష్టాన్ని తలుచుకుతలుచుకు పొంగిపోతున్నాడు. ఇంతలో ఏదోజ్ఞాపకంవచ్చి "మీఓడ ఎందుచేత భగ్నమయిందో చెబుతానన్నారు" అని గనీని ప్రశ్నించేడు.

"దానికేమిగాని ఒక ముఖ్యవిషయం చెబుదామనుకొంటూనే మరిచిపోతున్నాను. హమీదాబేగము నిజసోదరుడగు కరీమ్‌ను కదంబుడు బంధించేడు." హమీదా తృళ్ళిపడింది.

"కాని భయపడనక్కరలేదు. కదంబుడాతనిని సానురాగంగానే చూస్తున్నాడు."

"నాకు తెలియదూ? కరీమతిసుళువుగా దొంగలతో సావాసముచేయగలడు. అవునా? హమీదా!"

"(కన్నీళ్ళతో) ఏమో నాకు తెలియదు."

"ఇపుడు కొంతధనమిచ్చినచో కరీమ్ విడుదలకాగలడు. మీరేమైన సహాయముచేయుదురని నమ్ముచున్నాను. కరీమ్‌కూడ చాలాదీనముగా ఈవిషయమై నన్ను ప్రార్థించినాడు."

"చాలుచాలు. ఇక్కడ నాకష్టార్జితమేకాని కరీమ్‌బాబుగారి సొమ్మేమియు దాచియుంచలేదు. నేనిట్టివాటికేసహాయమునుచేయలేను. అన్నట్లు పాదుషావారికి నేను కృతజ్ఞతావందనములతో జవాబువ్రాయవలసియున్నదికదా. నేను కార్యాలయమునకుపోవలెను. మిమ్ములను కొంతసేపు వదలవలసివచ్చినందుకు క్షమింపుడు" అని పలుకుచూ ఖానామందిరమునవదలి వెళ్ళెను.

రుద్ధమయిన కంఠస్వరముతో హమీదా గనీనుద్దేశించి "నన్ను క్షమింపుడు. మీరు అబ్దుల్ గనీయన్న నమ్మకము నాకులేదు. కాని పాదుషాచే పంపబడినందున గొప్ప ఉద్యోగియనినమ్మగలను. ఇప్పుడు మీరు నాయనుంగుతమ్ముడగు కరీమ్‌నుగురించి చెప్పినది నిజమేనా?"

"సోదరీ! నీవు సరిగాపోల్చేవు. నేను గనీనికాను. కాని కారణాంతరాలవల్ల అట్లు నమ్మించవలసివచ్చింది. నేను మిమ్ములనువదలిన కొద్దికాలమునకే కరీమిచ్చటకువచ్చెను. ఆతనన్నియూ చెప్పగలడు."

"మీకు ధనమవసరమైనయెడల నానగల నిచ్చెదను. కాని వాడెట్లు కదంబునిచేజిక్కెను?"

"అదొక పెద్దగాథ. నేనూ ఆతనూ 'మకుటాజీ'అనే ఓడమీద ఇచ్చటకువస్తున్నాం. దారిలో కదంబు డడ్డుకొని వాయోడనాశనంచేసి మమ్మల్ని ఖైదుచేశాడు. నేనుమాత్రం వాడికళ్ళలో దుమ్ముకొట్టి అర్ధరాత్రివేళ సముద్రంలో గెంతేశాను. మరునాడిప్పుడు నేనువచ్చిన 'ఉదయపురి' అన్న ఓడ నన్నురక్షించింది. ఇదీ పాదుషాగారిదేగనక ముందుగా ఇచ్చటకువచ్చి నాపనిపూర్తిచేసుకున్నాను. కరీముని విడిపించడాన్కి నాకు మీసొమ్మేమీ అక్కరలేదు. దైవము నాకూకొంత ఉపాధినిచ్చినాడు. నేనే ఆతనిని విడిపించెదను."

"నిర్హేతుకముగా మాకుటుంబముపై మీకుగలిగినదయకు వందనములు."

"నీవట్లనుకోనేవద్దు. కాని నిన్నుజూచిననే నాకు జాలియగుచున్నది. దుర్మార్గుడగు నీభర్తకు కాకిముక్కునకు దొండపండువలె—"

"ఏమంటిరీ? నాయెదుటనే నాదైవమునుదూరుదురా? క్షమింపుడు. ఇది మీకుతగదు."

"సోదరీ! నీపతివ్రతాత్వమునకు వందనాలు. నీవంటివారింకనూ కొందరుండుటవల్లనే ప్రపంచం నిలచియున్నాది. అచిరకాలంలోనే నీతమ్ముడిని నీవు కలుసుకోగలవు."

ఖాను గనీని వెంటబెట్టుకుని కారాగృహంవద్దకు వెళ్లినాడు. ఆప్రదేశమంతా భరించరాని కంపుతోటి, అపరిమితమైన చీకటితోటి నిండిఉన్నాది. ఒక్కొక్కఖైదినే పరిచారకులు ఇవతలి కీడుస్తున్నారు. అధమం వారంరోజులనుండైనా ఒకడికీతిండిఉన్నట్టులేదు. దృఢశరీరులైయుండిన అనుష్కరులిప్పుడు శల్యావశిష్టులైయున్నారు. వీళ్ళందర్నీ నోటికి వచించరాని దుర్భాషలాడుతున్నాడు ఖాను. గనీ కిదంతాచూచేసరికి కళ్ళంబడి నీళ్ళువచ్చేయి. "చావడాన్కి సిద్ధంగాఉన్న వీళ్ళ నింకాతిట్టడం ఎందుకండీ" అన్నాడు. "తిట్టాలా. పడేసి మట్టాలా. అమ్మమ్మా! వీళ్ళంటే సామాన్యులనుకొన్నారా ఏమిటి? మాపక్కలో బల్లెములే. ఒకొక్కళ్ళని పట్టడాన్కి ఏడుసముద్రాలూ ఏకమవాలన్నమాట."

అపరిమితంగావచ్చిన నవ్వు దాచుకున్నాడు గనీ. ఖైదీలనందరనూ ఒకచిన్నపడవలో ఎక్కించేరు. ఖానూ గనీ ఇంకోదాని ఎక్కేరు. కొద్దిదూరంలో ఎర్రపతాకపై తెల్లచంద్రవంకతో చూస్తూ "ఉదయపురి" నిరీక్షిస్తున్నాది.

ముందు ఖైదీల నెక్కించేశారు. తరువాత రాజప్రతినిధి ఎక్కడాన్కి నిచ్చెన దింపినారు. ఓడమీద వరకూకూడ దిగబెడితే మరీబాగుంటుందని ఖాన్ మెట్లెక్కి పైకెవెళ్ళినాడు. ఓడలోచూచును గదా ఒక్క మహమ్మదీయుడైనా కనుపడడు. ఖానుకనుమానంతట్టింది. ఇంతలో లోనుండి కదంబునికి జేయని పెద్దగొల్లు వినిపించింది. సాయిబుగారి గుండెల్లో బండరాయి పడేసినట్లయింది. గనీకోసం వెనకతిరిగి చూశాడు. ఇంకా గనీ ఎక్కడ? గనీ దుస్తులలో కదంబుడే ప్రత్యక్షం. ఖానుకంతా అర్థమయింది. వళ్ళు వణుకుపుట్టింది. నాలిక తడి ఆరిపోయింది. కొయ్యబొమ్మలాగు నిలబడిపోయాడు.

"కరీమ్!" అన్నాడు కదంబుడు. ఒకగదిలోనుండి చిరునగవుతో కరీమినతలకువచ్చేడు.

"మీబావగారితో ఇంటికివెళ్ళిపో. ఇప్పటినుండేనా ఆయనను మీఅక్కయెడల దయగలిగియుండమను. లేకపోతే నల్లగుండెల్లో నిద్రపోతానని జ్ఞాపకంచేయి. మరివెళ్ళిపో. మాఓడలంగరు ఎత్తివేశాం."

చెవులు చిల్లులు పడేటట్లు ఓడ కూతవేసినది. నిశ్చేష్టుడయిన ఖానునీ, కరీముని దోనెలోకి దించేరు. నౌక నవనగరతీరాన్ని వదలిపెట్టేసింది.

ఇంటికొచ్చేసరికి పూర్తిగా తెలివొచ్చింది ఖానుకి. కళ్ళువిప్పేసరికి ఎదురుగా కరీమ్, హమీదా లవుపడ్డారు. వెంటనే ఒళ్ళుమండిపోయింది. కళ్ళుచింతనిప్పు అయిపోయాయి.

"నీతమ్ముడు ప్రతాపంచూశావా? దొంగవెధవతో సావాసంచేసి కష్టపడిపట్టిన ఖైదీలను నాచేతనే విడిపించేడు."

హమీదా:—దొంగవెధవెవరూ?

ఖాన్:—వాడే, నిన్నవచ్చి బిరుదమునిచ్చిన గనీయే.

కరీమ్:—ఆబిరుదు నీకాయిచ్చేడు. బలే ఏంసాహసం!

ఖాన్:—ఏమిటలాగంటున్నావు.

కరీమ్:—బావగారి తెలివికి ఆశ్చర్యపడుతున్నాను. నీవేమిచేశావని నీకాబిరుదిచ్చేరని పుచ్చుకున్నావు. అది నవసారప్రతినిధి రసూల్ ఖానుది. పాదుషావారి అజ్ఞలపైనేనది వానికొరకు తీసికొనిపోవుచుండగా నన్ను బంధించి నావలన అన్నిసంగతులను గ్రహించి కదంబుడొనర్చిన మాయయిది.

ఖాన్:—ఆ ఆ ఇంతద్రోహమా. ఆఖరికి బిరుదుకూడా నాదికాదూ? ఛీ నువ్వు కూడబట్టే వాడింత సాహసంచేయగలిగేడు. వాడట్టులే గనీ అనిచెప్పుకుంటూఉంటే హమీదాఏనా అనుమానించలేదు.

హమీదా:—నేనప్పుడే అనుమానించేను.

ఖాన్:—పోల్చుకునే ఇంతపనీచేశావా భ్రష్టా! నాతో చెప్పవద్దూ.

హమీదా:—నన్ను చెప్పనిచ్చేరా? నేననుమానిస్తూంటే కసిరి అవతలకి పొమ్మన్నారు కదూ? అనవసరంగా మీచేత చివాట్లెందుకు తినడం అని నోరుమూసుకూరుకున్నాను.

ఖాన్:—ఏడవలేకపోయినావు. తెలివితక్కువ మొద్దు. మీరిద్దరూ శనిగ్రహాల్లాగ దాపరించేరునాకు. పొండి అవతలకి. మీమొహంచూస్తే అసహ్యంవేస్తున్నాది.

కరీమ్:—బావా! కదంబుడిమాటలు మరచిపోయినావేమిటి? దయగాచూడకపోతే నల్లగుండెల్లో నిద్రపోతాడట సుమా!

ఖాన్:—అసే మీయిల్లు బంగారంగానూ! ఇదొకటా నాప్రాణంమీదికి. సరే.

# మొఱ్ఱో వానదేవుఁడా!

(సంపాదకుఁడు) సీరిపి ఆంజనేయులుగారు

రాయలసీమయందు దవాడిగ 'కొటిచ' యను నొక యనాగరికజాతివారుగలరు. వీరు గ్రామవాసులనరాదు. పురబాహ్యమున బీళ్ళలో బిడారములఁగల్పించుకొని యందు వసించుట వీరికాచారము. పందులను మేపుట, వాని నమ్ముకొని జీవించుట వీరి కులవృత్తి. చౌర్యము నింద్యకర్మముగ భావింపని జాతియిది. వఱపుసమయములం దీజాతిస్త్రీలు మట్టిముంతలలో నీరుపోసి యందుఁ గప్పలుంచుకొని తంగెడాకులచేఁగప్పియుంచి వానిఁజేతఁబట్టి యూరూరుఁదిరుగుచు నింటింట 'మొఱ్ఱో వానదేవుఁడా!' అను నీక్రిందిపాట పాడుచుండుట చిరకాలమునుండి వాడుకలోనున్నది. ఆసమయమున నొక్కొక్క యిల్లాలు ఆస్త్రీల తలపైఁ జెంబెడునీరుపోసి చేటతోఁగొట్టి చేరెడుధాన్యముపెట్టి వారిని బంపుచుండును. ఈకొటిచజాతిస్త్రీల యిట్టి మొఱలు తొలుత వర్షాగమనమునుద్దేశించియే అయియుండునేమొ! క్రమక్రమముగ అవి భిక్షాటనముక్రింద మారినవి.

### కప్పమ్మపాట

'మొఱ్ఱో వానదేవుఁడా!' అని ప్రతిచరణముతుదిని పాడవలెను.

వానాలుగురువాలె వంకాలూదొరలాలె
ఉత్తరాదివానాలు ఉరిమిగురువాలె
కపిలెతోలేవారి కాళ్ళతీపులూ
గుంట్కతోలేవారి గుండెనొప్పుల్లూ
దుక్కిదున్నేవారు దుకులపోతారు
రాట్నాలొడుకాలేక చింతపోయారు
వానలేనికూర వాడిపొయ్యింది
కూరగోయనియమ్మ గుండెపగిలింది
నీళ్ళులేనికప్ప నిగిడిపొయ్యింది
బళ్ళారివాకప్ప బండిమీదొచ్చింది
సింగసమలాకప్ప చిట్టికప్పమ్మ
ధర్మావరంకప్ప దండికప్పమ్మ
వానదేవునికేలో దయరాకపొయ్యింది
కప్పమ్మతల్లిని కప్పిపెట్టొద్దు.

ఉత్తరాదివానాలు ఉరిమికురిసేను
పడమటివానాలు పారెవానాలు
తూర్పువవానాలు తుమ్మల్లవానాలు
చీమలకుకురిసేను చిన్నవానాలు
చేటంతమొగులొడ్డె చెఱువుపాఱింది
చెఱువులునిండాలె మరవలుపారాలె
పంటాలుపండాలె పదిమందిబతకాలె
బళ్ళారివానాలు బారీవానాలు
నెల్లూరిదేశాన నెలమూడువరుసాలు
చేదాలుపేదాలు కలిసిబతికేరు
కలిగినమ్మగారు కన్నూలచూడారు
కప్పమ్మనీళ్ళాడె కడవలకొద్దీవానగురిసె
రెడ్డమ్మనీళ్ళాడె దొడ్డిదొర్ల వానగురిసె.

### వానదేవునిపాట

పగలుదున్నినదుక్కిలోనే పదునుచేయర
గాలివచ్చుగడియలోనే గప్పునుప్పునముంచరా
గడ్డిదున్నినచేలలోనే గడ్డిముంచర
గాలిమేఘుఁడు వానదేవుఁడు కలిసిరావలె
వట్టిజొన్నలు మోసులెత్తునువొయ్యకారి
(దేవుఁడా! అని ప్రతిచరణముతుదిని)

# ఆత్మప్రేరణము

శ్రీమతి కొత్తపల్లి కౌసల్యాదేవిగారు

శశిముఖీదేవి:—అమ్మా! దేశసేవాకృత్యములకు వలయు సుగుణదీపములు మీహృదయములో వెలుఁగుచున్నవి. ఆదీపకాంతులచే నాహృదయాంధకారమును దొలఁగింపుము! చిరవాంఛితమగు మీదర్శనభాగ్యము నేఁడు లభించినది.

స్వరాజ్యలక్ష్మి:—ప్రియసఖీ! ప్రపంచమున నొకరినొకరు శ్లాఘించుకొనుచుండుట నేఁడొకసాధారణకర్మ. దానికేమి? దేశము నుద్ధరించుటకు బద్ధకంకణులై యెందఱో వీరవరులగు భారతపురుషులు; ఎందఱో పరమసుకుమారలగు సాధ్వీమతల్లులు తమ సర్వస్వము ధారవోసిరి. రానున్న విపత్తుల నెదుర్కొనుటకై వారికి మిగిలిన దొక్కప్రాణమే! అదియుఁ జెల్లింపక వారు తృప్తిపడరు. అట్టిచో నాపర్వతముల చెంత నీపరమాణు వెంత? నీకును మించినదేమియులేదు. నీవు సేవారంగమున నుపక్రమింప సంసిద్ధవుకమ్మా. ధర్మాచరణమునకు ద్వారమెప్పుడును దెఱచియేయుండు.

శశిముఖీదేవి:—అమ్మా! సంసారభారము తలఁదాల్చి జాతి క్రింది మందాకమునలెనుండు నాకీప్రభావమెటులబ్బును? అయినను కొలువుగుదిరిన యుద్యోగిభార్యకు స్వేచ్ఛ యెక్కడిది? ఈధర్మయుద్ధమునఁ బాల్గొనెడిహక్కు నాకులేదు.

స్వరాజ్యలక్ష్మి:—అట్లనకుము! బయటివారెవ్వరు స్వేచ్ఛను దానమియ్యరు. నీకులోనైనహృదయమే దానినిచ్చును. ఇచ్ఛయున్నచో త్యాగమెంత సులభము? అది కవాటము తెఱచినట్లొక్కత్రుటిలో వచ్చిపడును. అటుపై నేదియుఁ గర్తవ్యము నడ్డగింపదు. ఇఁక నీపతి యుద్యోగప్రతిబంధమెంత? అంతయెందుకు? ఈసమరము బాలురు, వృద్ధులు, స్త్రీలు అను భేదములేక యెల్లరకును సాధ్యమైన శాంతిసమరము. ఇందుఁ బురుషులకన్న అబలలే ప్రబలలు. వీనికై ఇల్లు, వాకిలి, సంసారము ఏదియు వీడనక్కఱలేదు. నీగృహమే రణరంగము. రాట్నమే నీయాయుధము. ఖద్దరుధారణమే నీవిజయలాంఛనము. ఈమాత్రమునకుఁ జాలవా సోదరీ!

శశిముఖీదేవి:—ధన్యురాలను! మీరాకచే నేఁడు మాగృహము పవిత్రము. కర్తవ్యమంత్రముపదేశించిన మీకు వినమ్రనై మ్రొక్కుచుంటి.

స్వరాజ్యలక్ష్మి:—ఈమ్రొక్కుబడులు నాకక్కఱలేదు. (పటమువంకఁజూపి) అదుగో! ఆమహాత్ముని కర్పింపుము. ఈకర్మయోగమున కల్ల నతఁడే మూలగురుఁడు. చూడుము! ఒకజీర్ణతాళపత్రసంపుటములో నిమిడియున్న కవిత్వమహిమవలె ఆబడుగుదేహములో నొకమహాజ్యోతి ఏకాగ్రముగ వెలుఁగుచున్నది. అది పొగలేని యగ్ని. మచ్చలేని చందమామ.

శశిముఖీదేవి:—నిశ్చయము! ఓతండ్రీ! ఇట్టి శుద్ధదివ్యస్వరూప మేయుగమున విశ్వసమ్మోహనపదక్షమై రంజిల్లినది? నేఁడు నీకుఁ జెల్లినదిగాక! నీమహత్వము ఈసృష్టివలె అగూఢము నిగూఢమునైయున్నది. అది పాండిత్యములేకయే తెలియును. ఉన్నను దెలియదు. నావల్లనయ్యెడు ఈనమస్సులైనను బరిగ్రహింపుము, మహాత్మా!

స్వరాజ్యలక్ష్మి:—నెచ్చెలీ! నేఁడు విజయలక్ష్మీదేవిగారి యాజమాన్యమున జరుగు పతాకవందనోత్సవములోఁ బాల్గొన ధైర్యమవలంబింపుము. రమ్మా! పోవుదము! (నిష్క్రాంతము)

## పతాకవందనోత్సవము

విజయలక్ష్మీదేవి:—భారతనారీమణులారా! ధర్మమే జయము. ధర్మములేనిచో జయములేదు. మననిపు డనుభవించుచున్న దాస్యము మనలో ధర్మము శుష్కించినదనుటకైన గుఱుతు. మిథ్యామతము, శుష్క-

వేదాంతము, మూఢదురాచారము, అంధవిశ్వాసము, దంభైకజీవనము మున్నగు చెడుగులెన్నియో మనలఁజేరి ధర్మమును హింసించినవి. మానవధర్మమును హింసింపరాదనుటయే మహాత్ముని అహింసాతత్వమునకు అర్థము. నిర్వ్యాపారము, భోగపరాయణత్వము వీనిచేఁ బురుషజాతి నిర్వీర్యము. అస్వతంత్ర్యము రాణివాసము వీనిచే స్త్రీజాతి యధఃపతితము. పరపీడనము, కుక్షింభరత్వము వీనిచే అగ్రజాతి స్వార్థదూషితము. ఇఁక ధర్మమునకుఁ దావేది? మీఁదు మిక్కిలి ఇవి శాస్త్రసమ్మతములని ప్రమాణములఁజూపు బుద్ధిజాడ్యమునకులోనై విఱ్ఱవీగుట ఎంతటి యపహాస్యము? దేశము, కాలము, పాత్రము, ఆత్మబుద్ధి వీనికంటె మనుజధర్మమును శాసించు పరమప్రమాణములెవ్వి? ఏరుయెండ కాగొడుగనునట్లు ధర్మము నుచితగతిని నడపింపక చెడితిమి. రత్నముపోయినవెనుక పెట్టెను భద్రపఱచినట్లు ధర్మశూన్యమగు పట్టియాచారమును నిష్ఠతోఁ బదిలముచేసితిమి. పుణ్యముచే ఆర్యులమై పుట్టితిమనుట బూటకమొనర్చితిమి. ఇట్టి తప్పిదమునకైన దండనయే ఈదాస్యప్రారబ్ధము. ఈప్రారబ్ధ మంతరింపఁజేయుటకు కారణజన్ముఁడై మహాత్ముఁ డవతరించెను. ఇపుడమ్మహాత్ముని సత్యసందేశము మన దుర్భ్రమలనన్నిటిని దుడిచిపెట్టినది. మన హృదయపీఠములు శుద్ధిచేయఁబడినవి. వానిపై మరల ధర్మదేవత యధిష్ఠితయగుచున్నది. శక్త్యనుసార మీధర్మవ్రతము నిర్వహింపవచ్చు. దీనికై ధనరాసులు వెదజల్లనక్కఱలేదు. రక్తధారలు కురియింప నక్కఱలేదు. తుదకు రాట్నముచేపట్టి ఖద్దరుధరించినఁ జాలు. అంతతో మనదాస్యము వినశ్యమగును. జయము సిద్ధించును. ఇదే మనధర్మము. మనమార్యులము! ఆర్యనామమున కర్థము ప్రపంచము తెలిసికొనుగాక! మన యంతరంగములలోఁ బునఃప్రతిష్ఠితమగుచున్న జాతీయధర్మముయొక్క బాహ్యచిహ్నమే ఈజాతీయపతాక! నిక్కపుభక్తితో నిజమైన పరమార్థబుద్ధితో భరతమాతను స్మరించి ఏకోన్ముఖముగా ఈజాతీయపతాకకు మోకరిల్లి మ్రొక్కుడు. ఓకృపాసింధూ! దీనబంధూ! మాహృదయములకు దార్ఢ్య మనుగ్రహింపుము.

జయ భారతజనయిత్రికి జై! జయ గాంధిమహాత్మునికి జై! జయ జాతీయపతాకకు జై!

## చాషమిథునము

నాదెళ్ల వేంకటరావుగారు బి. ఏ.

పట్టపగలెల్లఁబొట్టకై పాటుపడిన
శ్రమ మపనయించుకోరిక సందెవేళ
దినము మాయూరికై లువంతెనకుఁ జనుచుఁ
గూరుచునివతు నొంటిమైఁగొంతసేపు.
సరిగనచ్చోటికే నేఁగుసమయమునకె
చెంతఁగనుపించు నలసీమచింతచెట్టు
మీఁదికెగురుచునేతెంచి యాదరమునఁ
బాలపిట్టలు రెండు నుయ్యాలలూఁగు.
ఏమిభాషించుకొనునో నేనెఱుఁగకున్న
నతిమధురములువానికూజితములహాహా!
రాగతాళాదు లెఱుగంగరాకయున్నఁ
జెవులకింపైన సంగీతరవమువోలె.

మాటిమాటికినిగలుపుచుముద్దులాడు
మెడమెడనుజుట్టి పెనవైచిమేలమాడు
లీలఁబలిటీలుగొట్టుచు వ్రాలిసోలుఁ
బాలపిట్టలజంట సంబరముమెఱసి
వన్నెవన్నెలదేహముల్ వంచివంచి
గఱులువిదలించుకొను సోయగంబుఁగాంచి
పిట్టనై భూమిపై నేలపుట్టనైతి
ననుచుమిక్కిలివగతు నేననుదినంబు.
భోగభాగ్యంబులకుఁ జింతఁబొందఁబోవు
నగలకోసముకయ్య మెన్నటికిరాదు
బ్రతుకుకేలాగురేపను బాధలేదు
పక్షులదెగద దివ్యదాంపత్యమవుర!

# కబీరు

వేంకట కాళిదాస కవులు

సాలెవాఁడగు కబీరు దేవప్రేమకు పాత్రుఁడని జనులవిశ్వాసము. అతఁడిచ్చు దివ్యౌషధములకొఱకు, అతని యమానుషప్రజ్ఞలఁ దిలకించుకొఱకు జనులు గుంపులుగుంపులై నిరంతర మతనిఁ బరివేష్టింతురు. కాని యతఁడు కలఁతపడినాఁడు; ఇంతదనుక అతఁడు తనపాటలతో, తనదేవుని సాక్షాత్కారముతో మధురించుటకు అతని నిమ్నజాతి ఒక అమూల్యమగు ననన్యజ్ఞేయత్వమును ప్రసాదించినది. అది మరల తనకు లభించుఁగాకయనివేడినాఁడు. దిక్కులేని ఆపరిత్యక్తునికీర్తిఁగని అసూయాపరులగు పురోహితు లతని అవమానింపఁదలఁచి ఒకవేశ్యను ముందిడుకొని బయలుదేరిరి. తాను స్వయముగ నేసినబట్టల నమ్ముటకు కబీరు అంగడికివచ్చెను. ఆవేశ్య కబీరుహస్తముపట్టుకొని అతని యవిశ్వాసపాత్రతకు నిందించి తానతనిచే విడువఁబడనొల్లననుచు అతని ఇంటివరకు ననుగమించెను. అపుడు కబీరు తనకుఁదా నిట్టులనియెను: "దేవుఁడు భక్తుల ప్రార్థనలకు తన యిచ్చవచ్చినరీతినే ఉత్తరమొసఁగుచుండును." వెంటనే ఆవనిత భయభ్రాంతయై అతనిపాదములపై వ్రాలి "నాపాపములబారినుండి నన్ను రక్షింపుము" అని యరచెను. "భగవంతుని జ్యోతివంక నీజీవితమును తెరచుము" అని కబీరు పలికినాఁడు. కబీరు బట్టలు నేసికొనుచు పాటలు పాడినాఁడు; ఆపాటలు ఆమె హృదయములోని మాలిన్యమును కడిగివైచినవి; తత్ప్రీతిగా ఆమె మధురకంఠస్వరములో నివాసము గనుఁగొన్నది.

ఒకనాఁడు రాజు తానొకమనోవికృతికిలోనయి తనసాన్నిధ్యమున పాడుటకు రమ్మని కబీరునకు కబురంపినాఁడు. అనిష్టసూచకముగా కబీరు తలత్రిప్పినాఁడు. రాజాజ్ఞ జరుగునంతకు సందేశహరుఁ డతనిగుమ్మమునువిడిచిపోవ సాహసింపలేదు. కబీరు రాజభవనము ప్రవేశించినంతనే రాజును, సభ్యులును ఆశ్చర్యచకితులైరి; కబీరొకఁడేరాలేదు. అతనితో ఆవనితయు వచ్చినది. కొందరు చిరునవ్వు నవ్విరి; కొందరు కనులెఱ్ఱచేసిరి. ఆభిక్షుని గర్వమునకు, లజ్జాహైన్యమునకు రాజుముఖము నల్లబారినది. అవమానితుఁడై కబీరు గృహమునకు మరలివచ్చినాఁడు. ఆవనిత అతని పాదములపైఁబడి "గురూ! నాకొఱకు నీవేల ఇట్టి అగౌరవము నంగీకరించితివి? నాయపకీర్తి నేనే భరించి యనుభవింతును మరలిపోనిమ్ము" అని పలికినది. "అవమానచిహ్నితుఁడై నాదేవుఁడు వచ్చినపుడతనిని నేను పైకిఁబొమ్మన సాహసింపఁజాలను" అని కబీరు పలికినాఁడు.

# "ఏంచేస్తామో చూడు నిన్ను"

పమ్మి రామశాస్త్రిగారు

కష్టపరంపరలతో కృంగిపోయే హృదయసాగరంలో కనుగందుల తొక్కుపలుకు లొక్కొక్కప్పుడు ఆశావీచికలను బయలుదేరదీసి అంతులేని ఆనందాన్నికలుగజేస్తూ ఉంటాయి. భోజనానంతరం రోజూ రాత్రి దొడ్లో బాదంచెట్టుక్రింద కూర్చుని చెంబులుతోముకుంటూ, తనకష్టాలను తలపుకుతెచ్చుకొని విచారిస్తూఉండే సుశీలకు ఒక్కొక్కప్పుడు బ్రహ్మానందమైపోయేది చంద్ర చెప్పేకబుర్లు వింటూవుంటే.

నాడు అమావాస్య. చీకటికాటుకమ్ముకు వచ్చింది. యథాప్రకారంగా భోజనాలైనతరువాత తనపని మీద దొడ్లోకి బయలుదేరుతూ "నాన్నా! చంద్రం నీవీమంచంమీద కూర్చోవేం! అమ్మ, నేనక్కడ బాదం చెట్టుక్రింద కూర్చుని చెంబులుతోముకుంటూ ఉంటాను." అంది మెల్లగా సుశీల.

"ఆ......ఆ......ఆ......ఏమో బాబూ; నేనుకూడా నీదగ్గరేకూర్చుంటాను బాదంచెట్టుదగ్గర" అన్నాడు చంద్రం.

"నాన్నా! నీవుబుద్ధిమంతుడవుకావూ, ఇంచక్కా రేపు మామయ్యవస్తాడు. మిఠాయి—బాదుస్సలూ లాగూ—చొక్కా—గొడుగూ—అన్నీ తెస్తాడు. నీకియ్యద్దూ మరీ?"

"ఆ...... నేనూవస్తానూ............"

"బెల్లంముక్క పెడతాను. తింటూకూర్చోవేం బాబూ, పోనీ."

"ఊ......ఊ......నాకేమీవద్దు......ఊ......ఊ..."

"చీకటిరా! బాబూ ఎల్లాచావను? గంపంతబలగముండీకూడా దిక్కుమాలిన పక్షినైపోయాను. ఎన్ని కబుర్లేనా పంపేను. ఎవరూపంగివాలరు. తొంగిచూడరు. ఒక్కతెనూ ఈచాకిరీ చేసుకోలేకుండా ఉన్నానని జాలిపడేవారెవరు? ఉదయాస్తమానాలు ఈవిధంగా దొరుతోంటే మాటదక్కటంలేదు—చివాట్లూ చెప్పు దెబ్బలూ—రామరామా, కాళ్లు లాక్కుపోతున్నాయి. నాకు మరణమేనా కలుగజేయడు ఆమాయదేముడు. పోనీపిల్లాణ్ణిఆడిస్తూ మాటాపలుకూ ఆడుతూ నాకుసహాయ్యంగాఉంటుంది సూరినిపంపించమని నాన్నకు ఎన్ని కబుర్లంపినా అజాపజాలేదు. దూరంగాఉన్నానని ఈవిధంగా మహోన్నతరసాలసాలశాఖాగ్రఫలంగా విడిచేశారు గాబోలు. పోనీ విడిచేయండి. ఈఫలం ఎప్పుడు రాలిపోతుందో, ఎప్పుడు వృక్షభారం తగ్గుతుందో అనేనేనూ ఆలోచిస్తూవున్నాను. ఈనలుసుపై ఇంకాకొంతఆశపెట్టుకొని మంచిదినాలు రాకపోతాయా అని వెనకముందు లాలోచిస్తున్నానుగాని, లేకపోతే ఈపాటికి అక్కడ మీభారాన్ని—ఇక్కడ వీరిభారాన్ని తగ్గించేదాన్ని"అని విలపిస్తూ, దుఃఖభారవివశరాలై దగ్గరగానున్నగోడకు తలవాన్చి అట్టే క్రుంగిపోయింది.

* * * *

తల్లి ఈవిధంగా దుఃఖముతో వీగిపోవడంచూచి "అమ్మా లే.........అమ్మా! లేవవే......"అన్నాడు చంద్రం ఏడుస్తూ. సుశీల తలపైకెత్తలేదు.

"అమ్మా! నాకు నిద్దరొస్తోంది—లేవలే. ఊ...ఊ..."అని చెయ్యిపట్టుకు లాగేడుచంద్రం.

అప్పుడు సుశీల తనకొంగుతో కళ్లుతుడుచుకొంటూ "రా, నాయినా...రా—పడుకోపెడతాను" అంటూ చంద్రాన్ని చేరదీసి ఎత్తుకొని, మంచంమీద పడుకోపెట్టి కొంతసేపక్కడ కూర్చొని, తిరిగి దొడ్లోకి వెళ్లాలని లేచింది. సుశీలలేచినవెంటనే "అమ్మా..."అనిపిలుస్తూ లేచికూర్చొని "నేనూవస్తాను"అని ఏడ్వడం మొదలుపెట్టేడు చంద్రం.

"అర్ధరాత్రయినా అపరరాత్రయినా నేను మేల్కోడం తప్పదు. నీకుకూడా ఎందుకుగా బాబూ ఈబాధ, సుఖంగాపడుకోక" అంటూవచ్చి మంచందగ్గర నిలబడింది సుశీల. "ఎత్తుకో...ఎత్తుకో..."అని రెండు చేతులుచాచి మంచంమీద నుంచున్నాడు చంద్రం.

"చీకటిరాత్రిళ్లురా బాబూ, పురుగూబూచ్రీ వుంటుంది. ఇందాకా అన్నంతింటూవుంటే పాముని చంపేను. నీవుచూశావుగా, చెప్పినమాట వినవు."

"ఆ......ఆ......ఆ......"

"సరే—రా—అన్నిటికీదైవమే ఉన్నాడు"అని ఎత్తుకొని దొడ్లోకితీసుకొనివెళ్లి దగ్గరకూర్చోబెట్టుకుంది.

*　　　*　　　*　　　*

"అమ్మా! నాకు మామయ్యకొత్తలాగూ—చొక్కా—బూడ్సులూ—బుల్లిగొడుగూ, తెస్తాడన్నావు. ఎప్పుడొస్తాడే?" అన్నాడు చంద్రం.

"రేపువస్తాడు." అంది సుశీల.

"మామయ్య దేవూరే అమ్మా?"

"ఏలూరు"

"ఉహూ...ఏలూరా?..."

"ఐతే మామయ్యంటే ఎవరే అమ్మా."

"మామయ్యంటేనా, మాఅన్నయ్య."

"ఊహూ, మీ అన్నయ్యా."

"మరి పిన్నంటేనో..."

"పిన్నంటే ఇంకోఅమ్మ"

"ఆ...ఉత్తదీ...అబద్ధంచెప్పేవు. రామానికీ, వెంకటానికీ, వాళ్లకీ ఇంకోఅమ్మ లేదేంమరీ."

"వాళ్లకు ఇంకోఅమ్మ లేదులే."

"పిన్ని దేవూరే అమ్మా"

"పిన్ని దేవూరో నాకు తెలియదురా నాన్నా!"

"పోనీలేగాని పిన్నిమనింటికీవేళభోజనానికి రాలేదేం" అన్నాడు చంద్రం ఆవలిస్తూ.

"పిన్నికి నామీదకోపంవచ్చింది." అంది సుశీల.

"ఎందుకూ, కోపం"

"నేనుపొద్దున్నే వేడిబువ్వ ఒండిపెట్టలేదని."

"మరిరోజూ పొద్దున్నే నాకూ, నాన్నకూ, పిన్నికీ వేడిబువ్వ ఒండిపెడుతున్నావుగా."

"ఈవేళా వేడిబువ్వవండేను—అది కొంచెం చల్లారిపోయిందనీ."

"పోనీ వేడిబువ్వ పిన్నే వండుకోకూడదూ, రోజూ"

"ఓరివెర్రినాన్నా, మీపిన్నిని అన్నం ఒండుకోనిస్తారురా మీనాన్న? అన్నం ఒండితే మీపిన్ని అలసిపోదూ?"

"మరినీవు అలసిపోవూ?"

"నాకు అలసిపోవడం రోగంఏమిటి?"

"ఆ...నిజంగా చెప్పవే అమ్మా, నీవు అలసిపోవూ?"

"అలసిపోలేమాత్రం తప్పుతుందా, నాయినా!"

"ఎప్పుడూ నీవేవండడం ఎందుకు? అంతఅలవడం ఎందుకు? పిన్నికూడా వండకూడదూ పోనీ?"

"పిన్ని వండితే మనంతినొచ్చా? మనం బ్రాహ్మలంకాదూ—"

"పిన్ని బ్రాహ్మలు కారేమిటే? అమ్మా!"

"కాదు. కాదు."

"ఊహూ...అన్నంవండకపోతే పోనీ, ఇంట్లో ఇంకేంపనులూ చేయకూడదటే, ఎప్పుడూ నాన్నతో మాట్లాడుతూ మేడమీద కూర్చోకపోతే."

"అయ్యో, కొంపమునుగుతుంది పిన్నికివినిపిస్తే; గట్టిగామాట్లాడకురా బాబూ!" అంది సుశీల మెల్లగా.

"వింటే ఏంచేస్తుందీ?"

"ఏంచేస్తుందా, మొన్న చూశావుగా. అల్లాగే మీనాన్నగారిచేత కొట్టిస్తుంది."

"పిన్ని మంచిదికాదే అమ్మా...నన్నూ అల్లాగే కొట్టించిందిగా ఆవేళ."

"అమ్మా! నిన్నూనన్నూ ఎప్పుడూనాన్నచేత కొట్టించే పిన్ని మనఇంట్లో ఎందుకు? అవతలకుగెంటేస్తేం?"

చంద్రం అన్నమాటలు సుశీల హృదయంలో గొప్పపరివర్తనం కలుగజేసి, నూత్నోత్సాహం ఆమె ముఖంలో వ్యక్తంచేశాయి. వెంటనే చంద్రాన్ని దగ్గరకులాక్కొని "పిచ్చినాన్నా!" అంటూ ముద్దుపెట్టుకొని "గట్టిగా మాట్లాడకురా బాబూ; ఏదోతంటా తెస్తావు" అంది సుశీల.

చంద్రం ఒళ్లువిరుచుకొని ఆవలిస్తూ "ఇంకెంతసేపే ఇక్కడకూర్చోడం. అబ్బా, నాకునిద్దరొస్తోంది. చప్పునరావే బబ్బుందాం" అన్నాడు.

"ఏపోయిందమ్మా, నడు, వెళ్లి బబ్బుందాం" అంది సుశీల.

* * * *

తెల్లవారింది 6¼ గంటల రైలుదిగినజనం తండోపతండాలుగా వస్తూన్నారు. రైలుస్టేషనుంచి "అదిగో రైలుదగ్గరనుంచి వచ్చేబళ్లచప్పుడు" అంటూచంద్రం గబగబావీధిలోకి పరుగెత్తుకువచ్చేడు.

"అమ్మో, రామారావుమామయ్యవస్తున్నాడే" అని కేకవేస్తూ వెంటనే సుశీలదగ్గరకు పరుగెత్తుకువెళ్లేడు చంద్రం.

రామారావువస్తున్నాడని వినగానే సుశీలముఖకమలం వికసించింది. "నిజంగా చెప్పరా, చంద్రం! మామయ్యవస్తున్నాడా" అంటూ త్వరగా పొయ్యిమీదనున్న యిడ్డెనుపాత్రదింపేసి, పాలగిన్ని పొయ్యిమీద పెట్టి వీధిలోకివచ్చి నుంచుంది. రామారావు ప్రత్యక్షమయ్యాడు. సుశీల కనుకొలకులనుండి నీటిబిందువులు బొటబొటరాలేయి. "బ్రతికివున్నానని ఇప్పటికేనాజ్ఞాపకంవచ్చింది. చాలాబాగాఉందిరా, అన్నయ్యా," అంది సుశీల.

"ఏమోనే, ఎప్పటికప్పుడే అల్లాఅవుతోంది, సావకాశంలేక," అంటూ ఇంట్లోకి వెళ్లేడు.

"అమ్మకు, జ్వరంవచ్చిందనివిన్నా ఈమధ్య; నెమ్మదిగాఉందా"

"ఆ...ఆ...నెమ్మదిగానే ఉంది."

"చెల్లెలును అత్తవారింటిదగ్గరనుంచి తీసుకొచ్చేరుటే."

"ఔనుఔను పదిహేనురోజులైంది."

"పోనీ దాన్నైనా తీసుకెళ్లేరు బాగానేఉంది."

"నీమీదేమైనా కోపమటే, వెఱ్ఱిదానా" అంటూఇంకా ఏదోమాట్లాడబోతోంటే, తివబల్లోకూర్చొన్న చంద్రం "నాకొత్తచొక్కా ఏదీ—నాబూడ్సు లేవీ—" అంటూఒకటే ధోరణిగా అడుగుతూ, మాటతోచకుండా చేశాడు.

"ఆ... తెచ్చాను. పెట్లోఉన్నాయి తీసిస్తాను ఆగు" అన్నాడు రామారావు.

"ఊ...చప్పునతీసియ్యీ..."

"ఇదిగో తీసిఇస్తున్నా"

పెట్లోనుంచి రామారావు చొక్కా, లాగూ తీస్తున్నాడు. అక్కడనేనిలబడిఉన్న సుశీల "అయ్యో, పొయ్యిమీద పాలు పెట్టివచ్చా పొంగిపోతున్నాయో ఏమో చూచివస్తా" అంటూ చప్పునపరుగెత్తిందిలోపలికి.

"మామయ్యకూ, నాకూ కాఫీ చప్పునపట్రాఅమ్మా" అని కేకేశాడు చంద్రం.

"ఆ...ఆ...అంది" సుశీల.

* * * *

"మామయ్యా, అదిగో ఆఏడ్పువినిపిస్తోందా? నాన్నకొడుతున్నాడు అమ్మని, కాఫీకాయడం ఇంత ఆలస్యమైందేమని కేకలేస్తున్నాడు చూశావా?"

"అరరే, నాతోమాట్లాడుతూ ఉండడంచేత కొంచెంఆలస్యమైతే కావచ్చు. ఈమాత్రానికేకొట్టాలా" అనుకొనుచూ లోపలికివెళ్లేడు రామారావు.

సుశీల కండ్లనీరుగ్రుక్కుకొంటూ మాట్లాడకుండా నిలబడివుంది. చంద్రం భయపడి సుశీలనుపట్టుకొని నిలబడ్డాడు.

"ఏం—మాట్లాడవేం—ఇంతఆలస్యం ఎందుకు కావాలి—అని కేకలువేయుచు, సుశీలభర్త కఠినంగా శిక్షిస్తూవుంటే, భయపడి గజగజలాడుతూ "ఈమాటుకొట్టు,మాఅమ్మని—నేనూ మామయ్యా నిన్నేంచే..." అంటూ బ్యారుమని ఏడ్చేడు చంద్రం.

# పార్వతి నిర్యాణము

శ్రీమతి కిల్వాల పార్వతీదేవిగారు

మానవజన్మనుంట యవమానమటంచుఁ దలంచినావొ, గం
గానదితోటిసామ్యమును గారవమొప్పగఁబొందఁగోరితో
మేనకసేమ మీవరయ మేదినిబాసియునేగినావొ, మా
మానససీమలందుఁ జెనుమంటనుగూర్చితివింక పార్వతీ!

పతియె దైవంబటంచును మతిదలంచి
అత్తమామలయాజ్ఞల కనుగుణమయి
తోటికోడండ్ర మాటలతోడనడచి
పుట్టుమెట్టుగృహాలకుఁ బుణ్యమిచ్చి
బంధుగులమధ్య బ్రతుకంగభారమనుచు
సురిగిపోయితివేమొకో సుదతి! నీవు
సంఘమునఁబిశాచంబుగాసంచరించు
ఘోషశిక్షమె నిన్నిట్లుకూల్చెనేమొ.

నీవులేనట్టి మాసద్మనిష్ఫలంబ
యిన వనముపోల్కి నున్నదో వనజనేత్ర!
మాదునిర్భాగ్యమే నీదుమరణమునకుఁ
గారణంబయ్యె నింకనేకరణిసైతు.
ఐహికసుఖేచ్ఛ యస్థిరమంచుఁ దనదు
బంధుగులవీడి పరలోకమొందినట్టి
భాగ్యవతియునై పరగుమాపార్వతికిని
నాత్మశాంతిని జేకూర్చుమా ఉమేశ!

## ప్రేమాంజలి

కర్లపాలెం కృష్ణరావుగారు

కుమారీ! పవిత్రభావపూర్ణమగు లేనగవులు నీయమాయికవదనమున చిందులు ద్రొక్కుచుండ, నిగనిగలాడు పట్టుకుచ్చులతో పిరుదులవరకు వ్రేలాడు నల్లత్రాచువంటి జడ వేసుకొని, జరీబూటా నగిషీపనిజేసిన పట్టుపావడధరించి, ప్రాణములున్న పసిడిబొమ్మమాడ్కి సంచరించుచు, యీడువారలగూడి యచ్చనగాయలాడుచు, కాలగర్భమున మాటువడి యున్న యాంధ్రయోధుల వీరగీతికల మనోహరముగ బాడుచు, జననీజనకుల నోముల పంటవై—సజ్జనానందసంధాయివై—నివసించుగ్రామమునకును—గృహమునకును వన్నెలు దెచ్చితివి. అభ్యంజనానంతరము తడియారజాలుగావదలిన కేశపాశములెగురుచు గాలిలో విలాసముగ నాట్యమునలుపుచుండ—అప్రయత్న హాసోన్మత్తవై—కల్లకపటములెఱుగని నిష్కల్మషహృదయముతో, వనమధ్యమున నొయ్యారముగ నుయ్యాలలూగుచు, కవితాకన్యయో—వనదేవతయో—యను భ్రాంతిగల్పించి, సృష్టి కొకవింతయందమునుగూర్చితివి. సకాలమునకు సక్రమముగ జదువుకొనుచు, వీలగునపుడెల్ల గానకళనభ్యసించుచు, మధ్యమధ్య యవకాశముననుసరించి తల్లిదండ్రులకు చేదోడువాదోడుగనుండి, యోపికతో నింటిపనులను సవరించుచు, కాలమును సద్వినియోగముజేసితివి. జననీజనకులలోగాని, బంధుమిత్రులలోగాని, ఒకరు రోగపీడితులై యున్నప్పుడు, అనుభవజ్ఞానశూన్యవగు నీవు నిద్రాహారములుమాని, విసుగుకొనక, రోగికిసేవజేయుచు, అసహ్యమనుమాటమఱచి, నిపుణమతివై ఉపచారములజేసి, నీదయార్ద్రహృదయమును జాటితివి. ఇట్టి నీశక్తిసామర్థ్యములను యథామతిని గుర్తెఱుంగుట కష్టతరము. బాలా! జన్మమనగ నీదేజన్మము. సౌభాగ్యవతీ! నీకాశీర్వచనములు.

* * * *

ప్రేమస్వరూపిణీ! నిన్నత్యంతగారాబమున బెంచిన తల్లిదండ్రులను-దాసదాసీజనంబులను వీడి, యెచ్చటనుండియో వచ్చిన భర్తయే దైవమని సంభావించి, కేవలము ధర్మమునకు కట్టుబడి, ఆనీభర్త సన్మార్గుడో-దుర్మార్గుడో-సరసుడో - విరసుడో-ఉత్తముడో - నీచుడో-గుర్తెఱింగి ఆతనిహృదయాంతరాళమున బ్రవేశించి, ప్రణయబీజములనాటి, నీయున్నతాశయములను, విశాలహృదయమును, సమయానుకూలముగ సర్దుకొని, భావముల నేకీభవింపజేసి, పాపభూయిష్టమగు నీపాడులోకమును స్వర్గతుల్యముజేసి, నీభర్తనానందవార్ధినోలలాడించితివి. ముట్టినమాత్రమున ముడుచుకొనిపోవుగులాబీకాంతులను వెదజల్లుశరీరచ్ఛాయగల్గి, సర్వాంగసౌందర్యసౌష్టవాభివృద్ధినొందిన, నవయౌవనదివ్యతేజముతో, సర్వప్రపంచము నాడించగల శక్తిగలదని చాటు వాల్గన్నులవైఖరితో-బాలకురంగముభాతి గృహమందిరప్రాంగణములయందు సంచరింపుచు,-చీకుచింతలను బారదోలి-కష్టపరంపరలనరికట్టి-కంటిఱెప్పవలె గాపా

చుచు,-నాథుని స్వర్గసుఖముల దేర్చితివి. నోములని-వ్రతములని-పసుపుకుంకుమలని-పారాణి యని-అతిథులని-అభ్యాగతులని-దానములని - ధర్మములని - పవిత్రహృదయముతో భర్తను సన్మార్గమునకుద్రిప్పి, గృహలక్ష్మివై సర్వసంపదలనొసంగుచు శారదవై విజ్ఞానవెల్లువను ప్రవహింపజేసితివి. నీప్రాణప్రియుడు పరవనితాప్రణయపాశబద్ధుడై - అక్రమప్రవర్తనుడై, నీనిష్కల్మష ప్రేమానుబంధమును త్రెంపివేసి, నిన్నగచాట్లపాలుజేయుచున్నప్పుడు సైతము, అసూయవహింపక, యీర్ష్యబోనాడి, కోపమునువీడి, దైవముపై భారముంచి, మంచిదినములకై నిరీక్షించుచు, అత్యద్భుతమైన నీపాతివ్రత్యమహిమను లోకమునకుజాటి, యిష్టఫలసిద్ధిని బొందితివి. నిశ్చయముగ నీవు శక్తిస్వరూపిణివి. జన్మమనగ నీదేజన్మము. ఓ మహిమాస్పదహృదయయగు స్త్రీమూర్తీ! నీకిదే ప్రణుతాంజలి.

* * * *

తల్లీ! అమృతస్వరూపిణీ! మోపలేని భారమువహించి, నవమాసములుమోసి, పుత్రోదయమయ్యెనని మహోల్లాసముననైమఱచి, తృటిలో యానందమూర్తివై పోతివి. ఆపసికూనను-అభముశుభముదెలియని యర్భకుని, యాలింగనాభాగ్యము ననుభవించుచు, అష్టకష్టములకులోబడి సాకుటకు ప్రారంభించినప్పటి నీయోర్పు-నీయాదరణ-నీయనిర్వచనీయమైనప్రేమ-నీశ్రమ-వర్ణింప నెవరితరము? ఇంతలాలించిపెంచి, పెద్దవానినిజేసి "తల్లికన్న వేరు దైవములేదు" యనువాక్యమును సార్థకపరచి విద్యాబుద్ధులగరపి, వివాహాది శుభకార్యముల నత్యంతశ్రద్ధతో జరిపి, సర్వకాలసర్వావస్థలయందును తనయుని యభివృద్ధి కాశపడుచు, అమూల్యములును ననివార్యములునునగు యాశీర్వచనముల నొసంగితివి... గాని...ఆనీతనయు డార్జనాపరుడై -అవివేకియై-సుఖలాలసుడై -భార్యాలోలుడై -నిన్ననరాని మాటలని, గ్రుక్కెడుగంజియైనబోయక, నిరసించి నిష్ఠురోక్తులాడునప్పుడుసైతము, పల్లెత్తు మాటాడక, పుత్రశ్రేయోభిలాషవై, భగవంతుని బ్రార్థించుచు, నీవువహించిన సహనభావమును - ఆనీపవిత్రహృదయమును - ఆకరుణార్ద్రచిత్తమును - గ్రహింప నెవరికిసాధ్యము? జన్మమన నీదేజన్మము - నీవుజన్మించిన స్త్రీజాతియే జాతి. ఓమాతృదేవీ! సాష్టాంగదండప్రణామంబులు.

* * * *

శృంగారరసస్వరూపిణియగు మోక్షప్రదాయినీ! నీవు ప్రేమమయివి. నీదేహమందలి ప్రతిరక్తనాళమునందును ప్రేమతరంగము లుప్పొంగుచుండును. జాలియే నీప్రేమకు ప్రథమసోపానము. ప్రతిఫలశూన్యముగ ప్రేమించుటయే నీస్వభావము. నీమహిమనెఱింగి దేవాదిదేవులు సైతము నిన్నారాధించి మార్గదర్శకులైరి. నీజాతి పూజనీయమైనది. నీవులేని లోకము చంద్రుడులేని వినువీథిచందము. పవిత్రమూర్తీ! ఆదిలక్ష్మి! అనురాగపూరితహృదయుడనై, భక్తిశ్రద్ధలతో నర్పించు పవిత్రప్రేమాంజలిని స్వీకరింపుము.

# అక్క

**చిరుమామిళ్ల శివరామకృష్ణప్రసాదుగారు**

౧

ఒక్కొక్కనిర్భాగ్యురాలపాలబడే క్రూరుడగు భర్తయొక్క దుశ్చేష్టితాలను వర్ణించివర్ణించి 'అలాంటి భర్తనోట నిప్పుబడ' అని తనకోపాన్ని వెల్లడించింది తార.

ఇందుకు జయగోపాలబాబు భార్య చాలా నొచ్చుకున్నది; ఎట్టిపరిస్థితులలోనైనా సిగికెట్టుకుచెందిన నిప్పుతప్ప వేరేవిధమైనదనిప్పు భర్తనోటవుండాలని అనుకోవడము స్త్రీజాతికితగదు అని తనమాట కడ్డుచెప్పి నందుకు తార మండిపోయి 'అల్లాంటిభర్తకు భార్యగావున్నదానికంటె, ఏడుజన్మాలవరకు వెధవగాఉండటం మంచిది'అని కసరుకుంటూ వెళ్లిపోయింది.

శశి తనలో "భార్యకంత హృదయకాఠిన్యమును ప్రబలజేయు భర్తనేరమేమో ఊహించుట కష్ట"మని అనుకున్నది. ఇంతలోనే దూరదేశమునందున్న భర్తమీదిప్రేమ ఆమె హృదయమునుండి పొంగిపొరలింది. పాన్పుపై భర్తపరుండుభాగమున చేతులుచాచి ఆమె వాలిపోయింది; తలగడ ముద్దెట్టుకున్నది. గదితలుపులు మూసి ఒక కొయ్యపెట్టెనుండి రంగుపోయిన ఒకపాతఫోటోను తనభర్తవ్రాసిన జాబులనుతీసి వాటివైపు రెప్పవాల్చకచూస్తూకూచున్నది. ఆలాగా ప్రశాంతమధ్యాహ్నకాలమును ఒంటరిగాగడిపింది; పూర్వపుసంగతులను తలుచుకుంటూ; దుఃఖాశ్రుకణములురాలుస్తూ.

శశికళాజయగోపాలుల కిదియొక నూతనబంధముకాదు. వారికి చిన్నతనమందే వివాహమయింది; పిల్లలుకూడాకలిగారు. వారొకచోటనేయుండుటచే రోజులు చులకనగా గడచిపోయినవి. వారిలో ఎవరి యందును ప్రేమోద్రేకచిహ్నములు కనబడలేదు. పదహారేండ్లవరకు ఎప్పుడూ విడిపోకుండా వారొకచోటనే కలసిమెలసియున్నారు. తుదకు కొంతపనిమీద భర్త ఇల్లువదలి వెళ్లవలసివచ్చినది; శశిహృదయంలో ప్రేమోన్మాదము ప్రారంభించింది. ఈవియోగము శ్రమగూర్చినకొలది ప్రణయబంధము మిగుల బిగించుకొనిపోయి గట్టిపడినది. శశి ఎన్నడెరుగని ప్రేమోద్రేక మామెకు బాధగల్గించింది.

ఆనాళ్లకు ఆయీడులో పిల్లలతల్లియగు శశి, ఆమధుమాసమధ్యాహ్నమునందు ఒంటరిగా గదిలో వియోగశయ్యపైపరుండి, యౌవనారంభములోనున్న వధువువలె తీయనికలలుకంటూన్నది. ఆమెకిదివర కెరుక లేనిప్రేమ తన మధురసంగీతముతో ఆమెను మేలుకొలిపింది...ఆమె వెలయేటిఒడ్డున చాలాదూరము నడచింది. ఇరుదరులయందు బంగారుమేడలు, తోటలు కనుపించినవి. కాని విస్మృతిపడ్డసుఖాపేక్షలలో అడుగిడటాని కామెకు తావుకన్పడలేదు. ఈసారి భర్తనుకలసికొన్నప్పుడు మధుమాసవాసరములను వృథాపుచ్చక జీవిత మాధుర్యము ననుభవింపదలచింది. ఇదివరకెన్నిసార్లామె వృథాజగడములవలన భర్తను విసిగించింది!...పశ్చాత్తాపహృదయముతో ఆమె ప్రతినబట్టినది: 'ఇక నెన్నడు భర్తయెడ చిరాకుపడను, అతనియాజ్ఞలను శిరసావహించి మంచికాని, చెడ్డకాని అతడుకోరినప్రకారము చేయుచుండెదను-నాభర్తయే నాసర్వస్వము-నాప్రేమ నిధానము-నాదైవము."

శశికళ తనతల్లిదండ్రుల కొక్కతేకూతురు. అందుచేతనే జయగోపాలుడు కొద్దిపాటి ఆస్తిపరుడైనా ఎట్టిచింత పెట్టుకొనలేదు. మామగారతనిని దొరవలెకూర్చుండబెట్టి పోషించగలడు.

ఇట్లుండ ముసలితనములో శశికళ తల్లిదండ్రులకొక కుమారుడుపుట్టెను. ఎన్నడూఅనుకోని ఈసంఘటనమునకు శశికళ మనస్సులో దుఃఖించింది. జయగోపాలుడూ సంతోషించలేదు. లేకలేకకలిగిన పిల్లవాడి

మీద తల్లిదండ్రుల ప్రేమంతా ఒరిగింది. ఈక్రొత్తగావచ్చిన చిన్న బావమరది, ఉయ్యాలలో నిద్రపోతూ తన చిన్న గుప్పిళ్లలో జయగోపాలుని ఆశలు, ఆశయములు నొక్కిపట్టుకున్నాడు — జయగోపాలుడు అస్సాములో ఒకటీతోటలో పనిసంపాదించేడు.

అతని స్నేహితులంతా దగ్గరలో ఎక్కడైనా ఉద్యోగము సంపాదించమన్నారుకాని, త్వరలో అభివృద్ధికి రావచ్చుననో లేక మరేమైనా కోపముకలననో వారిమాట లాతడు లక్ష్యపెట్టలేదు. భార్యను పిల్లలను పుట్టింటికి పంపి, అస్సాము వెళ్లిపోయినాడు. వివాహమైనతరువాత భార్యాభర్తల కిదియే మొదటియెడబాటు.

ఇల్లా జరిగినందుకు శశికళకు తనచిన్నతమ్మునిమీద కోపమువచ్చింది. మాటలవలన బయటకురాక పోయినా అది హృదయంలో తీవ్రంగా నేయున్నది. పిల్లవాడు పాలుతాగి తనదారితాను నిద్రపోతున్నా అక్కమాత్రము అన్నముచల్లారిపోయిందని, వేళైనా పిల్లలు బడికివెళ్లలేదని ఏవేవో నేరుకల్పించుకొని ధుమ ధుమలాడుతుండేది. కొద్దికాలములోనే పాప మాపిల్లవాడు తల్లిలేనివాడైనాడు. తల్లి చనిపోయేముందు తన పసికూనను కూతురు కొప్పగించిపోయింది.

ఆతల్లిలేనిపసికూన అతిసులభంగా అక్కహృదయాన్ని వశపరచుకున్నాడు. జిలిబిలికేకలతో ఒక్కసారి ఆమె మెడ కౌగలించుకొని ఆమె నోరు, ముక్కు, కండ్లను తనబోసినోటిలో ఇముడ్చుకోబోతాడు. ఆమెవెంట్రుకలు తనచిన్ని చేతులతో పట్టుకుని విడువడు. తెల్లవారకపూర్వమే లేచి అక్కపై పునపడొల్లి, సెలయేరులాగు అవ్యక్తంగా ధ్వనిచేస్తూ ఆమెను మెల్లగా ముట్టుకొని చక్కలిగింతపుట్టిస్తాడు. ఒక్కొక్కప్పుడు 'జీజీ' 'జీజిమ' అంటాడు. ఆమె పనిలోవున్నప్పుడు లేక విశ్రాంతిలోవున్నప్పుడుకూడా వద్దన్నపనిచేస్తూ, తినవద్దన్నవి తింటూ, పోవద్దన్నస్థలములకుపోతూ, నిరాఘాటంగా తనప్రభుత్వ మామెమీద చలాయిస్తున్నాడు. ఈచిన్న పరిపాలకునకామె పూర్తిగాలొంగిపోయింది. తల్లిలేనిపిల్లవాడవటంవలన అతడామె నెక్కువగా ఆకర్షించేడు.

౨

కుఱ్ఱవాడికి నీలమణియని పేరుపెట్టేరు. అతని రెండవయేట తండ్రికి చాలాజబ్బుచేసింది. జయగోపాలుని త్వరగారమ్మని జాబువ్రాశారు. శెలవుదీసుకొని కాశీప్రసన్నుని అంత్యదశలోవచ్చి చేరుకున్నాడు జయగోపాలుడు. కాశీప్రసన్నుడు తనకుమారుని జయగోపాలునిపోషణకప్పగించి, తనఆస్తిలో నాల్గవభాగము కూతురగు శశికళపేర వ్రాసి చనిపోయినాడు.

జయగోపాలుడుద్యోగము మాని స్వంతవ్యవహారాలు చూసుకుంటూ ఇంటివద్దనేయున్నాడు.

చాలాకాలానికి మళ్ళీ భార్యాభర్తలు కలుసుకున్నారు. ఒకవస్తువు పగిలిపోతే మళ్ళీ దానిని అతుకు పెట్టవచ్చుకాని మానవవ్యక్తులిద్దరు విడిపోతే, చిరవియోగానంతరము తిరిగి ఒకేస్థలములో ఒకేవిధంగా కలియరు — చిత్తమొక చైతన్యపదార్థము; నిముసనిముసమునకది అభివృద్ధిచెందుతూ మారిపోతూవుంటుంది.

శశిహృదయంలో పునస్సమావేశము రసతరంగాలను రేపింది. పూర్వమున్న అచైతన్యస్వభావం మారిపోయింది; ఆమె భర్తను గాఢంగా ప్రేమించి వశపరచుకొనయత్నించింది. ఇదివరకామె ప్రతినపట్టినదిగదా!— ఎట్టిదినములు తారసిల్లినను, అవి యెంతదీర్ఘములైనను, భర్తయెడగల తనప్రేమకు వన్నెతరగనీయని.

జయగోపాలున కీపునస్సమావేశము వేరొకవిధముగా పరిణమించినది. పూర్వమిద్దరూ కలసియున్నదినములలో అతనెప్పుడూ భార్యపైనే బద్ధుడైయుండువాడు—ఆమె తనతోలేకపోతే సహించేవాడుకాదు. కనుకనే దూరదేశంలో రోజులు చాలకష్టంగా గడిపేడు. అది అలవాటైపోయి ఒకసూక్ష్మాభిప్రాయ మతని హృదయంలో బయలుదేరింది.

అంతేకాదు: ఇదివరలో అతడు నిర్లక్ష్యంగా రోజులుగడిపేవాడు కాని రెండుసంవత్సరాలనుండి తన స్థితిగతులను అభివృద్ధిలోనికితీసుకొనిరావలెననెడికోర్కె అతనిహృదయంలో చెలరేగింది. అతడెప్పుడూ ఈవిషయమే ఆలోచిస్తూవుండేవాడు. ఈనూత్నభావోద్రేకముతో పోల్చిచూస్తే గడచినజీవితమొక నిస్సారపు నీడవలె అతనికి కనుపించింది.—స్త్రీప్రకృతిలో కలిగే గొప్పమార్పు ప్రేమవలన; పురుషప్రకృతిలో ఆశవలన.

రెండుసంవత్సరాలకుతిరిగివచ్చిన జయగోపాలునకు భార్యలో మార్పు కన్పించింది. ఆపసిపిల్లవాడామె జీవితానికి కొంతవిశాలత్వ సమకూర్చేడు. పసిపిల్లవానికిచెందిన ఆమెజీవితభాగముతో జయగోపాలునకు పరిచయములేదు. భార్యతో ఈవిషయంలో సాంగత్యమూలేదు. కుఱ్ఱవానిమీద తనకున్నప్రేమ భర్తతో పంచుకోదలచిందామెకాని కృతార్థురాలైందని చెప్పలేము. నవ్వుతూ పిల్లవానిని తీసుకొనివచ్చి భర్తముందు నిలుపబెట్టుంది—నీలమణి శశికంఠము కౌగలించుకొని బాంధవ్యబంధ మొప్పుకోడు. మానవహృదయాన్ని వశపరచుకొనుటకు పిల్లవాడుచూపే కళాకౌశలము తనభర్త ఒక్కసారిచూస్తే బాగుండుననుకున్నది శశి. కాని జయగోపాలున కీవిషయమై కుతూహలములేనేలేదు. అట్టియెడ ఆకుఱ్ఱవానికిమాత్ర ముత్సాహముండునా? ఆవికృతాకారముగల పిల్లవాడిపై ఇంతప్రేమ వృథాపరచటమెందుకో జయగోపాలునకు తెలియలేదు.

స్త్రీలు ప్రేమతత్వమును త్వరగా గ్రహించుటలో నిపుణులు. నీలమణియెడ జయగోపాలుడు నిర్లక్ష్యభావమును కలిగియున్నాడని శశి అప్పుడే గ్రహించింది. అప్పటినుండి జాగ్రత్తపరచినదితమ్ముని—ప్రేమరహితమగు తనభర్తయొక్క కరకుచూపులనుండి. ఆవిధంగా ఆపసికూన రహస్యంగాకాపాడవలసిన ఒకపెన్నిధియైనాడు—ఏకాంతప్రేమనిధానమైనాడు.

నీలమణి ఏడ్చినప్పుడల్లా జయగోపాలుడు విసుగుకుంటాడు. అందువల్ల శశి పిల్లవానినిబుజ్జగించి ఓదార్చేది. రాత్రులందు నీలమణిఏడ్పువల్ల నిద్రకు భంగముకలిగితే జయగోపాలుడు కసరుకుంటూ పిల్లవానినిజూచి గర్జించేవాడు. శశి అణగిపోయి పెద్ద తప్పుచేసినదానివలె గడగడవణుకుతూ పిల్లవానిని దూరముగాతీసుకొనిపోయి 'నాబంగారుకొండ' అని ప్రేమవెల్లివిరియ బుజ్జగించి నిద్రబుచ్చేది.

పిల్లలు తెలియక ఎన్నెన్నోపనులుచేస్తారు. అట్టిసమయములం దిదివరలో శశి తనపిల్లలనుదండించి, తల్లిలేనివాడని నీలమణిపక్షంపలికేది. ఇప్పుడు న్యాయాధికారితోపాటు న్యాయముకూడామారింది. తప్పులేకుండా, విచారణలేకుండా నీలమణి మిగుల దండింపబడుచుండెను. ఈవిషయము శశిహృదయమునకొక బాకుపోటయ్యెను. దెబ్బలుతిన్నతమ్ముని తనగదిలోనికి తీసుకొనిపోయి బొమ్మలు, మిఠాయిపెట్టి చేతనైనంతవరకు ఓదార్చ ప్రయత్నించేది.

భర్త తన్నెప్పుడైనదూషించునప్పుడు శశి ప్రేమచిప్పిలువాక్యములతో శాంతపరచేది; కాని నీలమణి విషయములో వారొకరినొకరు నిముసమునకొకసారి ద్వేషించుకొంటూనేయున్నారు.

బహిర్గతముగానుండు కలహముకన్న అంతరంగికముగానుండు ద్వేషమును సహించుటకష్టము.

## 3

నీలమణియొక్క అవయవములన్నిటిలో తలపెద్దది. సృష్టికర్త ఒకసన్ననిపుల్ల పైభాగమున పెద్దబుడగను నిలిపియుంచినట్లాతనిఆకారముండును. బుడగవలెనే అతనిజీవితము క్షణభంగురమగునేమోయని వైద్యులు భయపడిరి. చాలారోజులవరకాతడు నడచుటగాని, మాట్లాడుటగాని యెరుగడు. అతనిముఖమును చూచినయెడల, తల్లిదండ్రులు వారివృద్ధాప్యముయొక్క దుఃఖభారమును అచ్చట దిగవిడిచిపోయినట్లు స్ఫురించును.

అక్కయొక్క అదుపాజ్ఞలలో ఎట్లో నీలమణికి ఐదేండ్లుగడచి ఆరవయేడు ప్రవేశించింది.

కార్తికమాసములో *భాయిఫోటో పండుగరోజు శశి నీలమణిని అలంకరించినది; ఒకకోటు, ఎఱ్ఱంచు ధోవతికట్టి బొట్టుపెట్టుచుండగా, ఇంటిప్రక్కనున్న తారవచ్చి లేనిపోనికారణముతో పోట్లాట మొదలు పెట్టింది. "రహస్యంగా తమ్ముడికొంపగూలుస్తూ, పైకింత ఆడంబరంగాపండగచేయుట మెందు"కని తార ప్రేలటం మొదలుపెట్టింది.

ఈమాటవిని శశి నిర్ఘాంతపోయింది. ఆమెకు కోపముకూడావచ్చింది. శశి తనభర్తతోకలసి, మైనరైన నీలమణియొక్క ఆస్తి ఋణాలుతీర్చటానికనిఅమ్మి, లోపాయికారీగాతిరిగి పినతండ్రికొడుకుపేర కొంటున్నదని తార అందరితో చెప్పటం మొదలుపెట్టింది. ఈమాట శశివిని 'అట్లా అన్నవాండ్లనోట్లో కుష్ఠురోగం పుట్టా' అనితిట్టింది. తరువాత భర్తవద్ద ఏడుస్తూపోయి ఈవిషయమంతా చెప్పింది. జయగోపాలుడు అంతావిని "ఈరోజుల్లో ఎవరినీనమ్మడానికి వీలులేదు; నాపినతండ్రికొడుకగు ఉపేంద్రునిజవాబుదారిలో ఈయాస్తి వుంచటంమంచిదని నేననుకున్నాను. కాని అతడు నాకుతెలియకుండా హసిల్‌పూర్‌తాలూకాను ఋణాలకనిఅమ్మి తిరిగి రహస్యంగానే తానేకొన్నాడట." అనిచెప్పేడు.

"వీరందులకై వ్యాజ్యమువేయరా?" అని ఆశ్చర్యంతో అన్నది శశి.

"పినతండ్రికొడుకుపై వ్యాజ్యమా! డబ్బువ్యయం-ఎందుకు?" అన్నాడు జయగోపాలుడు.

భర్తమాటయందు నమ్మకముంచటము శశికి విధ్యుక్తధర్మము; కాని ఆమె నమ్మలేదు. ప్రేమ కాస్పదముగు గృహజీవితముపై ఆమెకసహ్యముపుట్టెను. ఒకప్పుడు సుఖముగ తలదాచుకొనుటకు ఆలవాలముగానున్న గృహము నేడు స్వలాభాపేక్షచే సమకూర్చబడిన పన్నాగముల వలవలె తోచెను. ఆమె అబల; ఒంటరికత్తె; నిస్సహాయుడగు నీలమణిని రక్షించుట కామెకేమియు తోచలేదు. ఆమె యాలోచించినకొలది హృదయమున భయమధికమగుచుండెను. రాజప్రతినిధికడ కేగవలయుననియు, లేదా మహారాణిపేర తమ్ముని ఆస్తిని రక్షింపుమని వినతిపత్రము పంపవలెననియు తలచెను. సంవత్సరమున కేడువందల ఏబదియెనిమిదిరూపాయల రాబడిగల హసిల్‌పూర్ తాలుకాను మహారాణీకి తెలిసినచో అమ్మనిచ్చునా?

మహారాణీతో విన్నవించి తనభర్తయొక్క పినతండ్రికొడుకుపై దావావేయవలెనని శశి ఆలోచిస్తూవున్నరోజుల్లో ఆకస్మికముగా నీలమణికి జ్వరము, వాంతులు ప్రారంభించినవి.

జయగోపాలు డొక పల్లెటూరివైద్యుని పిలచెను. మంచివైద్యునకు కబురంపమని శశి కోరగా "ఎందుకు? మతీలాలు సాధారకమువైద్యుడనుకున్నావా?" అని భర్త జవాబుచెప్పెను.

శశి భర్తకాళ్ళపై బడెను. మిగుల ప్రార్థించెను. "సరే డాక్టరుకొరకై పట్నానికి మనిషినిపంపుతా" నన్నాడు భర్త. నీలమణిని తొడపై పరుండబెట్టుకొన్నది శశి. ఒక్కనిమిషమైనా ఆబాలుడు అక్కను విడిచిపెట్టలేదు. ఆమె తన్ను విడచిపోవునేమోయని బాలుడామెను కౌగలించుకొనెను. నిద్రపోవునపుడు కూడ ఆపసికూన అక్క చీరచెరగును పట్టుకొనియేయుండెను.

ఆదినముగడచెను. ప్రొద్దుగ్రుంకువేళ జయగోపాలుడు వచ్చి డాక్టరు ఇంటివద్దలేడని వేరొకరోగిని చూచుటకువెళ్ళెనని చెప్పెను. కొంతతడవునకు తాను పనిమీద ఇల్లువదలి వెళ్ళుచున్నాననియు, మతీలాలు పిల్లవానిని సరిగా చూచునట్లు చెప్పెదననియు తెల్పెను.

---

*ఈపండుగరోజు అక్క తమ్మునకు క్రొత్తబట్టలుపెట్టి, గంధపుబొట్టుపెట్టి దీవించును. ఉత్తరహిందూ దేశములో నేటికిని ఈపండుగ ఆచరణలోకలదు.



తిరువాన్కూరు మహారాణి రీజెంటు
శ్రీమతి సేతులక్ష్మీబాయి సి. ఐ.



గానకుశలలగు ఆంగ్లస్త్రీలు లండను థేమ్సునదిపై విహరించుట

ఆరాత్రి నీలమణి నిద్రలో కలవరించెను. తెల్లవారగనే శశి నిర్భయముగ పడవపైబయలుదేరి తమ్ముని డాక్టరుకడకు తీసుకొనిపోయెను. డాక్టరు ఇంటివద్దనేయుండెను; అతడెచ్చటికిని వెళ్ళలేదు. శశికి బస కుదిరిచి ఆమెకడ వొకముసలివితంతువును తోడుగానుంచి డాక్టరు పిల్లవానికి మందుప్రారంభించెను.

మరుసటిదినము జయగోపాలు వచ్చుటకువచ్చెను. భార్యను తక్షణమింటికిరావలసినదని ఆజ్ఞాపించెను.

"నన్ను ముక్కలుముక్కలుగా నరికివైచినను నేనురాను. తల్లిదండ్రులులేని నీలమణిని మీరు చంప దలచినారు; నేనాతనిని రక్షింపకతప్పదు" అని శశి పల్కెను.

"ఇచ్చటనేయుండుము. నాయింటికి రావల"దని జయగోపాలుడు గర్జించెను.

శశి మిగుల రోషముతో "మీయిల్లు నాతమ్మునిది కాదా?" యనెను.

'సరే' అన్నాడు జయగోపాలుడు. చుట్టుప్రక్కలవారంతా ఈవిషయాన్ని గల్లంతుచేశారు.

"నీభర్తతో ఇంటివద్ద తగవులాడుము; నీవు ఇల్లువదలిపెట్టుటేమి మంచిది? జయగోపాలు డెట్లయినా నీభర్తేగదా" అన్నది తార.

తనవెంట తెచ్చిన ధనమంతా ఖర్చయిపోగా శశి తననగలమ్మి ఎట్లాగో తమ్ముని బ్రతికించుకొన్నది. ద్వారీగ్రామంలో నీలమణికి గల పది హేనువందలరాబడిగల పొలము, ఇల్లు జయగోపాలుడచ్చటనున్న జమీం దారు సహాయంతో తనపేర పెట్టించుకున్నాడని శశి విన్నది. ఇప్పుడు ఆ ఆస్తిసర్వము జయగోపాలునిదే; తన సోదరునకు సున్న.

జబ్బు నిమ్మళించినతరువాత నీలమణి తన స్నేహితులను శశి బిడ్డలతో ఆడుకొనవలెనని "అక్కా! ఇంటికిపోదము; మన పాతఇంటికి పోదా"మని పోరుపెట్టేవాడు. ఈమాటలకు శశి ఘోరున ఏడ్చేది. వారికి గృహ మెచ్చటమున్నది?

ఏడ్చి లాభములేదనుకొని కన్నులుతుడుచుకొని మేజస్ట్రీటగు తారిణీబాబుజనానాలోనికి వెళ్ళి ఆయన భార్యతో సంగతంతా చెప్పింది శశి. మేజస్ట్రీటు జయగోపాలుని బాగుగా నెరుగును. ఆ స్త్రీకి చెందిన తగాదా వలన ఇల్లువదలి ఇట్లా ఆడమనిషి రావటము మేజస్ట్రీటుకు నచ్చలేదు. వెంటనే జయగోపాలునిపేర జాబు వ్రాశాడు. జయగోపాలుడువచ్చి భార్యను, నీలమణిని బలవంతముగా పడవలో ఎక్కించుకొని ఇంటికి తీసు కొని వచ్చేడు.

రెండవ యెడబాటైనతరువాత భార్యాభర్తలు కలుసుకున్నారు. ప్రజాపతిఆజ్ఞ!

చాలారోజులకు స్నేహితులను కలుసుకొన్నందుకు నీలమణి చాలా సంతోషించేడు. ఆపిచ్చిసంతోషం చూచి శశి హృదయం బ్రద్దలయ్యేటట్టు విలపించింది.

## ౪

రాష్ట్రాధికారి వేటకోస మాయూరిలో డేరావేసుకొని మకాముగా వున్నాడు. మైదానంలో ఆడు కుంటున్న నీలమణిని అధికారి చూచేడు. తక్కినపిల్లవాళ్ళంతా ఏదో పదాలు పాడుతున్నారు. కాని నీల మణి అధికారివేపే ఒకటే చూడటం మొదలుపెట్టేడు.

అధికారి చాలా ముచ్చటపడి 'నీవు పాఠశాలలో చదువుతున్నావా?' అని బెంగాలీభాషలో నీలమణిని ప్రశ్నించేడు. నీలమణి తలఊపేడు. 'ఏమి పుస్తకాలు చదువుతున్నా'వన్నాడు మళ్ళీ అధికారి. 'పుస్తక' మన్నమాట నీలమణి కర్థంగాలేదు మెదలకుండా నుంచున్నాడు.

ఇంటికివెళ్లి తాను రాష్ట్రాధికారితో మాట్లాడినట్లు మిక్కిలి సంతోషముతో నీలమణి అక్కతోచెప్పేడు.

మధ్యాహ్నమువేళ జయగోపాలుడు కోటువేసుకొని, తలపాగాచుట్టి అధికారిదర్శనానికి వెళ్లేడు. అక్కడ చాలామంది నౌకర్లు గుంపులుకూడిఉన్నారు. అధికారి ఒకచెట్టునీడన బల్లపైకూర్చున్నాడు. జయగోపాలుడు వెళ్లగానే కుర్చీవేయించి అతడు కూర్చున్నతరువాత, గ్రామపరిస్థితులనుగురించి అధికారి ప్రశ్నించేడు. తనకుజరిగినగౌరవానికి పొంగిపోతూ ఎవరైనాతోటివాండ్లు వచ్చిచూస్తే బాగుండునని మనస్సులో అనుకున్నాడు జయగోపాలుడు.

ఇంతలో, ముసుగువేసుకొని ఒకస్త్రీ నీలమణిని వెంటబెట్టుకొని అధికారివద్దకు సరాసరివచ్చినిలచింది.

"అయ్యా! నిస్సహాయుడను ఈపిల్లవానిని మీచేతుల్లో పెట్టుతున్నాను; రక్షించండి" అన్నది.

ఆపిల్లవానిని ఇదివరకే అధికారి చూచియున్నందున, ఆమె యొకగొప్పకుటుంబమునకు చెందినదని గ్రహించి, వెంటనే లేచినిలచి "డేరాలోనికి దయచేయండ"ని అధికారిపల్కెను.

"నేను చెప్పదలచుకున్న దిచ్చటేచెపుతా"నని ఆమె జవాబుచెప్పెను.

జయగోపాలుడు తెల్లబోయినాడు. గ్రామస్థులంతా వింతచూడాలని చుట్టూమూగేరు; కాని అధికారి బెత్తముపైచేయివేయగానే అందరూ పారిపోయినారు.

శశి అధికారికి సంగతంతా విన్నవించింది. అప్పుడప్పుడు జయగోపాలుడు మాటకడ్డువచ్చేడు కాని, అధికారి 'నోరుమూయ'మని గర్జించి అతనిని కుర్చీమీదనుండి లేవమని బెత్తంతో సైగచేశాడు.

శశిమీద మండిపోతున్నాడు జయగోపాలుడు. కాని మాట్లాడకుండా నిలుచున్నాడు. అక్క చెప్పుతున్నదంతా పసివాడు నోరుతెరుచుకొని వింటున్నాడు.

శశిచెప్పిన కథంతావిని అధికారి జయగోపాలుని కొన్నిప్రశ్నలడిగి, తగుజవాబులుపొంది కొంతసేపూరకుండి, మళ్లీ ఆమెనుజూచి "ఈవిషయము నావద్దకు విచారణకురాదు; ఐనప్పటికి నాచేతనైనంతసహాయంచేస్తాను. మీరు భయపడకుండా తమ్మునితో ఇంటికివెళ్లండి" అన్నాడు.

అంతట శశి "అయ్యా! ఈపిల్లవానిఇల్లు తిరిగి వానికివచ్చేవరకు నేనాయింటికి వానిని తీసుకొనివెళ్లటానికి భయపడుతున్నాను. వీనిని మీవద్ద నేయుంచుడు; వేరేవిధంగా రక్షించేవీలులేదు" అన్నది.

అధికారి చిరునవ్వునవ్వేడు. తాయత్తులు మెడనిండాకలిగియున్న ఆసన్నని వింతముఖముగల బెంగాలీ పిల్లవానిని రక్షణలోనికి తీసుకొనటానికి ఒప్పుకున్నాడు.

శశి శలవుతీసుకొని వెళ్లిపోతుండగా పిల్లవాడు ఆమెచీరెపట్టుకున్నాడు. 'భయపడకు నాయనా!' అని అధికారి హెచ్చరించేడు.

అమితంగాఏడుస్తూ, దీనవదనముతో 'నన్నుపోనియ్యి నాయనా! మళ్లీనిన్ను కలుసుకుంటానులే'అన్నది శశి. పిల్లవానిని కౌగలించుకొని బుజ్జగించి, చీరెవదలించుకొని శశి వెళ్లిపోయింది. అధికారి పిల్లవాడిని పట్టుకున్నాడు. 'అక్కా! అక్కా!' అని పిల్లవాడు ఏడవటంమొదలుపెట్టేడు. శశి వెనక్కుతిరిగి, చేతులుచాచి అవ్యక్తంగా ఏమేమోఅంటూ గుండెపగిలిపోయేటట్లు దుఃఖిస్తూ వెళ్లలేకవెళ్లిపోయింది.

మళ్లీ ఆయింట్లో భార్యాభర్తలుకలిశారు. ప్రజాపతిఆజ్ఞ!

ఈకలయిక ఎక్కువదినములు నిలిచియుండలేదు. శశి కలరావల్ల చనిపోయినదని, ఆరాత్రే శవాన్ని దహనంచేశారని ఒకరోజు ఊళ్లో వదంతిబయలుదేరింది. ఒక్కరూ మాట్లాడలేదీవిషయాన్నిగురించి. అప్పుడప్పుడు తార ఏదోచెప్పవచ్చేదికాని, అందరూ నోరుమూయించేవారట్లు 'ఇశ్శో' అంటు.

విడిపోయేరోజు శశి 'నేను నిన్నెప్పటికైనా కలుసుకుంటానని' తమ్మునితోచెప్పింది. ఆమాటఎట్లు నిర్వహింపబడెనో ఎవరుచెప్పగలరు?

# సంయుక్త

గొల్లపూడి రామజోగారావుగారు

సంయుక్త కనూజ్‌నగరాధీశ్వరుని తనయ. చారుఘనమాలికానిర్ముక్తరాకాసుధాకరానన సంయుక్త—జయచంద్రుని ప్రేమాతిశయముచే విద్యలన్నిటియం దగణితమగు ప్రవీణత గడించినది. సంగీతసాహిత్యాదివిద్యలందును, విలువిద్యాది యస్త్రవిద్యలందును రాజపుత్రీవ్రాతంబులో కెల్లరాణియై మెప్పుపడసింది.

సంయుక్తభావం మృదుమధురం. ఆమెహృదయం ప్రేమపూరితము—నిజదాసీజనానీకమునెన్నడాసరోజాక్షి యాగ్రహదృష్టితో గమనించియుండలేదు. అట్లుచేయుట కానెలత యోగ్యురాలనియే చెప్పవచ్చు. ఆమె మానససరోవరమునందు ప్రేమతరంగాలుపొంగి పొరలుతూవుండేవి. ఆమె కడగంటివెన్నెలల్లో ప్రేమ ప్రవహిస్తూవుండేది. ఆమె జాలిగుండెకలిగి నప్పుడెల్లప్రేమావళులు బాష్పవారిమిళితమై బయటికి వెళ్ళివచ్చుచుండేవి. అట్టిప్రేమస్వరూపిణిప్రేమైకదృక్కులకు పృథ్వీరాజు గురిఅయినాడు - అంతేకాదు-పట్టుపడ్డాడుకూడా - అతని రూపాన్ని జయించి కోసకి తనసాంద్రతరకృపాప్రపూరితహృదయంలో-ప్రేమనిధానమైన మానసంలో-బంధించింది.అతడు సద్గుణపుంజముల కాటపట్టగుటకు ముదమందింది.అతనిరణకౌశల్యమునకు, రాజ్యపాలనాదురంధరతకు మనమునుప్పొంగింది. కన్నతండ్రికి వైరుడైనను ప్రేమించింది...ఆప్రేమ-అతినిర్మలము-ఉషఃకాలమిహికాబిందుసదృశం-ప్రగాఢం...గభీరము.

సంయుక్త స్వయంవరానికి జయచంద్రుఁ డందఱ నాహ్వానించి పృథ్వీరాజు నుపేక్షించెను. పృథ్వీరాజునెడ యీర్ష్యను ప్రతిమంజేసి ద్వారముకడ నునిచెను. సంయుక్త సభామంటపమున నడుగిడెను. ఆకంజాక్షి కస్తూరికాప్రవాహములుప్రసరించులోచనప్రాంగణముల నలుదెసలఁద్రిప్పి నిజనాథునిప్రతిమ వీక్షించెను. ప్రవాళసన్నిభమగు కరాలు మంజులతర శిలావిగ్రహాన్ని పుష్పమాలికచే అలంకరించేయి. అట్టియెడ నామె మనోజ్ఞవదనశశిమండలమున నిసుమంతయేని విషణ్ణభావ ముద్భవించియుండలేదు. ఆమె గభీరమగు ప్రేమకిది నిదర్శనమేగదా.

యుద్ధం ప్రారంభమైనది. ఈర్ష్యాళుడగు జయచంద్రునకు-అనురాగబద్ధుఁడగు పృథ్వీరాజునకు జరగిన మొదటియుద్ధమిది. సంయుక్తరాకుమారి పురుషవేషమూని కోటవదలి యుద్ధరంగమునఁ బ్రవేశించెను. అందామె ధైర్యసాహసమును, సమరనైపుణ్యముఁ దేటతెల్లమయినవి. ప్రియుని సకాలమునఁరక్షించిఆతనితోగూడ విజయలక్ష్మిని వరించింది సంయుక్త. తన ప్రణయమూర్తి సమయస్ఫూర్తికి ఢిల్లీచక్రవర్తి గూడ విస్మయమందసాగెను - రణరంగచరణకళావిశారదగదా-ఆకురంగలోచన.

సంయుక్త నిజనాథునిగూడి తన్నాలమున నోడించి ఢిల్లీకిపోవుట జయచంద్రుని యీర్ష్యానలానికి ఆజ్యముపోసినట్లయింది. ఢిల్లీనగరాధీశుని నాశనంచేయాలని నిశ్చయించు

కున్నాడు. అట్టియెడ స్థానేశ్వరందగ్గర పరాజితుడై నిలువనీడలేక పారుచుండిన కుతుబుద్దీన్-అతనినాయకుడు ఘోరీ-యాతనినయనయుగ్మానికి గోచరించేరు. జయచంద్రుడు వారిసాయం కోరేడు. ఘోరీ సంతోషపరీతస్వాంతుడై హిందూదేశములో కాలుపెట్టేడు...అదేమన దేశనాశనానికిమూలం...సంఘూరిష్టముల కాలవాలం.

రెండవసారి ఢిల్లీనగరాధీశ్వరునకు, ఘోరీ సహాయుఁడైన కన్యాకుబ్జనాగరాధిపునకు యుద్ధం ప్రారంభమయింది. పృథ్వీరాజు మృదుమధురాలాపంబుల నొప్పించి సంయుక్త ముందు తానేసమరానికి సంసిద్ధురాలయింది. ఆమె రణకౌశల్యమెఱింగినవాడగుటచే పృథ్వీరాజందుకు కాటంకపరుప లేదు. సంయుక్త జనకునిచేరి యనేకభంగుల నాతనివేడికొని యాతని తమోశోకానికి ప్రబోధంగలిగించపోయెను-ఆమెహృదయంలో క్రొత్తశక్తి ప్రసన్నమయింది-మాతృభూమియగు నార్యావర్తమంతయు నిక నేరీతిని ధ్వంసముకాబోవుచున్నదో దలంచుకొనినపుడెల్ల నాకోమలహృదయ విభీతమనస్క యగుచుండెను. ఆగోహంతకులపాల బడుచుండిన స్వచ్ఛందభారతనారీలోకమున కెట్టి మానభంగము కలుగునోయని తల్లడిల్లసాగెను. కృతఘ్నులగు ఈమ్లేచ్ఛులకుతోడుబడిన తనతండ్రి నశించునని యూహించుకొనియెను... తండ్రియా......నిజనాథునిపై కత్తికట్టుటయా...పవిత్రంబగు నీయార్యావర్తము యవనులపాలబడవేయుటయా...

యుద్ధముతప్పినదికాదు-సంయుక్త నిజనాథునిచరణంబుల స్మరించుకొనుచు గైజియాపురమున కరిగెను. రణరంగమున నామహారాణిపేరు తాండవమాడినది. సంయుక్త ధాటికి తాళలేక రాజకులుండు గేజియాపురమునువిడిచి పారిపోయెను...తుద కాపవిత్రహృదయ ఘరుక్నగరమున వైరిమాయలకు గుఱియై జీవనముల గోలుపోయెను. తనకోమలదేహాన్ని మాతృభూమియగు నార్యావర్తమున కర్పించింది. అందుకొరకై పోరుచు సంగ్రామమున వీరమరణమొందినది. పతికి ప్రార్థనాపూర్వకముగ జరిగినదంతయు విన్నవించుకొనియెను. అంతఃపురకాంతల యాలువున కెట్టిభంగమురాకుండ కాపాడ నర్మసఖికి కబురంపెను... ఈర్ష్యావేశుడై...క్రూరుడై...అవివేకియై-యింతలుగావించిన జనకునికికూడ నాధీరసాధ్వి వందనము లర్పించుకొనియెను...

సంయుక్తా! నీవంటి నారీశిరోభూషలు వర్తిలిన యార్యావర్తము నేడెట్టి దుర్దశ పాలయ్యెను?

## ఆమోదము

శ్రీమతి వింజమూరి వేంకటరత్నమ్మగారు

లలితరచనావిశేషవిలాసగతుల
నమరుపనడంపుఁదీఁగయై యాంధ్రసీమ
యెల్లఁబ్రాఁకెడు 'గృహలక్ష్మి' యాశుకృపను
దినదినప్రవృద్ధినిగాంచి తేజరిల్లు.

# విద్యాభిలాష

జమ్మి శేషగిరి రావుగారు బి.యే;యల్.టి.

౧

పార్వతి పట్టాభిరామారావుగారి కుమార్తె. పెద్దాపురంతాలూకాలోని ఒకచిన్నగ్రామమునకు కరణం ఆమెతండ్రి. లేకలేకగలిగిన కుమార్తెయగుటచేత పార్వతిని అల్లారుముద్దుగా పెంచినారు తల్లిదండ్రులు. పదిపన్నెండేళ్ళు వచ్చేసరికి పార్వతి పల్లెటూరి స్కూళ్ళలోని తరగతులన్నీ చదివేసింది. దగ్గరగా ఒకమైలు దూరంలోవున్న మధ్యమపాఠశాలలో మూడోఫారం ప్యాసయింది. పెళ్ళిమాట తలపెట్టినప్పుడల్లా యిప్పుడు వద్దంటూవచ్చింది. సిగ్గుచేతనో, చదువుకి స్వస్తిచెప్పాలనో గాని పిల్ల వద్దంటూందని తల్లిదండ్రు లనుకొనేవారు. తల్లిమాటకేమిగాని తండ్రికి పూర్తిగా స్త్రీవిద్యయందే పూర్ణవిశ్వాసముండడంచేత పిల్లను మెట్రిక్యులేషను దాకా చదివించాలనివుంది.

ఇట్లాంటిస్థితిలో జరిగేయి పెళ్ళిమాటలు. పార్వతికి ఒకమేనమామ ఉన్నాడు. ఆయన ఆరోజుల్లోనే కాకినాడ బదిలీఅయి డాక్టరుపని చేస్తున్నాడు. ఆయనద్వారా వెంకట్రావుగారనే ఒక సంపన్నగృహస్థుని జ్యేష్ఠపుత్రుడగు పాపారావునకు వేయిన్నూటపదహార్లు కట్నంతో పెళ్ళిచేయడానికి ఏర్పరిచేరు పార్వతిని. ఆమెతండ్రి తనవుద్దేశ్యమును చెప్పినాడు వియ్యంకునితో. అప్పట్లో సరే అన్నాడు వియ్యంకుడు. అలా అనకపోతే పెళ్ళికాదనే అన్నాడో, నిజంగా తనకోడలు విద్యాధికురాలు కావలెననే అన్నాడో కాని మొత్తంమీద చదువుకి వొప్పుకొనే పెళ్ళిచేసుకున్నారు. కాని వియ్యంకులు మాట్లాడుకున్న యీవిషయము ఎవరు విన్నారు?

పెళ్ళి సలక్షణంగానే జరిగింది. పెళ్ళిఅయింది లగాయితు కొన్నాళ్ళు నోములనీ, వ్రతాలనీ, శ్రావణపట్టీలనీ, ఆషాఢపట్టీలని ఒకరియింటికి ఒకరు వెళ్ళడంమాత్రం మినహాగా లాంఛనాలు జరిగేయి. పార్వతి మేనమామగారియింట్లో ఏన్నాళ్లో ఉండలేదు. ఆమెమామగారు వెంకట్రావుగారు ఉద్యోగానికి సెలవుపెట్టి కారణాంతరాలచేత చెన్నపట్నంవెళ్ళి కొన్నాళ్ళుఉన్నారు. అందుచేత పార్వతి హాస్టలులోవుండి నాల్గవఫారం ప్యాసయింది. అప్పటి కామెకు యౌవనము అంకురించడం ప్రారంభించినది. కాని చదువుకొంటూన్న హేతువుచేత ఇంటిపట్టున పెద్దవాళ్ళపోషణలేక హాస్టలులోవుండుటచేత బక్కపలుచగానేవుంది. పొడవుకుతగిన శరీరసౌష్ఠవంలేదు.

౨

ఇంతట్లోకే పార్వతి మామగారు తిరిగీ స్వగ్రామంచేరినారు. పార్వతి భర్త అప్పటికే వ్యవసాయ కళాశాలలో చదువు పూర్తిచేసుకొని, వ్యవసాయముచేయుటకు స్వంతభూములు లేక, యితరులవలని భూములను కొలుకుపొందుటకు తగిన అదనుదొరకక ఆయేటికి యింట్లోనే వున్నాడు. గవర్నమెంటువుద్యోగమేమీకూడ దొరకలేదు. అందుచేత యింట్లోనేవుండుటవలన పార్వతియొక్క సంగతి అతనిమనస్సుకు స్ఫురించింది.

పార్వతి హాస్టలులోచేరినతర్వాత తిరిగీ సంవత్సరాంతంవరకూ అందులో వుండితీరవలసిందే. అందులోనూ మెట్రిక్యులేషన్ క్రిందితరగతిగనుక శ్రద్ధగా చదువుకోవాలి. అత్తవారియింట్లోనే ఉండడంవస్తే చదువుమానడమే మంచిది. అందుచేత పార్వతి అప్పుడప్పుడు రైలుగట్టుదగ్గరకి షికారువచ్చినప్పుడుగాని, స్కూలుకుపోతున్నప్పుడుగాని భర్తకళ్ళపడేది. అతడు మండిపడేవాడు.

ఇదిచూచి స్నేహితురాండ్రతో చనువుగా షికారువెళ్ళడం మానింది పార్వతి. గదిని అంటిపెట్టుకొని కూచునేది. పాపారావు ఒకనాడు తండ్రితో "నాన్నగారూ! మీకోడలుకి చదువు పూర్తిఅయింది. ఇక హాస్టలునుంచి యింటికి రప్పించండి" అన్నాడు. వెంటనే వెంకట్రావుగారు పెద్దాపురం కార్డువ్రాశారు.

ఈలోగాజరిగిన విపరీతం ఎవరికి తెలుస్తుంది? పార్వతి మనోవ్యాధిచేత కుష్కించి శల్యమైపోయింది. రెండునెలలకు పరీక్షలవుతాయనికూడా ఆలోచించకుండా పెద్దాపురం వెళ్ళిపోయింది. నిజమే అట్టిస్థితిలో ఆమె అత్తవారియింట్లోకంటె పుట్టింటవుండుటే మంచిది. పిడుగులాగవచ్చింది వెంకట్రావుగారివార్త. "కోడలిని యిప్పుడు పంపుతారా, లేదా, లేనియెడల యిక మీదారిమీది మాదారిమాది" అని వ్రాశారు.

పట్టాభిరామారావుగారు పంపుటకు వీలులేదనీ, శరీరము అస్వస్థతగావుందనీ, కొద్దిరోజులు వోపికపట్ట వలసిందనీ జవాబిచ్చేరు. ఆజవాబురుచించలేదు పాపారావుకి. తండ్రిమీద తిరగబడేసరికి వెంకట్రావుగారు వూరుకుంటే నామర్దాగావుంటుందని తక్షణం మోటారులో పెద్దాపురంచేరేరు. పార్వతి వాకిటవున్నది. తండ్రియింటలేదు. తహస్సీలుదారువారుతనిఖీకి వచ్చినందున పొలముమీదికి వెళ్ళినాడు. తల్లి ఎంతో మొరపెట్టు కుంది కాని వినలేదు. కలియుగదుశ్శాసనునివలె పార్వతిని మోటారులోకి నెట్టి కాకినాడ చేర్చేరు.

ఈలోగా రెవిన్యూడిపార్టుమెంటువుద్యోగి గనుక పట్టాభిరామారావుగారు కాకినాడకి తంతి యిచ్చేరు. పోలీసుభటులు మోటారుస్టాండువద్దకివచ్చేరు. వెంకట్రావుగారు బండిమాట్లాడుతో వుండగానే పోలీసువారు కారునుతిన్నగా జడ్జీగారియింటికి నడిపించేరు. అక్కడ జడ్జీగారి సతీమణి పార్వతిని ఆదరించి దయగా మాట్లాడింది. మరునాడు కోర్టులో పిటీషనులుపెట్టి పార్వతిని కాపురమునకు పంపించుటలేదని మామ గారున్నూ, మైనరును బలాత్కారంగా తన అధీనంలోంచి తీసుకపోయ్యారని తండ్రిగారున్నూ వాదిస్తూ వుండగా పాపారావు ధుమధుమలాడుతూ అసందర్భప్రలాపాలు ఆడుతూవుంటే కోర్టువారిచే గద్దింపులు తింటూవున్నాడు. ఏమీతోచలేదు పార్వతికి. తన కాపురానికి యింతరవ్వ, రష్టావచ్చిందని విచారించింది. వివాహకాలపు వాగ్దానాలు రుజువుకురాలేదు. అసలుచదివించడమే మాకుయిష్టంలేదన్నారు వెంకట్రావుగారు.

పార్వతిని కోర్టువారు అడిగేరు "నీకు విద్యకావాలా? భర్తకావాలా?" అని. మెల్లగా అందికదా పార్వతి:—"నాకు రెండూకావాలి. హిందూసంఘం యితరవ్యవస్థలలో స్త్రీవ్యక్తిత్వము యింకా పూర్తిగా విజృంభించకపోయినా స్త్రీవిద్యయందు అసూయచూపించేభర్తలుమాత్రం చాలామందివున్నారని నేనను కోను. నాయెదుట నాభర్తనుఅడగండి. నాచదువువలన ఆయనకి గౌరవహానికలిగేటట్టయితే నావిద్యాభి లాషని పూర్తిగా త్రెంపివేస్తా."

ఈమాటలువిన్నాడు పాపారావు. నిజమే! పార్వతిచెప్పినమాటల్లో అబద్ధమేముంది? విద్యరాని స్త్రీకంటె విద్యనభ్యసించినస్త్రీ పురుషునికి అన్నివిధములసహాయపడుటయేగాక, తనగృహకృత్యములను యెక్కువ తెలివితేటలతో నిర్వహించుకొనును. వైద్యవిషయము, పాకశాస్త్రము, గృహమును శుభ్రముగా నుంచుకొనుట, దేహశుభ్రత, వస్త్రములను శుభ్రపరచుకొనుట మొదలగు పనులనన్నింటిని అతిశ్రద్ధతోను, సంతోషముతోను చేసికొనును. శిశుపోషణయందుకూడ మిగుల నేర్పరికాగలదు. విద్య నేత్రమువంటిది. తెలియనివానిని తెలిపికొనుటకు దారి. ఇట్లు వితర్కించి వెంటనే లేచినిలుచున్నాడు. జడ్జీగారు అడగక ముందే పాపారావు పార్వతివద్దకువెళ్ళి "నాభార్య విద్యాభ్యాసమువలన నాకగౌరవములేదు. ఈమె యిష్టాను సారము విద్యాభ్యాసమొనర్చి విద్యపూర్తియయినదన్నగాని తిరిగి కాకినాడ త్రొక్కమాడ"మని చెప్పుచు పార్వతిని వెంటనిడుకొని చెన్నపట్నముచేరెను. అందరును తెల్లబోయిరి. తరువాత పార్వతి పట్టభద్రయై, గృహకృత్యములను నిర్వర్తించుకొనుచు భర్తను సర్వవిధముల దైవముగాతలంచుచుభర్తృసేవానిరతయయ్యెను.

# మద్యపానసాత్వికనిరోధము

శ్రీమతి సామవేదుల చిరంజీవమ్మగారు

తీయనికలకండతేనెమాటలనోట 'నాయనా' యను దీననాదమొదవె
జిలిబిలి "లోయన్నుసిల్కుల" పొందును కసరుమేనికి ముదుకకద్దరబ్బ
ప్రాణప్రియునిసేవఁ బరవశత్వముగన్న చివురుచేతులుమొగ్గ చెలువుగాంచె
తరుణోదయముకాంతిఁ దారళ్యమొందెను కలువకన్గవయెండ వెలవెలాయె

> అజునిరాణికి నాటపట్టయిన నాల్క
> తడబడగజొచ్చె చెనటులై తప్పద్రావు
> రక్తనేత్రాల మిడిగుడ్ల రక్కసులను
> సోదరోచితప్రేమతో జూచి మద్య
> పాననిరసననేర్పు నప్పరమసతికి.

చిన్నారివయసున చివురుగోరింటల సేకరించుట కింత చిక్కువడెనో?
పసరుబాల్యమునాఁడు వ్రతదీక్ష కేనింత తెల్లవారకముందు తెలివిగనెనో?
తొలిచూలియలసతదోగినయపుడైన నోపికతోనింతయోర్చుకొనెనో?
కనుపారగాంచి గారాబుబిడ్డల కసరకుండగ నింత కరుణగొనెనో?

> అకట! నేఁడేల మంచు నీయాతపాగ్ని
> గసలి గాసిలి వత్తయె కరుణమూర్తి
> దాల్చినిలచెనో శాంతితో తప్తకాంచ
> నాంగి—యీమద్యదేవతనాట్యశాల?

గాంగభూముల నాష్ఠకన్యకల్ పాడిన సామగానములోని చల్లదనము
పాలబుగ్గల చిన్నిబాలలాడెడిముద్దుబలుకు నమాయికమధురిమంబు
శాత్రవోద్వేధనాసామర్థ్యమగు పూర్వవీరకాంతల మాటఁజారుపోటు
శారదాపీఠప్రసాదితకలవాక్యరాజహంసీకావ్యరచనసరణి

> తేర్చిగూర్చిన నీనోటి తేనెమాట
> కల్లుచవిగొన్న యీపలుగాకులమెదఁ
> దూరదో—కలగింపదో—దూసిపోదో?
> చింతమనకేల ధర్మంబు చెంతగలుగ!

# కార్తికమాస ప్రశంస

శ్రీమతి నుసర్ల లక్ష్మీనరసమాంబగారు

కృత్తికానక్షత్రముతో కూడిన పూర్ణిమ కలదియగుటచే దీనికి కార్తికమాసమని పేరు వచ్చెను. మరియునిది కార్తికేయుడుద్భవించిన మాసము. ఈమాసమందుండు దినములన్నియు శివప్రీతికరములగుటయేగాక విష్ణుప్రీతికరములుగాకూడ కనుపడుటచే "శివాయ విష్ణురూపాయ, శివరూపాయ విష్ణవే" అను శ్లోకమును సార్థకము చేయుచున్నవి. ఈమాసములోని కృష్ణపక్షము శరత్కాలాంతమగుటయేగాక ఒక్కొకప్పుడు విశాఖాంతముగ గూడనుండుచున్నది. "విశాఖాంతని మేఘాని" అనే న్యాయము-చొప్పున వర్షములు క్రమముగా తగ్గుచుండును. శరదృతువగుటచే చంద్రుడు నిర్మలమైన ఆకాశమందు ధవళకాంతులచే ప్రకాశించుచు పిండియారబోసినటుల వెన్నెలకాంతుల వెదజల్లుచుండును. చూపరులకమితానందము కలిగించుచుండును. నదీనదములు నిర్మలములై బురదనీరు లేకుండానుండి స్వచ్ఛమైన నీరుకలిగి స్నానపానయోగ్యములుగ నుండును. ముఖ్యముగా ఈమాసమునందు తెల్లవాఱుజామున కృత్తికానక్షత్రదర్శనము చేసికొనుచు స్నానమాచరించి దీపారాధనలు నదీనదములయొడ్డున చేయుచుందురు. శివభక్తులు స్నానజపతపాదులు గావించుకొని దేహమునిండ విభూతి, రుద్రాక్షలను ధరింతురు. హరహరా యను నామోచ్చారణచే స్నానజపాదు లొనర్చుచుందురు. శివభక్తులుకొందరు శంఖారావములు గావించుచుందురు. కృత్తికానక్షత్రవిమర్శన చేయువారికి కుమారస్వామి జననవృత్తాంతమును పురాణములయందు చదివిన బోధపడును. "కృత్తికాక్షురషట్కం" అని జ్యోతిశ్శాస్త్ర ప్రమాణము ప్రకారము అంతరిక్షమందు కృత్తికానక్షత్రము మంగలికత్తి యాకారముగా ఆరునక్షత్రములుగల సమూహమై ప్రకాశించుచుండును. దీనిని పామరులు పిల్లలకోడి యని పిలచెదరు. షట్కృత్తికాదర్శనము వలన పాపపరిహారమగును—సప్తమహర్షుల భార్యలలో అరుంధతీదేవితప్ప మిగిలిన ఆరుగురు ఋషులభార్యలకును శాపకారణంబుగలిగి షట్కృత్తికలుగా ఏర్పడినటుల కొన్ని పురాణగాథలవలన తెలియుచున్నది.

కార్తికమాసమునందుండు సోమవారములు బహుపుణ్యప్రదమైనవి. రుద్రాభిషేకములు, ఉపవాసవ్రతములు—ఏకభుక్తములు, కార్తీకనక్తాలు మొదలగునవి తమతమ యభీష్టప్రకారముగా భక్తులు జరుపుకొనుచుందురు. ఈకార్తీకమాసము నెలరోజులు ఈక్రిందనుదహరించు పండుగ, పర్వదినములచే ప్రకాశించుచున్నవి.

1. కార్తికదీప ప్రారంభము; 2. యమవిదియ; 3 త్రిలోచనగౌరీవ్రతము; 4. నాగులచవితి; 5. నాగపంచమి; 6. గోష్ఠాష్టమి; 7. విష్ణురాత్రివ్రతం; 8. గోవర్ధనపూజ; 9. భీష్మపంచకవ్రతం; 10. తులసీకాష్ఠపూజ; 11. ధాత్రీమూలపూజ; 12. క్షీరాబ్ధిద్వాదశి; (చిలుకుద్వాదశి) 13. వైకుంఠచతుర్దశి; 14. కార్తీకపౌర్ణమి; (జ్వాలాతోరణం: స్కందదర్శనం) 15. శైవనక్తవ్రతం; 16. కృత్తికాదీపోత్సవం; 17. గోవత్సద్వాదశి; 18. కార్తీకదామోదరవ్రతం ఈ మొదలగు పుణ్యవ్రతములు ఈమాసారంభమునుండి మాసాంతమువరకును గలవు. ఇందులో అందరెరింగినట్టియు తరుచు మన ఆంధ్రదేశీయు లాచరించుచుండునట్టి వ్రతములు 1-2 మాత్రమే అయియున్నది.

## క్షీరాబ్ధిద్వాదశి

పాలసముద్రమునందు శ్రీకృష్ణభగవానులు ఆషాఢశుద్ధ ఏకాదశియందు శయనించుచుందురుగాన దానిని శయనైకాదశియని యందురు. ఆరోజునసే చాతుర్మాస్యవ్రతారంభమును కొందరు యతీశ్వరులు చేయుదురు. ఆశ్రీమహావిష్ణువు కార్తికశుద్ధఏకాదశియందు నిద్రనుండి మేల్కాంచెదరు. దానినే ఉత్థానఏకాదశియందురు. అక్కడనుంచి తులసీబృందావనములోనికి ఈద్వాదశియందు ప్రవేశింతురు. గాన తులసీబృందావనసహిత శ్రీకృష్ణ






# వివాహము

పోతాప్రగడ వేంకటేశ్వరులుగారు

అనాలోచితముగ, వివేచనారహితముగ, తొందరగ, చివరకు పశ్చాత్తాపమందుటకై యానవంతు లిరువురు దాంపత్యము ప్రకటించుటగాదు. ధనాశచే పీడింపబడు తల్లిదండ్రులచే బాలబాలికల గళముల బంధించు పాశముగాదు. ఆత్మజ్ఞానవిరహితమగు సంఘముచే నియతమై పస్తావింపదగనిదికాదు. చేయదగినదై, నలుగురినోటబడుట కనర్హమైనదికాదు.

నాగరికసంఘమునకు మూలపునాదది. భిన్నలింగవ్యక్తుల నిరువుర బాధ్యతగల యుద్యోగముల నియమించుటయది. జాతిని నిర్మించి నిలుపుసంస్థలలో నది యుత్కృష్టమైనది. నాగరికత యునికి దానిపై నాధారపడియున్నది. మానవకళ్యాణముదానిపై ఆధారపడియున్నది.

కాన, మానవనిర్మితసంస్థలన్నిటిలోగూడ నది యెంతయు పూజింపదగినది.








# ఆంధ్రవాణి

నండూరి బంగారయ్యగారు బి.యె.

ఆదికవి నన్నయార్యుని యంకపీఠి
విద్దెములు నేర్చుచుండంగ ముద్దుగుల్కు-
మధరలీలావినోది నీప్రథమమూర్తి
కాంధ్రవాణిరో! మంగళమగునుగాక!

దివ్యకవిసార్వభౌముడౌ తిక్కయజ్వ
నిలచిహారతులీయఁగ గొలువుదీర్చి
దిగ్భ్రమగొల్పు నీనవ్యదివ్యమూర్తి
కాంధ్రవాణిరో! మంగళమగునుగాక!

పూతకవిరాజు బమ్మెర పోతరాజు
అర్పణముజేసికొనిన భక్త్యర్ఘగీత
పుష్పమాలల నలరు నీపుణ్యమూర్తి
కాంధ్రవాణిరో! మంగళమగునుగాక!

ఆంధ్రకవిరాజశేఖరు లాదరించి
యాదలవహించి పూజింప నహరహంబు
త్రిభువనానందకందమౌ దివ్యగీతి
నాలపించుచునున్న నీయమృతమూర్తి
కాంధ్రవాణిరో! మంగళమగునుగాక!

ఆంధ్రవాణీస్వరూపంబు నాత్మనెంచి
యాంధ్రవాణీవిరావంబు నాలకించి
యక్షతలదాల్చి రావమ్మ యాంధ్రపుత్రి!
మాతృపాదార్చనమున జన్మముతరించు.

మూర్తిని ఈద్వాదశీవ్రతముద్వారా పూజింతురు. దీనిని ఉత్థానద్వాదశి యని యందురు. ఈవ్రతఫలమును గూర్చియు దీపారాధనమహాత్మ్యమునుగూర్చియు వ్రతకల్పమందు సవిస్తరముగ చర్చింపబడినది. ధాత్రీసహితముగా అనగా ఉసిరికచెట్టునుకూడ తులసీవృక్షముతో చేర్చి పూజింతురు. ఉసిరికాయలకు రంధ్రములుచేసి అందులో ఆవునేతితో దీపారాధనలు చేయుచుందురు.

### కార్తికపూర్ణిమ

ఈదినము కుమారస్వామి అనగా కార్తికేయుడు జన్మించిన సుదినము. మహాలింగార్చన-బిల్వపత్రిపూజ-మహాన్యాసపూర్వకరుద్రాభిషేకములు ప్రతిశివాలయమందును తరుచు జరుపబడుచుండును. పంచామృతాభిషేకములు, చలిమిడివ్రతములు జరుగుచుండును. దేవాలయముల అధోపరిభాగములయందు దీపావళులచే నలంకరించబడి దేదీప్యమానముగ ప్రకాశించుచుండును. నందాదీపములు, ఆకాశదీపములు వెలుగుచుండును. రాత్రికాలమువరకు అభిషేకములు జరుగుచుండును. సూర్యాస్తమానమైనతర్వాత జ్వాలాతోరణము వెలిగించబడును. ఆతోరణము క్రిందనుంచి ఈశ్వరుని కుటుంబసహితముగా ఒకఆందోళికయందుంచి దాటించెదరు. చాతుర్వర్ణ్యములవారును సాయంత్రము శివాలయమునందు దేవుని దర్శింతురు. కూష్మాండములను, కందచెట్లను ఈశ్వరప్రీతికొరకు పసుపురాసి కుంకుమబొట్లుపెట్టి సమర్పించెదరు. పూర్వమొకప్పుడు హాలాహలమును ఈశ్వరుడు మ్రింగుచుండ ఆవిషముకంఠమందు చిక్కుకొని క్రిందికిని మీదికిని వెడలనందున పార్వతీదేవి తనభర్తకు ప్రమాదము సంభవించెనని భయపడి యిష్టదైవమునుగూర్చి తనభర్తకుకలిగిన ఆపదను బాపవలెనని ప్రార్థించెనట. అటుల ఆపద నివారణఅగునేని-చిచ్చులతోరణము క్రింద తానుకుటుంబసహితముగా ముమ్మారుదూరుదుననెనట. అప్పటినుంచియు ఈజ్వాలాతోరణము యేర్పాటుకాబడెనట. హాలాహలము కంఠమందు నిల్చియుండుటచే గరళకంఠుడనియు, నీలకంఠుడనియు శివునికి పేరువచ్చినటుల పురాణములయందు కలదు. ఈజ్వాలాతోరణమును పట్టిరెండుగడ్డితో త్రాడువలెపేని పల్లెటూరులయందు శివాలయములకుముందుగా కట్టి దానిని వెలిగించినతర్వాత ఈశ్వరుని కుటుంబసహితముగా పల్లకీలోనుంచి ముమ్మారు దాటించుట సాంప్రదాయమై యున్నది. ఇట్టి జ్వాలాతోరణము కట్టినగడ్డితినుటయందు నందీశ్వరాది పశుగణములకు ప్రీతియగుటచే కాబోలుపల్లెటూరు రయితులుపై జ్వాలాతోరణపు ఎండుగడ్డికొరకు పెనుగలాడి కొద్దిగాసంపాదించి తమ పశువులుమేయుచుండుగడ్డిలో కలిపినచో తమపశువులు ఆకసువును భక్షించిన వ్యాధులురావనియు, మరియు పశుసంతతి వృద్ధినొందుననియు నమ్మెదరు. ఈకార్తికపున్నమిరోజుననే త్రిపురాసురసంహారముజరిగెనని కొందరనెదరు. కార్తికదామోదరపూజలు, మునికార్తివ్రతములు, ముప్పదిమూడు పున్నమనోములు ఈరోజుననే ప్రారంభింతురు.

## పెండ్లినాటి ప్రేమ

కొమ్మూరి భోగలింగాచార్యగారు

పెండ్లికాలమునందు పీటలందుననుండి
కాంత కాంతుని సుంతగాంచునపుడు
నునుసిగ్గువెనులాగ కనులపండువుగాగ
తలబ్రాలనిడికొనుతరుణమందు
ఊరేగుసమయాన నూరకేతమకాన
నొకరినొక్కరుజూచుచుండునపుడు
అందరొక్కటగాంచ ముందునేనను వాంఛ
బిందెలో "బటువు" చేసందునపుడు
తలుపుదరిపేరులనుజెప్ప తడుమునపుడు
వ్రేలువ్రేలునగైకొని వెడలునపుడు
నూత్నదంపతులందు నన్యోన్యప్రేమ
యింత యంతననేల యనంతముకద!

# స్త్రీవిద్యాశిక్షణము: కాశీ

సాహిత్యవిద్యాప్రవీణ బులుసు వేంకటరమణయ్యగారు

వర్తమానపరిస్థితులంబట్టి యాలోచించినచో భావిభారతీయాభివృద్ధికై పురుషుల వలెనే స్త్రీలుకూడ మిక్కిలి పాటుపడవలసియున్నదని యభిజ్ఞుల యభిప్రాయము. విద్యా గంధములేనిచో నెట్టికార్యమును గొనసాగదు. ఒకవేళ నెట్లోని కార్యము తుదముట్టియున్నను, అయ్యవారినిజేయఁబోయి కోఁతిని దయారుచేసినరీతిని విపరీతముగనే ఆకార్యము ఫలించును. కాన విద్యాసంపాదనము మొదటికార్యమనియు, భారతీయాభివృద్ధికిఁ బాటుపడుట తర్వాతిపనియనియు తేలినసారాంశముకాన స్త్రీవిద్యాశిక్షణము ప్రథమకర్తవ్యమైనది.

ఆవశ్యకమగు నీస్త్రీవిద్యాశిక్షణవిషయమున భారతీయులెంతవఱకు ఆలోచించి యెట్టి ప్రాముఖ్యమునొసంగిరో విచారించినచో ఆంధ్రదేశీయు లందఱికంటె నంతిమశ్రేణియందుఁ బరిగణింపఁబడుట నిర్వివాదాంశము. తక్కిన భారతీయులందరికంటెను వంగదేశీయు లెక్కువ ప్రోత్సాహమొసంగి స్త్రీవిద్యాశిక్షణమునఁ బాటుపడుచుండుట మనకందఱికిని దెలియును. కాన వంగస్త్రీలేఎక్కువగ విద్యాభ్యాసమొనర్చుచున్నారని మన మెఱుంగవచ్చును.

వంగదేశీయుల విద్యావిషయకప్రయత్నములను గుర్తెఱింగి యుత్తరహిందూస్థానీయు లందఱును ఇంచుమించుగ వారిమార్గము నవలంబించుచున్నారు. భారతీయులందఱును విద్యావిషయమున వంగదేశీయులననుసరించినచో స్త్రీలోకమున విద్య యభివృద్ధిగాంచి దేశాభివృద్ధికై తోడుపడఁగలదనుట నిర్వివాదాంశము.

స్త్రీవిద్య యభివృద్ధిగాంచవలెనన్నచోఁ గేవల ప్రోత్సాహమేకాక మఱికొన్ని సదుపాయములు తోడ్పడవలెను. విద్యావిషయమున బాలురకుఁగల సౌకర్యములకంటె బాలికలకువలయు సౌకర్యము లధికముగనుండవలెను. మనదేశములోఁ బ్రాథమికపాఠశాలలు ప్రత్యేకముగఁగావలసినన్ని బాలికలకొఱకులేవు. మధ్యమపాఠశాలలు, ఉన్నతపాఠశాలలును దేశముమొత్తముపై ఏపదింటికంటెను తక్కువగనేయున్నవి. పాఠశాలలలోని విద్యాశిక్షణము మాటయటుండఁ బాఠశాలలసంఖ్యయే బాలికావిద్యాదుఃస్థితిని జెప్పకచెప్పుచున్నది.

సర్వవిద్యాపీఠమగు వారాణసీనగరముంగనినచో స్త్రీవిద్యాశిక్షణమునఁగూడ నచట నెంతటి సదుపాయములుగలవో తెలియఁగలదు. కాశీనగరమునఁగల హిందూవిశ్వవిద్యాలయమున స్త్రీలకొఱకొకప్రత్యేకకళాశాలయు, అచటనే ప్రత్యేకవసతిగృహమును (Hostel) గలవు. పురుషులెవ్వరు నావంకకుఁబోవీలులేదు. ఎత్తయిన ప్రహారీగోడలాభవనములఁజుట్టు వారుకొని అన్యప్రవేశానర్హతను విశదముచేయుచున్నవి. విద్యార్థినులసంరక్షకురాలుగ (Warden) నొక హైందవోపాధ్యాయినియే నియమింపఁబడుచున్నది. మనదేశమున నచ్చ

టచ్చట స్త్రీవిద్యాలయములున్నను వసతిగృహములు ప్రత్యేకముగ లేవు. కాన విద్యాభిలాషినులయభిలాషలు పూర్తిగఁ గొనసాగనేఱకున్నవి.

హిందూవిశ్వవిద్యాలయమున స్త్రీలసౌకర్యమిట్లుండ నగరమునందుఁ బ్రత్యేకముగ విశ్వవిద్యాలయమున కనుబంధముగ సెంట్రల్ హిందూబాలికోన్నతపాఠశాలయొకటి స్థాపింపఁబడియున్నది. (Central Hindu Girls High School) అందు ప్రవేశపరీక్షయందు తీర్ణులైనవారికే నీవిశ్వవిద్యాలయమునఁ బ్రవేశముకలుగును. లేదా స్వతంత్రముగనైనను ప్రవేశపరీక్ష నీయవచ్చును. నగరమున నొకమొడఁగల బాలికోన్నతపాఠశాలకు నడచివచ్చుట బాలికలకందఱికిఁగష్టము. ప్రత్యేకముగ బండ్లుచేయించుకొని దినదినమునువచ్చుచో విపరీతమగు ధనవ్యయము. ధనవ్యయమునకోర్చియైనను, బాలికలను బడికిఁబంప నామార్గమే యాలోచించినచో—ఒంటరిగ బాలికలనుబంపుట యనుచితము. కావున పాఠశాలాధికారులే బాలికలకెట్టికష్టములు, తలిదండ్రులకెట్టి నష్టములునుగలుగకుండ వారికై ప్రత్యేకముగనొక మోటారుబస్సును నియమించిరి. ఆబస్సు సరియగుసమయమునకు బాలికల యిండ్లకువచ్చి వారిని బడికప్పఁజెప్పి, బడిమూయఁబడినవెంటనే మఱల వారి నింటఁజేర్చుచుండును. ఇంటినుండి వెడలినబాలిక యింటికివచ్చువఱకుఁగలబాధ్యత పాఠశాలవారిదే. ఈమార్గమత్యుత్తమమైనది. నెలకు బస్సునకు రెండుమూఁడురూప్యములకంటె నెక్కువ వ్యయము కాఁజాలదు. ఇట్టిసదుపాయములుండుటఁబట్టి విద్యార్థినులు లీడువచ్చినవారైనను, ఈడు మీఱినవారైనను, ఎట్టి నీతిభంగభయమునులేనందున వారి విద్యాభ్యాసమునకెట్టి యంతరాయమునుగలుగదు. కాశీనగరమున నిట్టి సదుపాయములుకలవు కనుకనే స్త్రీవిద్య యభివృద్ధినొందుచున్నది. కావుననే దేశసేవనమునఁబాల్గొను మహిళామణులలో నీనగరమువారే ముందంజవేయుచుఁ గీర్తినిగడించుచున్నారు.

కాని హిందూవిశ్వవిద్యాలయమున స్త్రీలకొఱకేర్పఱుపఁబడిన కళాశాలలో నింటరుమీడియేటు (Intermediate) తరగతులుమాత్రమేకలవు. అనఁగా నది రెండవతరగతి కళాశాల (Second Grade College) యన్నమాట. బి.ఏ, ఎం.ఏ. తరగతులకుఁ జదువఁదలఁచినస్త్రీలకుఁ బ్రత్యేకసౌకర్యములేనందున వారు పురుషుల కళాశాలలలోనికే పోవలసి వచ్చుచున్నది. కాన స్త్రీలకుఁ బ్రత్యేకశిక్షణము నీయఁదలఁచిన విశ్వవిద్యాలయాధికారులు పైతరగతులయందుఁగూడ వారికిఁ బ్రత్యేకతనుగల్గించినచో మిగుల సమంజసముగ నుండియుండును. నీతిభంగమునకెట్టి యవకాశములును గలుగనేఱవు.

హిందూవిశ్వవిద్యాలయమునందలి విద్యార్థినులలో వంగదేశీయులే అధిక సంఖ్యా కలుకలరు. నాగేతరదేశమునందుఁగూడ విద్యాభివృద్ధియందు వంగీయనారీమణుల సంఖ్యాధిక్యము తక్కిన భారతరమణీమణులయందు దభ్యర్థిత్వమును, వారికిఁ బ్రోత్సాహమును దెలుపఁజాలియున్నది.

మనదేశమున స్త్రీవిద్యాశిక్షణము చాల దీనస్థితియందున్నది. ఉన్నతవిద్య నభ్యసించిన రమణీమణు లేపదిమందియో, అంతకుఁదక్కువగనో కలరు. ప్రోత్సాహము మృగ్యము. వారికివలయుసదుపాయము లంతకంటెను బూజ్యములు. కావున నాంధ్రరమణీమణులు విదుషీమణులై దేశాభివృద్ధికిఁ బాటుపడవలెననికోరు నాంధ్రసోదరులెల్ల రీయుత్తరహిందూస్థానమహిళావిద్యాశిక్షణపద్ధతుల నామోదించి, వానినే యనుసరింపవలెను. తొలుత ప్రతిపట్టణమునందును ఉన్నతపాఠశాలగాని, లేక మధ్యమపాఠశాలగాని బాలికలకొఱ కేర్పాటు గావించి బాలికల రాకపోకలకును, సత్ప్రవర్తనమునకును వీలుకలుగునట్లు మోటారుబస్సు సదుపాయములు కల్పింపవలెను. అట్లొనర్చినచో నిక్కపై నిచ్చుచిన్నబాలికలను బడికిఁబంప సంకోచించు తలిదండ్రుల కట్టిసంకోచమును లేకుండఁబోవును. విద్యాభిలాషిణులకోర్కెలు నెఱవేరఁగలవు. అట్లున్నతపాఠశాలలందలి విద్య పూర్తియైనపిదప, స్త్రీవిద్య యాదరింపఁబడుచున్నంత మన విశ్వవిద్యాలయమునందును ప్రత్యేకముగ స్త్రీలకొఱకుఁ గళాశాల యేర్పరుపఁ బ్రయత్నములు కొనసాగింపవచ్చును.

## గృహలక్ష్మికి

వర్ధమాని అప్పారావుగారు

పూజయైనర్పవో పుణ్యాంగనాల సత్
సౌభాగ్యగరిమమ్ము చాటెదీవు;
హితబోధసేయ సాహిత్యసామ్రాజ్యకళా
సరసవిజ్ఞానమ్ము జార్చెదీవు;
హసియింప సాంద్రరాగామృతశ్రీలతో
విరియువెన్నెలరీతి వెలిగెదీవు;
ప్రేమింప సురనదీవిమలవీచీసుధా
ప్రణయరాజ్యాలలో పల్కెదీవు;
జగముమ్రోగురీతి వసంతగీతు
లళికుమారికలర్పింప, నందుకొనుచు
నిత్యనూతనశోభతో నీవుమెరసి
వేయియుగములు విశ్వాన వెలుగుకొరకు
చిన్నిగీతికయంపు నాశీరమ్ము(?)
తలధరింపుము గృహలక్ష్మి! తలిరుబోణి!

## బాలిక

శ్రీమతి చర్ల సుశీలగారు

మోహాంధతమసాన బుధులేలపడెదరో
నానొకయప్పుడు నవ్వుచుందు
పీమాయసంసృతి నేఁగూడఁబడవలె
నేమొయన్నటు లొకక్షేడ్చుచుందు
వేచింతయునులేక యెలమితో ఘటనుఁటి
ననవొక్కమాటాడుకొనుచునుందు
పమలతత్త్వముగాంతు ననుసట్లొకపరిఁ గ
న్నరమోడ్చిపరవశవగుచునుందు
వహహా! నీచిద్విలాసము నరయఁదగును
నింతలోనవ్వు లంతలోనేడ్పు లంత
లోననాటలు నంతలోమానవృత్తి
నందుచుందు బాలిక! ధన్యవనఁగనీవె.

# పశ్చాత్తప్తుడగు పాపి

శ్రీమతి జె. సీతాలక్ష్మీకన్యగారు

ఒకానొకడీప్రపంచమున డెబ్బదేండ్లు జీవించెను. తనజీవితకాలమంతయు పాపభూయిష్ఠమగు దుష్కార్యములాచరించి మహాపాపిగఁ జీవించెను. వృద్ధాప్యమున మహారోగముచే పీడింపఁబడఁజొచ్చెను. కాని అప్పుడైనను తన పాపకార్యములనుఁదలచి పశ్చాత్తప్తహృదయుఁడుగాలేదు. అవసానము సమీపించెను. ప్రాణవాయువులు కంఠగతమైనప్పు డీవిధముగా దుఃఖించెను. "ప్రభువా! నన్ను క్షమింపుము. శిలువమీద మహాపాపులను మీరెట్లు క్షమించితిరో ఆవిధముగా నన్ను క్షమింపవేడెదను!" ఈమాటలతో పశ్చాత్తప్తహృదయుఁడై ప్రాణములవీడెను. ఈతనిఆత్మ పరమేశ్వరునియందు ప్రేమపూరితమైనదియు ఆమహామహుని అపారకరుణయందమితవిశ్వాసము గలదియునగుటచే స్వర్గద్వారములచెంతకేగి తనను స్వర్గరాజ్యములోనికిఁ జొరనిమ్మని ప్రార్థించుచు ద్వారములను తట్టఁజొచ్చెను. అంతటలోనుండి ఒకవ్యక్తి ఈక్రిందివిధముగ మాటాడఁజొచ్చెను.

స్వర్గవ్యక్తి:—ఎవ రీస్వర్గద్వారముల తట్టువారు? ఇందుప్రవేశించుట కీవ్యక్తి తనజీవితకాలమున నెట్టి సత్కార్యములనొనర్చెను?

పాపి:—అయ్యా! నే నొకమహాపాపిని. నాజీవితమంతయు దుష్కార్యములతో నిండియున్నది. ఒక్క సత్కార్యమునైనను నాజీవితమునఁ జేసియుండలేదు.

స్వర్గవ్యక్తి:—(గద్దింపుతో) పాపుల కీస్వర్గరాజ్యమున తావులేదు. పో, పొమ్ము.

పాపి:—మహాప్రభూ! మీకంఠధ్వనిమాత్రమే వినుచున్నానుగాని మీరలెవ్వరో నెఱుంగలేకున్నాను. మీముఖము నాకగపడుటలేదు. దయచేసి మీపేరు సెలవిచ్చెదరా?

స్వర్గవ్యక్తి:—నేను క్రీస్తుయొక్క శిష్యాగ్రేసరుఁడనైన పీటరును. **(Peter the Apostle)**

పాపి:—పీటరుమహాశయా! ఈపాపిని కరుణించుము. మానవుని హృదయదౌర్బల్యమును, దేవదేవుని కరుణామయచిత్తమును జ్ఞప్తికిదెచ్చుకొనుము. మీరు క్రీస్తుదేవుని ప్రథమశిష్యులుకారా? ఆయన బోధామృతమును మీరు స్వయముగాఁ గ్రోలితిరిగదా! వారిసేవ మీరు స్వయముగసల్పితిరి—వారి మనఃకమలముకంది వారు మానవుల అవిశ్వాసమునకు దుఃఖించుచు మిమ్ముఁ మేలుకొనియుండి దైవమును ప్రార్థించుచుండు మనగా ముమ్మారుకూడ మీరు ఆజ్ఞనుమీరి మైమరచి ప్రమత్తతతో నిద్రించినసంగతి జ్ఞాపకమున్నదా?—నేనును అట్టి దుర్బలుడనే. మరియొకసంగతి. ప్రాణావసానదశయందైనను మిమ్మును కాచికొనియే యుందునని ప్రమాణముజేసి 'కయాఫస్' అధికారియెదుట కృతఘ్నుడనై నీప్రాణములమీది తీపిచే మీప్రభువగు క్రీస్తుదేవుని విడనాడినసంగతి మీకు జ్ఞాపకమున్నదా?—నేనును అట్టిదుర్బలుడనే!—మరియు తెల్లవారుజామున ముమ్మారు కోడికూతవిని మీరు మీకృతఘ్నతకు మనోదౌర్బల్యమునకు కన్నీరు కాలువలైపార మీరు దుఃఖించినసంగతి మీకు జ్ఞాపకమున్నదా?—నాస్థితియునట్లే—మీరు నన్ను లోనికిరానీయ కెట్లు అడ్డుపెట్టగలరు?

వెంటనే స్వర్గద్వారములోనివ్యక్తి నోరుమూసికొనెను. కొంతతడవాగి పాపి తిరిగి స్వర్గద్వారములతట్ట నారంభించెను. తనను లోనికి రానీయమని ప్రార్థింపఁజొచ్చెను. లోనుండి మరియొకవ్యక్తి.

ద్వితీయవ్యక్తి:—ఎవరువారు? భూలోకమున నీవెట్లు జీవితమునుగడపితివి?

పాపి:—నేనొక మహాపాపిని. నాజీవితమున నొక్క సత్కార్యమైనను జేసియుండలేదు.

ద్వి. వ్యక్తి:—పో! అపలకుపొమ్ము! పాపాత్ములకు మాతో సమానముగ స్వర్గమున నిలువ తావులేదు.

పాపి:—మహాశయా! పుణ్యాత్మా! మీర లెవ్వరో నే నెరుంగలేకున్నాను. మీకంఠధ్వనిమాత్రము వినబడుచున్నది. కాని గుర్తింపలేకున్నాను. మీరు నాకగపడుటలేదు. దయచేసి మీనామాంకితమును నే నెరుగవచ్చునేమో సెలవిచ్చెదరా?

ద్వి. వ్యక్తి:—నేను దావీదును. మహారాజును, ప్రవక్తను. **(King David)**.

పాపి అధైర్యమ్ముజెందలేదు. స్వర్గద్వారములవీడలేదు.

పాపి:—దావీదుమహారాజా! నన్ను కరుణింపుము. మనుష్యునిదౌర్బల్యమును, సర్వేశ్వరుని నిర్హేతుక జాయమానకటాక్షమును స్మరణకు దెచ్చికొనుము.—దేవదేవుడు నిన్ను ప్రేమించి మహారాజుగ నొనర్చినాడు. నీకు సర్వము నొసంగినాడు. రాజ్యము, కీర్తి, ధనధాన్యములు, భార్యలు, సంతతి, సర్వమునొసంగి, లోటను నది నీ వెరుంగ వట్లొనర్చినాడు—కాని నీసౌధమునుండి సామాన్యమానవుడగు "ఉరయు"ని భార్యను నీవు పాపదృష్టిచే వీక్షించితివి. దుర్మోహము నీహృదయమున మొలకలెత్తెను. నీవు బలవంతుడవగు రాజువగుటచే అమాయకుడగు 'ఉరయు'నిఁ జంపించితివి. అతని సతీతిలకము నపహరించి మహాపాప మొడిగట్టుకొంటివి.—నేనును అట్లే పాపిని—తదుపరి నీ వెట్లు పశ్చాత్తప్తుడవై దుఃఖించితివో నీకు జ్ఞాపకమున్నదా? కొంచెము స్మరణకుదెచ్చుకొనుము—"నాపాపకార్యములను గుర్తించితిని. నాపాపము ఎల్లప్పుడు నాయెదుట ప్రత్యక్షమై నాకన్నులకు గట్టినట్లున్నది." అనిగదా నీవు విలపించితివి.—నేనును పశ్చాత్తప్తహృదయుడనైతిని. నీ వెట్లు స్వర్గద్వారములనాపై మూసివేయగలవు?

లోనివ్యక్తి సిగ్గుజెంది మౌనముధరించెను. పాపి మరికొంతతడవు వేచియుండి తిరిగి స్వర్గద్వారముల తట్ట నారంభించెను. స్వర్గరాజ్యమునుండి మూడవవ్యక్తి ఈక్రిందివిధమున పలుక నారంభించెను.

మూడవవ్యక్తి:—ఎవరువారు? స్వర్గద్వారములను తెరువుడనుచున్నారు. స్వర్గములో కాలిడుటకు భూలోకమున నీజీవిత మెట్లుగడపితివి?

పాపి:—నేనొక ఘోరపాపిని. దారుణకృత్యము లొనర్చితిని. నాజీవితమంతయు పాపభూయిష్ఠము.

మూ. వ్యక్తి:—పో! పామ్మవలకు! పాపులకు దేవునిస్వర్గరాజ్యమున స్థానములేదు.

పాపి:—ఓ మహాశయా! మీస్వరముమాత్రము వినఁబడుచున్నది. మిమ్మును గుర్తింపలేకున్నాను. మీరు నాకగపడుటలేదు. దయచేసి మీర లెవ్వరో నే నెరుంగవచ్చునా?

మూ. వ్యక్తి:—నేను పరిశుద్ధుడగు యోహానును. **(John the Divine)** క్రీస్తుదేవుని శిష్యుడను.

పాపి:—(అంతట బహుసంతోషముతో) నేనిప్పుడు నిశ్చయముగా స్వర్గరాజ్యములోనికి ప్రవేశమును గందును. పీటరును, దావీదునుగూడ నన్ను లోనికి తప్పక రానిత్తురు. వారికి మనుష్యుని హృదయదౌర్బల్యమును, దేవదేవుని అపారకరుణారసమహిమయు రెండును అనుభవమే.—నీవు మానవకోటిని ప్రేమించుటయు, ప్రేమతత్వమును పూర్తిగ నెరిగినవాడవునైయున్నావు. "దైవము ప్రేమస్వరూపుడనియు, ప్రేమింపలేనివాడు దేవునిఁ దెలియఁజాలడనియు" నీవేగదా లోకమునకు వెల్లడించినది? మరియు, నీవృద్ధాప్యమున 'సోదరులారా! ఒకరినొకరు సోదరభావముతో ప్రేమించికొనుడ'ని ముఖ్యముగ మనుష్యకోటికి బోధించితివిగదా?—అట్టి నీవు నన్నెట్లు ద్వేషింపగలవు?—అసంభవము. నన్నెట్లు స్వర్గద్వారములనుండి క్రిందికి త్రోయగలవు? నీవు నీప్రేమసిద్ధాంతమునైనను త్యజింపవలెను. లేదా నన్ను స్వర్గరాజ్యములోనికి తీసికొనవలెను.

అంతట స్వర్గద్వారములు తెరువబడెను. యోహాను పశ్చాత్తప్తుడగు పాపిని ప్రేమపూర్వకముగఁ గౌగిలించుకొని స్వర్గరాజ్యములోనికి మహానందముతోఁ గొంపోయెను.

—"టాల్‌స్టాయి"

# గంటలయంత్రం

సుంకరి మల్లికార్జునస్వామిగారు

మాయింట్లో బహుపురాతనమైన గడియారముంది. పూర్వపు వస్తువులయొక్క పటుత్వమేమోగాని మానాన్నగారు దాన్నేపాతికేండ్ల క్రిందటకొన్నారో అప్పటినుండీ బాగానేపనిచేస్తూంది. నేనెఱిగింతరువాత దానికి రెండుమూడు మరామత్తులయ్యాయిగాని టైమించుమించువార్లో బాగానేచూపిస్తుంది. యంత్రము వయస్సుమీరిన దగుటచేతను గాభోలును చిన్నముల్లు పెద్దముల్లు వంకరవంకరగానుండి ఒకటినొకటి కలసికొనుచు, డైలు మీద జీరాడుచూ పల్లెటూరి కల్లుముచ్చులువలె ప్రయాణంచేయుచుండును.

మానాన్నగారికాగడియారమంటే చాలాదయ. ప్రతిమంగళవారము మరువకుండా తొమ్మిదిగంటలకు బీగమిస్తారు. వారికొకప్పుడు టైముకావల్సొస్తే మాయీగడియారందగ్గరకుపోయి టైముచూచుకుంటారుగాని మాచేతుల్నుండే రిస్టువాచీలను వారెప్పుడూనమ్మరు. ఒకపు డది పొరపాటుచేత తప్పుగంటలుకొడ్తే దానివేపుచూచి మేమంతా నవ్వుతూంటాము. అప్పుడు మానాన్నగారి కోపమేమని చెప్పడం. తోకత్రొక్కిన త్రాచువలెమండిపడి మమ్మల్నందర్నూ ఒక్కపెట్టునకసిరేస్తారు. మేమందఱమూ పిల్లిముందరెలుకల్లాగు మూలమూలలకు జారిపోతాము.

ఒకనాడు మానాన్నగారు గ్రామాంతరంవెళ్లేరు. నేను మధ్యాహ్నం భోజనం చేసి మానాన్నగార్ గదిలోనికి వెళ్లేను. చేయుటకేమీతోచక "గృహలక్ష్మి" పట్టుకొని ఒకవాలు కుర్చీమీదకూర్చున్నాను. నేను మల్లానవ్వుతానసేమోగాని మాగడియారం తదేకదీక్షతో పనిచేస్తూంది. టైము పదకొండు ఐదునిముషాలైంది. వెంటనే నాచేతివాచీ చూచుకున్నాను. నాటైముకూడ అంతే అయింది. నాకు ఆశ్చర్యమైంది. వెంటనే నాహృదయంలో అదోవిధమైన ప్రేమపుట్టింది గోడగడియారంమీద. నావాచీతో సరిగ్గాతిరగడం, మానాన్నగార్కి దానియందుగల ప్రేమ, దానికి మాయందుగల స్థిరమైన అభిమానం ఆలోచిస్తూ దానివేపుచూస్తూ అలాగేకూర్చున్నాను.

కొంచమైనా విశ్రాంతిలేకుండా లేడిపిల్లకంట్లోపాపలాగు ఇటూఅటూ చరిస్తూ కాలాన్ని కరిగించేస్తూంది పెండ్యులము. పందెపుగుఱ్ఱం మైలురాళ్లను చూచినకొద్దీ పరుగు జోరుచేయునట్టు అంకెస్థానాలు చూస్తూన్నకొద్దీ పరుగుజోరుచేస్తూంది పెద్దముల్లు. ఎన్నాళ్లకు యీకష్టంవిడువదురా యని విచారిస్తూందన్నట్టు మెల్లమెల్లగా సెరలాంతరను గమనించిన గుడ్సుబండివలె ప్రయాణంచేస్తూంది చిన్నముల్లు.

ఈసమయంలో ఒకసందుగుండా సాలిపురుగొకటి డైలనే రంగంమీదికి ప్రవేశించింది. వెంటనే నాయకుడుప్రవేశించిన నాటకరంగంలాగు వికసించింది డైలంతా. శివాజీపాత్రధారుడులాగు తనవీరత్వం ప్రదర్శించడానికి యిటూఅటూ కొట్టేడు రెండుజర్కులు. అప్పటికి

పెద్దముల్లు మీాజీవితకాలంలో మరోహపావుగంట తినేసాను సుమండీయన్నట్టు మూాడు
మీాద ప్రవేశించింది. మూాడుమీాద పెద్దముల్లు పదకుండు తరువాత చిన్నముల్లు పెద్దపర్వ
తాల్లాగు అడ్డేయబట్టి ఆగేడుగాని లేకపోతే డైలుమీాద దిగ్విజయంచేసేసేవాడే మననాయ
కుడు. మనవీరుడు డైల్లో రమారమి మూాడుపావుల ప్రదేశంవశపరచుకున్నాడన్నమాట.
వశపరచుకొని ఊరుకున్నాడా ఏంటి? లేదు. సంతోషంతో మూాడుగంతులు గంతేడు.
కాళ్లుసవరించి బస్తీమీాద సవాలన్నట్లు మీాసాలుదువ్వేడు. ఉత్తరగోగ్రహణంలో అర్జు
నుడు శంఖనాదంచేసినట్టు చిన్ననాదం మొదలెట్టేడు. అక్కడుండే చిన్నకీటకాల్ని పట్టి వధం
చేడు. దోమల్ని చెండాడి నమల్రిమింగేడు. అంతాచిందరవందరజేసి నాకేం అడ్డులేదురా
భాయి అన్నట్టు నాల్గుదిక్కులు అదోవిధమైనదర్జాతో పరికించేడు.

ఇంతలో పెద్దముల్లు ఆఱుమీాదకు ప్రవేశించింది. ప్రళయకాలసూచనలాగు ఒకశబ్ద
మైంది ఠాంగుమని. మనవీరుడు త్రుళ్లిపడ్డాడు. తిరిగిధైర్యంతెచ్చుకొని ఇహపరవాలేదు
యవడొచ్చినా చెక్కేస్తానన్నట్టు నించున్నాడు శరీరంసవరించుకొని. కొంతసేపటికి మరెవరూ
శత్రువుల్లేరని నిబ్బరంచేసుకున్నాడు. విలాసంగా తనరాజ్యంమీాద మఱ్రెండుట్రిప్పులు
కొట్టేడు. కాని రమారమి డైల్లో అర్ధభాగమే తిరగ్గలేడు. తనరాజ్యంయొక్క సరిహద్దులు
మామూాలుగానేయున్నవనుక్కున్నాడు పాపమాతడు. గొప్ప అహంభావంతో అటూ
ఇటూపచార్లు మొదలెట్టేడు. తలకాయపైకినిగిడ్చి మనకంటే వీరుడెవడ్రా యీాలోకంలో
ననుకున్నాడు. అంతాబాగుంది గాని తనసౌఖ్యము లోకంలో కొంచంలోటుందని కనిపెట్టేడు.
తన కొకగృహము, గృహిణియుంటే మజాగాఉంటుందనుకున్నాడు. కాని, ఇంతరాజ్యం
సంపాదించింతరువాత మనంతలుస్తే వస్తుందిరాయన్నట్టు ఒక్కపెట్టునవికసించిందిమోమంతా.
తనకు ముందుముందు రాబొయ్యేసౌఖ్యాలనన్నింటిని తనభావనాలోకంలో జిత్రించుకున్నాడు.
గొప్పగొప్ప దిగ్విజయాలు దండయాత్రలు మునంజరుపవల్సుందికదా యనుకున్నాడు. తటా
లున తనరెండు భుజములవేపు అదోవిధంగా దృష్టులునిల్పుకున్నాడు. దండలుబిగించి మజిల్
ఫార్మేషన్ను దిలకించుకొన్నాడు.

పెండ్యులం టక్కుటక్కుమని శబ్దంచేస్తూనేయుంది. మనవీరు డింతకముం దీశబ్దాన్ని
వినోదంక్రింద దీసుకున్నాడు. కాని అనంతంగా శబ్దించడంచూచి వీడు మనకొకశత్రువా
ఏంటనుకున్నాడు. శత్రువైతే దగ్గరకొచ్చింతరువాత మాట్లాడుకుందామనుకున్నాడు మన
వీరుడు. నవదినాలనాటకంరా యిదంతాయన్నట్టు తొమ్మిదినిచూపేస్తూంది పెద్దముల్లు. మన
నాయకునిరాజ్యం కుంచపడ్డాది. విలాసంగా మరోహాట్రిప్పు కొట్టేడు మన రంగసింహము.
తనరాజ్యం క్షీణించుట కనిపెట్టుటలేదు పాపమాతడు. కొంతసేపటికి పదకొండుమీాద ప్రవే
శించింది. పెద్దముల్లు. ఇప్పుడు మననాయకుడు నివశించటానికే చాలకున్నది స్థలం.
తాను రెండుముల్లులమధ్యను చిక్కుపడ్డాడు. వెంటనే తనకురాబొయ్యేవిపత్తును కనిపెట్టేడు.



లండను: థేమ్సునది; కొయ్యనావ; రబ్బరుదోనె పోటీ



బెర్లినులో 'సర్కసురాణి' హిందూదేశపు ఏనుగుమీద ఊరేగుట

ఇదంతా ఆగర్జించుచున్న శత్రువు (పెండ్యులము) చేసినపనేనా యని అనుకున్నాడు. తన విపత్తును కనిపెట్టనందులకు తన్నుతాను నిందించుకొన్నాడు. ఇటూఅటూ ఆత్రులితో చరించేడు. ఆస్థలంనుండి పైకి దుముకబొయ్యాడుగాని అవకాశంచిక్కిందికాదు పాపం. పెద్దముల్లు పండ్రెండుమీదకు పరుగెడుతూంది. పాలీడు మృత్యువుచేతుల్లో చిక్కాడు. అవసానకాలం తటస్థించింది. వైరాగ్యం వొక్కపెట్టు నావరించింది మనస్సులో. కాని మరిహా చేసేదేముంది? లోకంలో ప్రతిజీవిపనీ యింతేనాయన్నట్టు పండ్రెండుసార్లు జయభేరీలు మ్రోగించింది మన గంటలయంత్రం.

నేను కుర్చీలో త్రుళ్ళిపడ్డాను. శరీరమంతా కంపించింది. రోమములు రిక్కవొడిసినవి. చెమట్లుబోసినవి. కొంతసేపటికి ధైర్యాన్ని పిలుచుకున్నాను. శరీరమంతా చక్కబెట్టుకున్నాను. మన గంటలయంత్రాన్ని చూస్తూంటే అదోవిధమైనభయము, అణకువపుట్టింది నాకు. గడియారంతాలూకు రెండుచేతులు నాకు మృత్యువుచేతులట్లు తోచేయి. టక్కుటిక్కుమనియూగుతూన్న పెండ్యులము నాప్రాణాల్ను చేదేస్తూయున్నట్లు కాన్పించింది.

## పరుషోక్తి

విద్యాప్రవీణ యరసూరి మల్లికార్జున రావు గారు

పరిభవమునేయురీతి సుస్పష్టమాట  
పడతినియాబోంట్లతో బల్కబాడిగాదు  
అయినమవ్వ్యథులే యిప్పుడతివసమయ  
ములనువిడనాడి పల్కింపప్రోత్సహించె.  
రక్తగంధార్ద్రుడై, మహారథికుడైన  
భీము డిప్పుడు పర్వతభూములందు  
ధూళిధూసరదేహుడై కాలినడక  
తిరుగుచునుసత్యధనుమది ద్రిప్పకుండె.  
ఉత్తరపుకురుదేశాల రిత్తపరచి  
ప్రాజ్యకుప్యంబు మునుదెచ్చెపార్థివుండు  
ఆతడీనాడు వల్కలాహారణుడగుచు  
నలుకజనియింపడేలకో? యువనిపతికి.  
గహనతల్పంబునన్గడు కఠినులయ్యు  
కచవితతులయ్యు, శైలజగజములట్లు  
కనులకగపడు కవలలగాంచిధైర్య  
సంయమములను బాధింపజనవదేమొ?  
మునుపు బహుమూల్యతల్పంబుననుబరుండి  
స్తోత్రగీతంబుల న్నిద్రలేతువెపుడు  
నేడు దర్భలబవళించి నిద్రమేలు  
కొనుచునుంటువి నక్కలకూతలకును.

## తపస్విని

విశ్వనాథ నరసింహము గారు బి. ఏ.

సంతమసంబు స్వచ్ఛప్రభలందోలి  
లోకబాంధవుడు వెలుంగువేళ  
దినరాజకరములెంతే నాకులంబడి  
కాననంబునరత్నకాంతులీన,  
వికసితాబ్జసుగంధవిమలానిలంబున  
చలియించుతేరగలకలరవమున  
రమణీయమణిరాజి రంజిల్లచిత్రమో  
యననొప్పు సౌందర్యమునఁజెలంగు  
కాంతయొార్తుక నిర్మలస్వాంతయగుచు  
భక్తి పరమేశు నీశ్వరు వరునిగాగఁ  
గోరిజపియించి హిమవత్కుమారియనఁగ  
నంజలిఘటించి పరమేశు నరయుచుండె.

# సురబాల

ఎడవల్లి రామమూర్తిగారు

౧

నేను సురబాలతో కలిసి మాయింటికి ఒకవందగజాలదూరంలోవున్న వీధిబడికి వెడుతూండేవాణ్ణి. అక్కడ ఏదోకాస్త గుసగుసలాడి బడిపంతులకంట్లో కారంకొట్టి చెప్పకుండా యిద్దరం సురబాలయింటికి వెళ్లేవాళ్లం. నేను ఆపిల్లయింటికెప్పుడెళ్లినా వాళ్లమ్మ మమ్మలిద్దర్నీ వరుసగనుంచోబెట్టి 'వీళ్లకు యీడూ జోడూ సరిపోయింది' అని తనలో తనేమురిసేది. అప్పట్లో నేను యెంత చిన్నవాణ్ణయినా, ఆమె అన్న మాటల్లో అర్థంగ్రహించకపోలేదు. అదేవిటోగాని అప్పట్నుంచీ సురబాలమీద ప్రపంచకం అందరికంటె నాకురెక్కువ హక్కుందనుకునేవాణ్ణి. ఈవిషయం మొదట నాలో చిన్నమొలకై క్రమంగాపెరిగి పెద్ద వృక్షమైంది. అంచేత సురబాల నావస్తువేకదాయని ఆమె నొక్కొక్కసారి కసిరి మనసు చిన్నబుచ్చేవాణ్ణి. ఆపిల్లకూడా నేనెంత కఠినంగామాట్లాడినా యేమీ అనుకొనేదికాదు. మావూళ్లోవాళ్లందరూ 'సురబాల చక్కనిచుక్క' అనేవారు. అది నాదురదృష్టంకాబోలు నాకళ్లకి ఆమె అంతఅందకత్తెగా కనిపించలేదు. పాపం! ఆమె నానిరసనభావానికి గురియైంది.

౨

మాతండ్రి ఒక జమీందారీమీద మేనేజరు. నేపెరిగి పెద్దవాణ్ణయినతర్వాత తన్నేదో వుద్ధరిస్తాననుకొన్నాడాయన. నేరెండుముక్కలు నేర్చుకొన్నతర్వాత యేయెస్టేటులోనో ఒక గుమాస్తాగా ప్రవేశపెట్టిద్దామని మానాన్నఊహ. కాని ఆయనఅభిప్రాయం నాకు నచ్చేదికాదు. మావూర్నుంచి భూపేంద్రప్రసాద్ అనే నాస్నేహితుడొకడు కలకత్తాకు పారిపోయి అక్కడ ఇంగ్లీషు బాగాచదువుకొని పెద్ద ఉద్యోగం సంపాదించేడు. అదే నాఆశయంకూడాను. భూపేంద్రుడుకొచ్చినంత పెద్దపదవి రాకపోయినా జడ్జీకోర్టులో హెడ్ గుమాస్తాపనైనా చెయ్యాలనుకొన్నాను. కోర్టుఉద్యోగస్తులంటే మానాన్నకి మహాగౌరవం. ఉద్యోగస్తులెవరైనా మాయింటికొస్తే పంచభక్ష్యపరమాన్నాలతో వాళ్లకు విందుజరిగేది. చిన్నప్పట్నుంచి యిటువంటివన్నీ చూట్టంవల్ల నేనుకూడా యేకోర్టులోనో ఉద్యోగం సంపాదించాలనుకొన్నాను. మావైపున నిజంగా యీవుద్యోగస్తుల్ని దేవుళ్లల్లాగ పూజిస్తారు. మన ముప్పయిమూడుకోట్లదేవతలు యిప్పటికి యీయుగంలో యిల్లాకోర్టుఉద్యోగస్తులై జన్మించారేమోయని అనిపిస్తుంది. ఈశ్వరుణ్ణిపూజించటం అడుగంటింది సరికదా వీళ్లని ఫలపుష్పాలతో పూజిస్తున్నారు.

ఒకమంచి వీలైనసమయంచూచుకొని కలకత్తా యెవ్వరితోను చెప్పకుండా వెళ్లిపోయాను. ఒకచిన్న పల్లెటూళ్లో మొదట బసచేసివుంటూండగా మానాన్నదగ్గరనుంచి నాకు పైకంవచ్చింది. ఇంక చదువు ప్రారంభించాను. చదువులోనే యెప్పుడూ మునిగిపోకుండా రాజ్యాంగసంస్థల్లోను, సంఘసంస్కర్తలతోను చేరి కాలం గడుపుతూవుండేవాణ్ణి. అప్పటి వుద్రేకంలో ప్రాణం అర్పించటానికైనా సంశయించేవాణ్ణికాదు. కాని అంతప్రాణం అర్పించవలసినఅవసరమే ఉండేదికాదు. నేనున్నూ ఆవూళ్లోని పిల్లలు కొంతమందిన్నీ కలసి చాలాదీక్షతో పనిచేసేవాళ్లం. కలకత్తాలో కొందరు విలాసవిద్యార్థులు మమ్మల్నిచూచి నవ్వేవారు. వాళ్లల్లాగ మేము చంచలబుద్ధివాళ్లంకాదని పాపం వాళ్లు గ్రహించలేదు. మాసంఘనాయకులు ధాటీగా ఉపన్యాసవర్షాలు కురిపిస్తోంటే నేను మరికొందరితో కలసి, యెండనక, వాననక కాకుల్లాగ అన్నాహారాలు మరచిపోయి, యింటింటికీ చందాలుపోగుచెయ్యటానికి తిరిగేవాళ్లం. రోడ్డుపక్కల్నినుంచొని వచ్చేపోయే

వారికి కరపత్రాలందించటం; యేపన్యాసాలుంటే లెక్చరుహాల్లో బల్లలు, కుర్చీలుసర్దటం; ఎవరైనా మమ్మల్నిగురించిగాని మాసంఘాన్నిగురించిగాని చెడుగుమాట్లాడితే దెబ్బలాటకు సిద్ధమవటం: యివేమాపనులు. మమ్మల్నిచూచి నవీననాగరికవిద్యార్థులు గేలిచేసేవారు-చేయనీ-మనకేం!

నేను కలకత్తా యెందుకొచ్చేను? ఏవో రెండుముక్కలునేర్చుకొని కోర్టులో ఉద్యోగంవెలిగిద్దామని. కాని నేనిప్పుడు చేసేదేమిటి? ఏమేజనీయో, గరిబాల్డీయో, గాంధియో అవుదామని.

## 3

ఇక్కడ పరిస్థితులిట్లావుంటే, నాకు సురబాలకువివాహం స్థిరంచేశారు-మావాళ్లు. నాపదిహేనవయేట నేను కలకత్తావచ్చేను. అప్పటికి సురబాలకు ఎనిమిదేండ్లు. నాకప్పుడే పెండ్లియీడు దాటిపోయిందని విచారిస్తున్నాడు మానాన్న. బ్రతికియున్నంతకాలము బ్రహ్మచారినై దేశసేవచెయ్యాలని నేను యిదివరకే సాహృదయాంతర్భాగములందు నిశ్చయించుకొన్నాను. ఈసంగతి పాపం, మానాన్నకేంతెలుసును? సరే యేమైతే అవుతుందని చదువయ్యేవరకూ పెండ్లిచేసుకోనని మానాన్నకు తెలియజేసెను.

సురబాలకు రామలోచనునకు వివాహమయిందని మూడునెల్లయినతర్వాత నాకు తెలిసింది. దేశసేవచేసి మాతృదేశాన్నుద్ధరిద్దామని యనుకుంటూన్న నాకు సురబాలవివాహంసంగతి అంత కర్ణకఠోరంగాలేదు. మెట్రికుల్యేషన్ ప్యాసయి యింటర్మీడియట్ పరీక్షకు వెళ్లాలనుకొంటూన్న సమయములో మాతండ్రి స్వర్గస్థుడైనాడు. ఇంక నేనా యేకాకీగాణ్ణికాదు. నాకింకా యిద్దరుచెల్లెళ్లు తల్లి యున్నారు. అందుచేత చదువుకు స్వస్తిచెప్పి ఉద్యోగంయేదైనా స్వీకరించవలసివచ్చింది. ఆనేక తికమకలుపడి యీగడ్డి ఆగడ్డి కొరికి కుట్టుకుడకు తల్రప్రాణం తోకకురాగా నోఖాలీజిల్లాలోవున్న చిన్నపట్నంలో ఒకస్కూల్లో రెండోమాస్టరుగా ప్రవేశించాను. ఆహా! నాకుతగిన ఉద్యోగందొరికింది! నాబోధవలవల్ల పిల్లన్ని ఉద్రేకపూరితుల్నిచేసి దేశోపకారానికి పనికొచ్చేటట్లు చెయ్యొచ్చు. పనిలోప్రవేశించాను. దేశసేవకంటె నాకు స్కూల్లో పరీక్షలు ముఖ్యమయ్యాయి. కర్మంజాలక యేవన్నా మనదేశాన్నిగురించిచెబితే హెడ్మాష్టరు నన్ను కోప్పడేవాడు. నన్ను ఖైదులోపెట్టినట్లయింది. నాఉత్సాహం అడుగంటింది. ఇంట్లోకూర్చున్నకాస్సేపు నాభావనాతరంగాలు నిరాటంకంగా విల్లువిరిసేవి. కాని స్కూల్లో అడుగెట్టగానే ఆవుద్రేకం మాయమయ్యేది. విధిలేక నాగల్లక్రింద యెద్దుల్లాగ పనిచెయ్యవలసివచ్చేది. ఉద్రేకపూరితుణ్ణయినప్పుడు రాజకీయ రణరంగానికురుకుదామన్నా వీల్లేదు.

## ౪

మాస్కూలు ఊరికి ఒకచివరనుంది. స్కూలుపక్కనే ఒక పెద్దచెరువుంది. ఆచెరువుగట్టుమీద ఒకపక్క తమలపాకులతోటలు, యింకొకపక్క లేతకొబ్బరిచెట్లు, మందార మొక్కలు, గన్నేరుచెట్లు యింకా యిటువంటివి లక్షరకాల వృక్షజాతులున్నాయి. మాబడిదగ్గరనే ఒక తాటాకులయింట్లో నేనుంటున్నా—మాయింటి వెనకాల పెద్దమర్రిచెట్లున్నాయి—ఆచెట్లవూడలు భూమిలోకిదిగి పెద్దఆకుల్లేని స్రమానుల్లాగ కనిపిస్తాయి. ఆచెట్లనీడను కూర్చుంటే పోయినప్రాణం తిరిగొస్తుంది.

తనభార్యయు, నాబాల్యస్నేహితురాలునైన సురబాలతో రామలోచన్ స్కూలుకుకొంచందూరంల్లో ఉన్న ఒకయింట్లో కాపురంవున్నాడు. రామలోచనకు నాకు పరిచయంకలిగినప్పటికి సురబాల నాస్నేహితురాలని అతనితో నేచెప్పలేదు. అల్లాచెప్పటం మంచిదికాదనుకొన్నాను.

'ఇప్పుడు సురబాలకు నాకు ఉన్నసంబంధంయేమిటి?' అనేవిషయం నన్నుబాధిస్తూండేది. ఒకరోజున యేంతోచక రామలోచను యింటికివెళ్లేను. మేమిద్దరం మాతృదేశదుస్థితిగూర్చి ముచ్చటిస్తున్నాం. నావుద్రేక

పూరితమైన గంభీరోపన్యాసానికి రామలోచను విస్మితుడయ్యాడు. ఎవరైనా సరే! మనదేశమునుగూర్చి కాస్సేపు ఆలోచించినట్లయితే "అయ్యో! దేశము యింత హీనస్థితిలోనికి వచ్చిందే!" యని అనుకోనకపోరు. మేమిద్దరం యిట్లా మాట్లాడుతూవుండగానే—

ప్రక్కగదిలోంచి మంజీరమురుగుల శ్రావ్యధ్వని—చీరమడతల సవరణశబ్దం—భయకంపాలమైన పాద పతనము—వినవచ్చేయి. కిటికీసందునుండి ఆతురతతో చలించుచున్న నయనములజంట నన్ను పరీక్షిస్తోందని అనుకున్నాను. తత్క్షణం నామనస్సునందొకవికాసం కలిగింది. మెరుంగుకనుంగవలు—వికాసముతో నిండుకొన్నాయి. ఉదారత్వంతో, నిరాడంబరంతో, కృతజ్ఞతతో, బాలికకు సహజమైన ప్రేమతో నిండుకొన్న ఆమెనయనములజంటను నామనోనయనం జూచింది. అప్పుడు ఒక్కమారుగా నాహృదయం క్రుంగిపోయి చెప్పరానిబాధను కలిగించింది. నేను నా ఆశ్రమానికి చేరుకున్నాను. కాని హృదయభారము కొస్తాకూడా తగ్గలేదు. ఏపుస్తకమైనా చదివితే తగ్గుతుందని అల్లా చేసేను. లాభంలేకపోయింది. పోనీ వ్రాయటంవల్ల కొస్త శాంతినిస్తుందేమో అనుకుంటే మరీలాభంలేకపోయింది. నాహృదయం గొడ్డలిదెబ్బలకు గురిఅయింది. ఏలాగో కొంచంమనశ్శాంతి కావించుకొని నన్నింతగాబాధించే దేమిటా అనుకొన్నాను ఆసాయంత్రం—

నీసురబాల యెక్కడుంది? అని లోనుండి అంతరాత్మ ప్రశ్నించింది. సురబాల నాజీవితకాలమంతా నాతోయుండాలని నాఆశయం కాదని జవాబిచ్చాను.

అంతరాత్మ:—సురబాల నాది అని నీవు ఇదివరలో ఒక్కసారి అనియున్నట్లయితే ఆమెను నీవద్దకు తెచ్చుకొని యుండెడివాడవు—ఇప్పుడో నీవు సురబాలనుగురించి మాట్లాడగూడదు. అట్లుచేయుట వీలు లేదు సరికదా ఆమెను కన్నెత్తిచూచుటకైనా నీవిప్పుడు అర్హుడవుకావు. సురబాలయొక్క మంజీరగాజుల ధ్వనివినగలవు. ఆమెయొక్క కృతజ్ఞతావీక్షణములనందుకోనూ గలవు. కాని నీకు ఆమెకు మధ్య ఒక మహాసముద్రం అడ్డువుంది.

"పోనీ! సురబాలెవరు, నేనెవర్ని?" అని అన్నాను.

అంతరాత్మ:—"సురబాలకీ నీకు యిప్పుడేవిధమయిన సంబంధంలేదు. అప్పుడు సురబాలా! నీవు నాదానవు అని అన్నట్లయితే ఆమెనీకన్నివిధాలా ఉపకారిగావుండేదే! నిజమే? అన్నివిధాల నీతోడునీడై యుండేది. నాకందరికంటె యిష్టురాలై నాకష్టసుఖాల్లో భాగంపంచుకొంటూ యుండేది. కాని యిప్పుడో! సురబాలకు-నాకు యేవిధమయిన సంబంధంలేదు. కన్నెత్తిచూట్టానికైనా వీల్లేనటువంటి పరాయివాణ్ణయ్యాను. పోనీ! మాట్లాడదామా అంటే మరీతప్పు. పోనీ బాల్యస్నేహితురాలైన సురబాలను కాస్సేపుతలుచుకొందామా అంటే మహాపాపం. మొన్నటివరకు సురబాలంటే యెవరో యెరక్క యేవైపునుండో అకస్మాత్తుగావచ్చి అసందర్భంగా రెండుమంత్రాలు చదివించి రామలోచనను, సురబాలను వివాహంచేసుకొన్నాడు! యెందుకు? ఇదంతా తలుచుకుంటే గర్భనిర్భేదమవుతుంది. ఇంతకీ! నేనిక్కడికి ఒకసంఘాన్ని సంస్కరించాలనిగాని, కొత్తమతసాంప్రదాయములను ప్రవేశపెట్టాలనిగాని రాలేదు. వాళ్లిద్దరు హాయిగావుంటే అదేపదివేలునాకు. నేచెప్పిందంతా మీకు అసమంజసంగాతోచవచ్చును. రామలోచను ఇంట్లోవున్నసురబాల నాకు వానికంటె దగ్గరహితురాలుకాదూ? ఈసంగతిమట్టుకు నామనస్సుఎప్పుడూమరువదు. నాయీూహసమంజసమైనదికాదనియు సకారణమైనదికాదనియు నేనెరుగుదును. కాని అది అస్వాభావికమైనది కాదనికూడాయెరుగుదును.

౫

నాకుయేపని చేయటానికీకూడా బుద్ధిపుట్టేదికాదు. ఒకనాడు మధ్యాహ్నమప్పుడు నేక్లాసులో కూర్చున్నప్పుడు పిల్లల్లరిచేస్తూంటే ప్రకృతంతా సాయంకాలపుచల్లనియెండలో ప్రకాశిస్తోంటే చల్లని

సౌగంధికవాయువులు హాయిగా ప్రసరిస్తోంటే నామనస్సునందొక అనుమానముతోచింది. "ఈబడిబంతులు బ్రతుకెన్నాళ్లు" మనుకొన్నాను. బడివదలినతర్వాత సాయంకాలం ఒక్కణ్ణే కూర్చొని కాలాన్ని వెళ్లబుచ్చటానికి చాలా చిరాగ్గాయుండేది. సరే! యెవరైనాపాపం! నాతోమాట్లాట్టానికివస్తే నాకు మరీబాధగాయుండేది. ఎల్లాగో చెరువుగట్టుమీద కూర్చొని ఆచెట్లనుండివచ్చే గాలులననుభవిస్తూ చిన్నకెరటాలకి కంగారుపడి చెదరి ప్రకృతిసౌందర్యాన్నిచూచి ఆనందిద్దామని పైకివచ్చేచేపలను పక్షులు యెగురవేసుకుపోవటం చూస్తూండేసరికి నాకు మనస్సులో ఒకసంశయం తట్టింది. "మానవసృష్టంతా తప్పులమయమే కదా! తనకు కావలసినవస్తువు కాళ్లవద్దకు వచ్చినప్పుడు లక్ష్యపెట్టక అది కాస్తా దాటిపోయిన తర్వాత దానికోసం విశ్వప్రయత్నాలు చేయటం—ప్రతిమానవునకు స్వభావంకదా!" అనుకున్నాను. అప్పట్లో వివాహమాడి, సురబాలతో హాయిగా సంసారంచేయవలసిందేమరి! కాని యేగాంధీనో, మేజినీనో, గరిబాల్డీనో అవుదామని నాఆశయం—స్కూలుమాష్టరుపనిరాగానే యీ ఆశయంకూడా అడుగంటింది.

పెండ్లికాక పూర్వం సురబాల యెవరో ఆమెరూపమెట్టిదో యెరక్క సురబాలను అందరు స్త్రీలవలనే చూచుకొనుచున్న రామలోచనుకు ఆమెను పరిగ్రహించటానికి యేమిహక్కుంది? రామలోచనుకు యేవిధమైన మనస్తాపంలేదు కాబోలు—అతనికి ప్రకృతి సౌందర్యమును ఆనందించటం తెలియదు—లేకపోతే యీ చెరువుగట్టుమీద కెందుకురాడు? అతనికంతకంటె ప్రాప్తిలేదు కాబోలు!—

౬

రామలోచను ఒకపెద్దకేసుపనిమీద ఒకమాటు ఒకపట్నంవెళ్లవలసివచ్చింది. నేను నాయింట్లో ఎట్లా యేకాకినైయున్నానో సురబాలకూడా అంతే! ఆవేళ సోమవారం. ప్రొద్దుట్నించీకూడా మబ్బుగావుంది. పదిగంటలనుంచి తుపారం మొదలిడింది. ఆవేళమాబడికి సెలవు. ఆకాశంమీద మేఘాలు చిందరవందరగా పరుగెత్తుచు చూచేవాళ్లకి చాలాఆనందాన్నికలిగిస్తున్నాయి. మొర్నాటి ప్రొద్దుటికి వర్షం ఎక్కువయింది—తుపాను!...గాలి రివ్వున ఈచెవినుండి ఆచెవికి వీస్తోంది. ఇంతగాఢమైన మబ్బుల్లో భీభత్సంగావున్న మహావాయువుల్లో అయ్యో!—సురబాల ఒంటరిగాఉంది.

సురబాల యింటికంటె మాబడిబంగాళా చాలాగట్టిది. సురబాలను—స్కూలుబంగాళాకు తీసికొచ్చి సురక్షితంగావుంచి—అవసరమయితే నేను చెరువుగట్టునయినాయుంటానికని నిశ్చయించుకొన్నాను. కాని ఆమెను పిలుచుటకు చాలినధైర్యంయేదీ? రాత్రిఒంటిగంటన్నర—నిమిష నిమిషానికి మెరపులు—వాటివెనకాలే హృదయకుహరాల్ని పగిల్చేపిడుగులు—వీటికితోడు సముద్రపుకెరటాలహడావిడి. ప్రకృతి యింత భయంకరంగావుంది.

౭

తక్షణంసురబాల యింటికేసి పరుగెత్తేను. మధ్యదోవలో ఒకయేరుంది. ఆయేట్లో నీరు అప్పుడే మోకాల్లోతువరకు ప్రవహిస్తూంది. నేను నెమ్మదిగా యేరుదాటి అవతలగట్టుకి వెడ్తోంటే మధ్యలో ఒక కెరటము వచ్చి నాగుడ్డల్నితడిపివేసింది. ఇంకా నేను ఏటిగట్టుయెక్కనైనాలేదు. దానియెత్తు రమారమి రెండునిలువులుంటుంది. నెమ్మదిగా గట్టెక్కటానికి ప్రయత్నిస్తున్నా—ఒకవ్యక్తిని చూడగానే నాదేహం కంపించింది. నామనస్సు కలతపడి పరిపరివిధాలపోయింది. హృదయం క్రుంగిపోయింది. ఆనిలబడ్డవ్యక్తి యెవరో నాదేహంలోవున్న ప్రతిరక్తనాళానికికూడా తెలుసును. సందేహంలేదు. ఆవ్యక్తికూడా నన్నుగుర్తించివుంటుంది. ఏటివరద క్షణక్షణానికి యెక్కువైపోతోంది. మేమొక యిసుకతిప్పమీద నిలబడ్డాం—చుట్టూనీరు.

మాయిద్దరిమధ్య మూడుగజాలదూరం వుంటుంది. ప్రవాహం హెచ్చిపోతోంది—ఆకాశమంతా వెతికినా ఒక నక్షత్రంకూడా కనబడ్డంలేదు. ప్రపంచమంతా గాఢాంధకారంతో నిండిపోయింది. మేముయిద్దరమూ ఆసమయాన్ని మాట్లాడుకొన్నా మమ్మల్నెవరు వారించేవారు? కాని మాకేమాట్లాట్టానికి ధైర్యంలేదు. ఒకరినొకరు కుశలప్రశ్నకూడా వేసుకోలేదు. ప్రవాహంయొక్క ఉద్రేకంచూట్టానికికూడా భయంగావుంది. ఆప్రవాహంల్లోపడితే జీవితాశనున్న. ఈవాళ, ఆమెప్రపంచము ఒదిలేసి నాప్రక్క నిలబడింది. చిన్నప్పుడు దేవకన్యలాగ ఎప్పుడూ నాప్రక్కనే నిలుచునేది. ఆరోజులు యిప్పటివా? యీవేళ ప్రపంచమునువిడిచి యీమహాంధకారమునందు—యీనిర్జనప్రదేశమునందు—యీ వుద్రేకభయంకరవాహిని ముందు-నాప్రక్క-నాప్రక్కనే నిలబడింది. ఇంకొక్క కెరటమువస్తేచాలు-మేమింక యీలోకమున వుండము—భగవంతుడు సురబాలను రక్షించుగాక! ఆమె కాయురారోగ్యములను చేకూర్చుగాక!

౫

ఈరాత్రి—ఈఏకరాత్రి—భయంకరమృత్యుసమానమైన రేయియందే నేనునాజీవితమున బొందని స్వర్గసౌఖ్యమును బొందితిని.

సుప్రభాతమైంది—తుఫాను ముగిసింది. వరదలు తగ్గేయి. ఇద్దరంకూడా ఒక్కమాటైనా మాట్లాడుకోకుండా సురబాల ఆమెయింటికి నేను నాఆశ్రమానికివచ్చేము. ఇంటికొచ్చి ఆలోచించేను. గొప్పదంటా ఉద్యోగంచేయలేదు. గాంధీనిగాని, మేజనీనిగాని, గరిబాల్డీనిగాని కాలేదు. మరి నేనుచేసిన ఉద్యోగం యేమిటి?—బడిపంతులపని.

౬

కాని ఆనాటిరేయియందు నేపొందిన ఆనందము నాభారమైన జీవయాత్రను సుఖపరుపగలదు.

ఆనాటినిశయే—నాభారభూతమగు జీవయాత్రకంతకును ఆహ్లాదమునుకలిగించిన మహత్తరమయినరేయి.

## గృహలక్ష్మి

చెరుకుపల్లి శివరామయ్యగారు (సాహిత్యమండలి)

ప్రణయమత్తద్విపేంద్రంబుఁబంధింపంగ లావణ్యవతి శృంఖలానిభంబు
అజ్ఞానవిషకంటకారణ్యతలమందు కాంతయే నవమల్లికాసుమంబు
ప్రాప్తసంకటవారివాహసంఘమువిప్ప వనితయే ఝంఝూప్రభంజనంబు
కందర్పశరతాపగాఢాంధమునడంప సతివయే పూర్ణచంద్రాతపంబు
మదనసామ్రాజ్యపదవికి మధురవాణి పట్టపుందేవి సంతానభాగ్యనిత్య
వైభవసమంచితారామవాటికలకు నంగనామణియే వసంతాగమంబు.
మధుమాసవేళలేమావిగున్నపైన నెలుగెత్తిపాడు కోయిలనుమించి
అలవోకముద్దుమాటలబల్కు శుకశారికాగణంబులను చీకాకుఁబరచి
ప్రావృషేణ్యపయోధరశ్రేణి వెలుగొందు భవ్యవిద్యుల్లతాప్రభవహించి
శరదాగమంబున సంపూర్ణపూర్ణిమాచంద్రాతపంబుతో సరసమాడి
ప్రీతిగొలిపించు సరససంగీతవాక్యరమ్యలానన్యహాసాంకురములనెపుడు
సుధలజిమ్ముచు ధవుమనోరథమెఱింగి బలుగుతరుణియె సంసారతరణి ధరణి.

# పేదరాలు

ఏటుకూరి వేంకటనరసయ్యగారు

ఆరుబయట శరచ్చంద్రికాంతరమున
కటికిరాలను సీతకంకటినిబరచి
పొన్నపూదండగ్రుచ్చెడు పొలఁతియొకతె
పాహిశ్రీకృష్ణయనియూర్పుబరపెనిగుడ.
సేవకత్వము దుర్భరజీవనంబు
సాధనానుపపత్తి సంసారవృత్తి
దుస్తరదరిద్రతాపత్తి దుఃఖముక్తి
ధన్యులమనంగ నన్నిట ధరణిఁగలరె?
ఉన్న రావమ్మ, పోవమ్మ, పిన్ని యనుట
దయకుమాలినవారు బాంధవులు నాఁడు
పేదలై స్రుక్కునాఁడు గంపెడుబలంగ
మెండుఁగనరాదు శాత్రవుఁడేని మేలు.
కోడితో మేలుకొని రవిక్రుంకువరకుఁ
బొటుపొట్టకుఁబలుపాట్లుపడినఁగాని
తుదకునేగంజిగ్రుటయో దొరుకుటరిది
కటికియుపవాసముల నిట్లుగడుపవలసె.
భోగభాగ్యములిడి సౌఖ్యభూతినెఱపి
యున్నతస్థితి మాకివ్వకున్న మానె
కట్టుగుడ్డయుఁ దినుటకుఁబొట్టకింత
తానుదయసేయరాదొకో దయదలిర్ప.
పక్షులను నింగిపాలించు ప్రభువుగలఁడు
చీమలనుబుట్టలన్ సాకు స్వామిగలఁడు
కప్పలనురాతిలోఁ బెంచు ఘనుఁడుగలఁడు
నీటఁబాలనుముంచఁగా నేర్చుతండ్రి
నాదుపాలిటఁగలఁడని నమ్మియుంటి.
భాగ్యవంతులు నూతనపదవులంది
కట్నములు గానుకలు దగుగౌరవములు
లాంఛనస్ఫూర్తితోఁ బిల్లలకునుమనువు
లరయుచున్నారు నాతల్లి వరుఁడెవండొ?.

పిల్లనిచ్చెదమన "నేమిబెట్టువారు
భూములా? బుట్రలా?" యను పోని తగిన
వారితో వియ్యమందినఁ జేరదైన
లేనిదౌర్భాగ్యసంబంధ మేనిగలుగు.
పెండ్లియాడున కేపిల్ల బెరిగియుండె
లేదుసంబంధమీయూర నాదుసుతకు
పట్టుతోనరకువారు గన్పడరుమాకు
కూతురుఁదలంపఁ గంటికిఁగూర్కురాదు.
నాథుఁడవ్వేళ సగమునిశీథముననె
కృషికిఁబోవును బరులనికృష్టసేవ
నెముకలరిగెను రాతిరిసమయమందుఁ
గాళ్లుకుప్పలువడివచ్చుఁగాడె విసిగి.
తనయపెండిలియనివారిఁ దలఁచియడుగఁ
"జేతనున్నదె? కులమంటి కోతియెవఁడొ
మనకుమారైకుఁదొరకకమానఁడనును"
వారిమనసునదైవికవాంఛమెండు.
వంచనముచేత విత్తమార్జించఁబోఁడు
పరులమోచేతినీరుఁ జేఁబట్టఁబోఁడు
కాయకష్టము సజ్జనగౌరవమను
నేమిపుణ్యమొ? నాకబ్బెనిట్టిభర్త.
పెరటిలోఁబూవుఁదావి ముమ్మరమునిగుడఁ
బూలఁజిదిమెడు లేజవరాలిమనసు
తల్లిసంతాపజనకమై తన్నుఁదలఁచి
చింతపసివాడెనని వలవంతఁగుండె.
కానరారంతగాఁ జెలికాండ్రునేఁడు
వయసుమీరినవెలికి రావలనుపడదు
గడపదాటియుఁదాకాలుగదుపఁబోదు
తల్లిగీచినగీటును దాటలేక.

సారెచీరలుమాయింటఁ జరుగకున్న
లోటుపాటనితల్లి లోలోనఁగుళ్లు
ముచ్చటచ్చటలల్లారుముద్దుఁదీర్ప
వెఱ్ఱితల్లులుపడుపాట్లు వింతగొలుపు.
ఇంతగలవారలేమానవంతులౌచు
నున్నతారాధ్యపదవుల నున్నవారొ?
రెండురెళ్ళలకాసించి రేపుమాపు
కష్టపడిపొట్టఁబోషించు ఘనులుగలరొ?
కుచ్చెలపొలంబు పదివేలుకుప్పఁబోసి
పసిడిబొమ్మను గలవారిపాలుఁజేసి
పిదపఁజిదుగుదలొందవినఁ బిల్లవాడు
దైవమా! నుయ్యిగొయ్యియో.....
మనసుమంచిది సౌజన్యమార్గగామి
తగినవాఁడనినాతల్లిదండ్రితోడ
విన్నవించుటకేనియు వీలుపడదు
రేబవలుచింతచే నిదురింపఁబోరు.
ముంచుకొనిపోవఁగా మారముళ్లువెట్టి
తిమ్మిబమ్మినిజేయఁగాఁ దెలివిలేదు
వినయుతోఁగాపురముఁజేసి మనెడుగీఁత
కలదొ? లేదొ? దురదృష్టఫలముకతన.

## ఉపాలంభము

శ్రీమతి సామవేదం సీతారామమ్మగారు

స్వామీ! నీవు సస్తమానవమనస్థానుండవైయెనచో
నేమీవీరలు క్రూరకృత్యములతోనే ప్రొద్దుబుచ్చంగ? పో
నీ మేమచ్చటలేమనందువ సరే నీవిశ్వపూర్ణత్వమే
మో మాయమ్మగు నెట్లుజెప్పెదవో యేమో చెప్పు మీవీశ్వరా!
పాపము, పుణ్యమంచును విభాగములంబచరించి, మాకు నా
పాపములేయొనర్పఁ గడుఁబాపపుఁబుద్ధినొసంగి శిక్షణం
బాపయిఁజేతువంట! పరిపాలనకిట్టిదికూడునే? కటా
పాపపుత్రోవకేల మముబంపెదు ముందుగఁ దెల్పుమీశ్వరా!
ధరణి సమస్తజీవుల నుదారతనొక్కటిపోల్కిఁ బ్రేమతో
నరయుగమాకుఁజెప్పి యిటులన్యముఁజేతువె? భక్తకోటికిన్
దరిసెనమిచ్చి వారియనుతాపముఁ దూలగఁజేసి మాకు నీ
గురుతరకష్టబంధములె గూర్చుచునుందువదెట్టులీశ్వరా!
ధనికులు నీసపర్యలవిధమ్మెతలంపరు పేదవారలుం
బనివడిఁబూనుచో ధనమభావముఁగాఁ దుదముట్టఁబోవు ఏ
మని సృజియింతువిట్లు ధనమందినవారలకీక సద్గుణం
బును నిరుపేదకిచ్చి? ఫలముండునెదాన? వచింపుమీశ్వరా!

ఆమె తనప్రార్థనను పూర్తిచెయ్యకముందే సమీపమునుండి ఎవరో సుపరిచితమగు కంఠస్వరముతో "కాంతం! కాంతం!" అని పిలిచినట్లయ్యెను. భయకంపితురాలై కాంతం నలువంకలను కలయచూచినది. అనతిదూరముననే నిర్మలచంద్రకాంతియందొక సుందరస్వరూపమామెకు గోచరించెను. ఆశ్చర్యభరితురాలై కాంతం "ఆఁ—ఏమిటీ! అమ్మాజీయే! ఇంతరాత్రివేళ యీస్మశానానికి యెల్లావొచ్చారమ్మా?" అని ప్రశ్నించింది. అమ్మాజీ కాంతమ్మను లేవదీసి ఆలింగనమొనర్చుకున్నది.

## పదునారవ పుష్పము: పరమేశ్వరలీల

"కాంతం! భగవంతుడు నిజంగా మీయెడల వున్నాడుసుమా! మీరునిర్దోషులని తెలిసినతక్షణమే మాకు సౌఖ్యంలేకుండాపోయింది. నీకోసమని ఎన్నిసార్లు ఏడిచానో నీకు తెలియదు కాంతం! నువ్వూ, జగ్గయ్యా నిత్యము నాదృష్టిలోనే వుండేవారు. మీకోసమని నాన్నగారు చాలాచోట్ల వెతికించేరు. కాని మీజాడ యెక్కడా దొరికిందికాదు. మేము యీప్రాంతాలకివచ్చి మూడురోజులయినది. ఇక్కడికి సమీపములోనే మాకొకతోటవుంది. అందులో మామేడవుంది నువ్వుచూశావో లేదోకాని. గత పదిసంవత్సరాలనుంచీ నాన్నగారు ఈతోటను చూడలేదట. అందుకని ఒకసారిచూడ్డానికి యీప్రయాణం పెట్టుకున్నాం. ఈరోజల్లా ప్రమాదమైనవడగాడ్పు కొడుతూందికదూ. వీధిలోకిరాలేకపోయాం. కాని సాయంకాలమవనిచ్చి ఒక్కసారి షికారుగావద్దామని అమ్మని అడిగియిల్లావొచ్చేను. నాతోకూడా మాతోటగుమాస్తా కుమార్తెవొచ్చింది.

మేం చాలా సంగతులు మాట్లాడుకొంటూ, యీకొండలూ గెడ్డలూ చూసుకుంటూ యీస్మశానందగ్గిరకొచ్చేం. అప్పుడు నాతోవున్న మాగుమాస్తాకూతురు నాతో "అమ్మా! ఇక్కడ ఒకపవిత్రశీలుడగు వృద్ధుని సమాధివుంది చూపిస్తానురండి. అదేమంతగొప్ప భవనంకాదుగాని అతడీప్రాంతాలకువొచ్చిన ఈఅయిదారేళ్లలోనూ మాకందరికీ గౌరవనీయుడైపోయినాడు" అన్నది. మేమిద్దరమూ సమాధిదగ్గిరకి వెళ్లి చూతునుకదా నాఆశ్చర్యమేమి చెప్పను? స్తంభితురాలనైపోయి అలాగే నిలబడిపోయాను. మీపూలసజ్జ ఆసమాధిమీద కనబడింది. ఇంకా దగ్గిరకివెళ్లి చూసేసరికి దానిమీద మీబాబు అల్లిన నాపేరుకూడా కనబడ్డది. దానితో నాసందేహము పూర్తిగా తొలిగిపోయినది. అప్పుడు మాగుమాస్తాకుమార్తెని అడిగి మీభోగట్టాఅంతా తెలుసుకున్నాను. ఆమె తక్షణంనన్ను లింగరాజుగారింటికి తీసుకెళ్లింది. అతడు బహుపెద్దమనిషిసుమా! అతడు కూడా మీసంగతిఅంతా నాకుచెప్పేడు. మీసద్గుణాలనుగురించి అతడు నాతో చాలాదూరంచెప్పేడు. ఆవెంటనే లక్ష్మీవిలాసమునకు వచ్చినిన్నుచూడాలనుకున్నాను. కాని అప్పటికప్పడే పొద్దుపోయింది. రేపు ఉదయాన్నే మాప్రయాణం. ఎలాగైనా నేను కాంతాన్ని ఇప్పుడుచూసితీరాలి లేకపోతే మరిచూడ్డమే పడదు. ఏంచెయ్యమంటారు? అని నేను లింగరాజుగారినిఅడిగాను. అప్పుడాయన నౌఖరునిపిలిచి నిన్నుతీసుకురమ్మని చెప్పేరు. ఆనౌఖరు "ఎందుకూ? ఆముసలాయనకూతురేనా? తండ్రిసమాధిదగ్గిర కూచుని యేడుస్తూవుండగా పావుగంటకిందటే చూశాను. అయ్యో! దుఃఖంచేత ఆఅమ్మాయికి మతిపోయేటట్లుగా కనబడుతోంది" అని చెప్పేడు. ఆమాటవినగానే నేను సమాధిదగ్గిరకి వచ్చేను. ఈసంగతిఅంతా మావాళ్లకుచెప్పమని లింగరాజుగారిని మాతోటలోకి పంపించేను.

వున్న నీకు భయంకరశత్రురాలు సుమా! నిన్ను నాప్రేమకి దూరంచెయ్యడమే దానిముఖ్యోద్దేశం. నీమూలాన్ని నాకుదానిమీదవుండే ప్రేమపోతుందని అది భయపడినది. తనస్థానం సుస్థిరంచేసుకోడానికని

అదిఎంతలేసి ఘోరాలైనా చేసేసింది. ఈవుద్దేశంతోటే అదిలేనిపోని అబద్ధాలుకల్పించి కోర్టులో చెప్పేసింది. కాని చివరకిఅది తీసుకున్నగోతులో అదేపడిపోయింది. దాన్నికోటలోనించితగిలెయ్యడానికి దాని అబద్ధాలే కారణం.నిన్నుకోటలోనుంచి తగిలెయ్యాలని దానిఆలోచన. నీశిక్షవిని అదిసంతోషించింది. ఆఉత్సాహంలో ఈసజ్జనితీసుకొచ్చి నీమీద విసిరికొట్టేసింది. కాని ఈసజ్జయే చివరకి మనలను కలుపుతుందని అప్పుడదిఆనుకోలేదు. మనం దైవాన్నినమ్ముకున్నప్పుడు మన కేఅపాయమూ రాదుసుమా. మనకష్టాలమూలాన్న సౌఖ్యంకూడా వొస్తుందన్నమాట అబద్ధంకాదు. కాని యీసంగతంతా నీకు చెప్పేను గనక నువ్వు ఈరాత్రివేళ యిక్కడ ఏడుస్తూ కూర్చోడానికి కారణంచెప్పుఅని అడిగినది.

కాంతం తనకథనంతను చెప్పినది. అమ్మాజీ ఆశ్చర్యచకితురాలై తనవిచారమును వెలిబుచ్చినది. "నువ్వు దీనదశలోనున్నప్పుడు, సర్వేశ్వరసహాయం కోరుతున్నప్పుడు నిన్ను నేను కలుసుకోవాలని ఆతండ్రి ఆజ్ఞ అయివుంది. నిన్నుయింట్లోనించి తరిమివెయ్యగానే నీకు మహాకష్టంకలుగుతుందేమో అనుకుంది పాపంరంగమ్మ! కాని యేంజరిగింది? నీకు సౌఖ్యంకలిగించడానికి తొందరపడుతూవున్న మాచేతుల్లోకి అప్పజెప్పింది. కాని మనంపోవాలి రా, నాన్నగారూవారూ కనిపెట్టుకునివుంటారు. రేపేమనం ఇక్కడినుంచి కోటకివెళ్లిపోవడం."

జనకునిసమాధి నికనెన్నడునుచూచు భాగ్యముకలుగదు కదాయని కాంతం దుఃఖించినది. అమ్మాజీ బలవంతముపైని యెట్లోఆమె స్మశానభూమినివీడి మెల్లిగనడువసాగినది. అమ్మాజీ కాంతంచెయ్యి పట్టుకుని తనతోతీసుకొని వెళ్లుచు కాంతం! రా! నీతో ఆసజ్జనికూడా తీసుకురా! నీతండ్రి జ్ఞాపకార్థంఅది మనదగ్గిర వుంటుంది. నువ్వుపవిత్రభక్తితో యీసజ్జనువుంచి యీసమాధిని అలంకరించేవు. కాని అంతకంటే స్థిరమైన సమాధిని మేముకట్టిస్తాములే. ఇంక మాకు వుంగరం యెల్లాదొరికిందో వినాలని నీకు తొందరగావుండొచ్చు. రా! వెళుతూ వెళుతూ దారిలోచెబుతాను"అన్నది.

## పదునేడవపుష్పము : ఉంగరము దొరికినకథ

అమ్మాజీచెప్పుట మొదలుపెట్టినది. "గతవేసవిలోజరిగిన సంగతి. ఒకనాటిరాత్రి భయంకరమైన గాలివాన రేగింది. కోటలోవెనక దేవిడీదగ్గిరవున్న పెద్దమర్రిచెట్టు నీకుజ్ఞాపకంవుందా? అది యేనాటినుంచిఅక్కడ వుందో మాముత్తాతలుకూడా యెరగరట! ఆరాత్రితుపాను ఉరవడికామర్రిచెట్టు ఒకవేపుకి పూర్తిగా ఒరిగిపోయినది. అది ఏనిముషాన్ని ఎవరిమీదపడుతుందో అని మాకుభయంవేసింది. అందుచేత ఆచెట్టును నరికెయ్యమని నాన్నగారు ఆజ్ఞాపించేరు. కోటలోని నౌఖరులంతా చెట్టుదగ్గిరవుండి భవనాలకుగాని చుట్టూవున్న యితరచెట్లకుగాని హానిరాకుండా తగినకట్టుబాట్లుచేశారు. మర్రిచెట్టు పడిపోయింది. నేనూ, అమ్మ, నాన్నగారూ–కోటలో ప్రతివాళ్లూ–ఆచెట్టునుచూడ్డానికి అక్కడికి వొచ్చేము. మాతమ్ముళ్లిద్దరూ చెట్టుకొమ్మలమీదికెక్కి అక్కడవున్న కాకిగూడు తియ్యడానికి ప్రయత్నించేరు. చిన్నప్పటినుంచీ ఆగూట్లో యేముందో చూడాలనేకోరిక వాళ్లకివుంది. వాళ్లుమెల్లిగా గూటిదగ్గిరకిచేరేరు. అప్పుడు మాపెద్దతమ్ముడికి గూట్లో యేదో మెరుస్తున్నట్లుగా కనబడింది. "అదేమిటీ? ఆపుల్లలమధ్య అల్లా మెరుస్తూంది చూడు" అన్నాడతడు. "ఏదోవుంగరంలాగుంది!" అన్నాడు చిన్నతమ్ముడు. ఆమాటలు వినగానే వున్న అక్కడికి పరుగెత్తింది. గూట్లోకిచూసీచూడ్డంలోనే వున్న కెవ్వునకేకవేసి "ఉంగరం! ఉంగరం!" అంటూ కొయ్యబొమ్మలాగు నిలబడిపోయింది. ఆమెముఖం వివర్ణమైపోయి భయంకరంగా మారింది. మాతమ్ముళ్లిద్దరూ వుంగరాన్ని పైకితీసుకుని అమ్మదగ్గిరకి తీసుకుపోయారు. ఉంగరరాన్ని చూడగానే, అమ్మ ఆశ్చర్యానికి మేరలేదు. "అయ్యో! జగ్గయ్యా! యెంత ఘోరంచేశాం! ఇప్పుడు వుంగరందొరికిన సంతోషంకంటె జగ్గయ్యా

కాంతమూ ఎక్కడికిపోయారో తెలియకపోవడమే ఎక్కువవిచారం కలిగిస్తూందికదా! వారికి జరిగిన అన్యాయానికి బదులుగా ఈవుంగరాన్నైనా సరే వారికిచ్చెయ్యడానికి వెనకతియ్యను. కాని వుంగరం గూట్లోకి ఎల్లావెళ్లిందా అనేసందేహం నన్నుబాధిస్తూంది" అని అమ్మ అంది.

అప్పుడు మన ఆదినారాయణ అక్కడేవున్నాడు. వీరు నిర్దోషులైనట్లు రుజువైనందుకు అతని సంతోషానికి మితిలేదు. అమ్మ అన్నమాటవిని ఆదినారాయణ "అమ్మా! నేను చెబుతానువినండి. జగ్గయ్యగాని అతనికుమార్తెగాని వుంగ్రరాన్ని అక్కడదాచివుండరన్నమాట స్పష్టమేకదా! అంతయెత్తుకియెక్కి గూట్లో వుంగరందాచేరనడంకంటె అసందర్భంవేరేవుండదు. అదికాక వాళ్లకలాంటి అవకాశమేదీ? పోయిందని తెలిసిన వెంటనే పోలీసులు వాళ్లనిపట్టుకున్నారుకదూ! అది అలాగుండనియ్యండి. ఇహ కాకులున్నాయే మహాఅల్లరి ముండాపక్షులు. ఎక్కడేనా ఏదేనావస్తువు మెరుస్తూకనబడ్డంభయం. నోటితోకరుచుకుపోతాయి. అందుచేత ఒకకాకి ఆవుంగరాన్ని యెత్తుకుపోయి గూట్లోపడేయడమే ముమ్మాటికీ నిశ్చయం. కాని ఒక్కవిషయం మాత్రం నాలోనాకే ఆశ్చర్యంకలిగిస్తూంది. ఏమిటంటారా? ఇన్నిసంవత్సరాలనుంచీ అడవుల్లోపుట్టి పక్షులనీ జంతువులనీ బాగాపరికీలించిన నాకు పక్షులువుంగరాన్ని దొంగిలించి వుండొచ్చునుకదా అన్నఆలోచన ఇంతకు ముందు కలగకపోవడమే నాకు వింతగావుంది. కాని నామిత్రుడు జగ్గయ్యాయును,అతనికుమార్తెయును ఈకఠిన పరీక్షకి నిలవాలని ఆజగద్రక్షకుని ఆజ్ఞ కాబోలు?" అని చెప్పేడు.

అప్పుడు మాఅమ్మ ఆదినారాయణతో "అవునోయ్! నువ్వుచెప్పింది నాకు బాగా నచ్చిందినుమా! కిటికీలోనించి కాకులుతరుచు నాగదిలోకి వొస్తూనేవుంటాయి. ఆవేళ నేను వుంగరంవుంచిన బల్లకిటికీదగ్గిరే వున్నట్లు నాకుబాగాజ్ఞాపకమే. కాకులేవుంగరాన్ని ఎత్తుకుపోయాయని చెప్పడంలో నాకేసందేహమూలేదు. మనమెవ్వరమూ కాకులు ఎత్తుకుపోతూన్నప్పుడు చూడకపోవడంచేత ఇంతకర్మంకలిగింది."అన్నది.

మానాన్నగారు మీకు జరిగిన అన్యాయానికి ఎంతో విచారించేరు. కాంతం! ఆయన అన్నమాటలు నీకు చెబతానువిను. "పాపం! ఆఅమాయకులకంత బాధకలిగినందుకు నామనస్సు చాలా కటకటలాడుతూంది. వాళ్లెక్కడున్నారో కనుక్కొని తగినంతఉపకారం చేసేవరకూ నాకు నిద్రపట్టదు."

"వున్న అక్కడే నిలుచునివుంది. దానిమనస్సు మహావేదనపడుతున్నట్లు స్పష్టమవుతూంది. దాన్ని చూసేసరికి మానాన్నకి ఒళ్లుమండుకుపోయింది. "ఛీ! పరమదుర్మార్గురాలా! మాదగ్గిరబతుకుతూ అబద్ధమాడడానికి నీనోరెల్లావచ్చింది? నీమూలాన్నేకదా ఆఅమాయకులన్ని బాధలుపడవలసి వచ్చింది?"అంటూ చెట్టును చూడ్డానికివచ్చి అక్కడేవున్న నౌఖర్లనుచూసి "దీన్నితీసుకుపోయి పోలీసువాళ్లకి అప్పచెప్పండి. దీని ఆస్తి అంతా కోటలో జాగ్రత్తపెట్టండి."అని ఆజ్ఞాపించేరు.

కాంతం! నాన్నగారి కోపంచూసి అక్కడివారంతా హడిలిపోయారు. ఎవ్వరుగాని మాట్లాడ్డానికి సాహసించలేదు. అంతకు పూర్వమెన్నడును నాన్నగారు అంతకోపంతోవుండగా యెవ్వరూచూడలేదు. చివరకాయన కోటలోకిపోనిచ్చి అంతా యెవరిఅభిప్రాయాలు వాళ్లుచెప్పడం ప్రారంభించేరు.

ధర్మవరంపురంతా వుంగరంసంగతి వ్యాపించిపోయినది. ప్రతివాడును నిజానిజాలు కనుక్కోవాలని కోటలోకివొచ్చేరు. నిముషంలోనే ఆస్థలమంతా జనంతోనిండిపోయింది. అందరితోపాటు నిన్నువిచారించి శిక్షించిన న్యాయాధిపతికూడా వొచ్చేడు.

ఈవృత్తాంతమంతావిని అతడుపొందిన మనోవేదన యింతని చెప్పడానికి నాతరంకాదు కాంతం! నేరస్థులయెడల కఠినుడే అయినప్పటికీ గ్రామంలో అంత పెద్దమనిషీ, మర్యాదస్తుడూ లేడనినమ్మ. బహు

నిజాయితీమనిషి అని గ్రామస్థులంతా అతన్నిగురించి చెప్పుకుంటారు. అతని విచారంచూసి అక్కడున్నవా రందరి గుండెలూ నీరైపోయాయి.

అప్పుడతడు "ఎంతఘోరం! ఎంతఘోరం! నిరపరాధులనుశిక్షించడంకంటే భయంకరపాపం వేరేలేదు" అని చుట్టూవున్న ప్రజలనుచూస్తూ నిశ్చలగంభీరస్వరములో "నేనూ మానవుడినేకదా! ఏతప్పూచెయ్యని న్యాయాధిపతి ఒక్కభగవంతుడే. ఇంతవరకూ వుంగరం యెక్కడవుందో ఆయనకే తెలిసివుండెను. హ్రస్వ దృష్టికలమానవులు ధర్మమార్గాన్నే సరియైనవిచారణ చెయ్యలేరు. వారు పొరపాటుపడ్డానికి చాలా అవకాశా లుంటాయి. దురదృష్టవశాత్తు లోకంలో సాధారణంగా సాధువర్తనులకే ఆపదలువొస్తాయి. కాని సర్వేశ్వ రుడు శిష్టులనురక్షించి తీరుతాడు. ఈకేసులో నిజానిజాలు బయలుపెట్టడాని కాసర్వేశ్వరయిచ్ఛానుసారం యెన్ని విచిత్రసంఘటనలు జరిగాయోచూడండి. తుపానురావడమూ, చెట్టువొరిగిపోవడమూ, సమయానికి రాజుకుటుంబమంతా అక్కడేవుండడమూ అన్నీచిత్రంగా జరిగిపోయాయి. అన్నిటికంటే చిత్రమేమంటే వుంగరం అమాయకులైన పిల్లలకు కనబడడమే. పెద్దవాళ్లెవరికైనా కనబడితే తత్క్షణం దాచేసివుందురేమో? వుంగరంచూడగానే భయభ్రాంతురాలై పెద్దకేకవేసి అబద్ధపుసాక్ష్యంచెప్పినపున్న 'కాంతం నిర్దోషినుమండీ' అని చెప్పకుండానే చెప్పేసింది."

న్యాయాధిపతిమాటలూ, అతడు వెలిబుచ్చిన విషాదమూ అందరి మనస్సులలోనూ నాటిపోయాయి. ప్రతివాడూ బహుశ్రద్ధాభక్తులతో అతడుచెబుతూవున్నమాటలువింటూ నిలుచున్నాడు. ఆయనచెప్పడం పూర్తి కాగానే ఆమాటలు మననంచేసుకుంటూ అంతాయిళ్లకిపోయారు. ఈమోస్తరుగా మీనిర్దోషిత్వము బయలు పడింది! కాంతం! ఏమిటాలోచిస్తున్నావు?

ఇట్లు మాట్లాడుకొనుచుండగనే వారు జమీందారు సౌధమును సమీపించిరి. —కొదువ.

## లోకంబుజోలెందుకే?

అధికార్ల సూర్యనారాయణరావుగారు

అసమానవనీతమై
కుసుమసుకుమారమై
మిసిమించు నీమేని
పసజూచుకన్నులకు
పసినిమ్మ పండెందుకే?
జానకీ! పసినిమ్మపండెందుకే?

అందంపువలపు తి
య్యందనంబులనూరు
సుందరాననమున్న
వందురుచునుండునా
చందురుని మోమెందుకే?
జానకీ! చందురుని మోమెందుకే?

ప్రేమప్రగాఢమౌ
మోహమునించుకవాంచి
కామితమ్ములగూర్చు
కోమలస్వనమెత్త
కోయిలల గోలెందుకే?
జానకీ! కోయిలలగోలెందుకే?

శ్రీకరంబుగప్రణయ
రేఖకల్గాగాను
వాకవలె నీయొడల్
సోకిచిత్తముపోల
లోకంబుజోలెందుకే?
జానకీ! లోకంబుజోలెందుకే?

# బాలవిజ్ఞానశాఖ

౧. పదము

## తొక్కుపల్కులు

శ్రీమతి మొగసాటి అప్పలనరసమ్మగారు

కోకమ్మకోక—
ఏంకోక?
పెళ్లికోక—
ఏంపెళ్లి?
పిల్లపెళ్లి—
ఏంపిల్ల?
చిలిపిపిల్ల—
ఏంచిలిపి?
చెయ్యిచిలిపి—
ఏంచెయ్యి?
పిసినిచెయ్యి—
ఏంపిసిని?
డబ్బుపిసిని—
ఏండబ్బు?

రాగిడబ్బు—
ఏంరాగి?
పెళుసురాగి—
ఏంపెళుసు?
కొమ్మపెళుసు—
ఏంకొమ్మ?
పట్టుకొమ్మ—
ఏంపట్టు?
నారపట్టు—
ఏంనార?
గోగునార—
ఏంగోగు?
బాగోగు—
ఏంబాగు?

పనిబాగు—
ఏంపని?
మట్టిపని—
ఏంమట్టి?
పాటిమట్టి—
ఏంపాటి?
పరిపాటి—
ఏంపరి?
తెంపరి—
ఏంతెంప?
పాము తెంప—
ఏంపాము?
కందేపాము—

౨

శ్రీమతి జి. గోపీబాయిగారు

పీటమ్మపీట—
ఏమిపీట?
చెక్కపీట—
ఏమిచెక్క?
గంధపుచెక్క—
ఏమిగంధం?
వాసనగంధం—
ఏమివాసన?

అత్తరువాసన—
ఏమిఅత్తరు?
గులాబిఅత్తరు—
ఏమిగులాబి?
తెల్లగులాబి—
ఏమితెల్ల?
చీరతెల్ల—
ఏమిచీర?

రంగుచీర—
ఏమిరంగు?
పచ్చరంగు—
ఏమిపచ్చ?
పసుపుపచ్చ—
ఏమిపసుపు?
మంచిపసుపు—
ఏమిమంచి?

గడమంచి—
ఏమిగడ?
వెదురుగడ—
ఏమివెదురు?
పెద్దవెదురు—
ఏమిపెద్ద?

దండపెద్ద—
ఏమిదండ?
పూసలదండ—
ఏమిపూసలు?
రంగుపూసలు—
ఏమిరంగు?

మాయరంగు—
ఏమిమాయ?
కలిమాయ—
ఏమికలి?
ఆకలి—

౨. పాటలు

## రాటపుపాటలు

శ్రీమతి కల్నటపు రుక్మిణమ్మగారు

౧

ఏకులరాటమ్మ కాళ్లసంకెళ్లు
కలవారిఅల్లుడికి కాళ్లసంకెళ్లు
ఏకేకుఒకబార ఎల్లుండిసంత
నాఏకు లై పోయినాయి నాకేమిచింత.

౨

ఏకులోడకలేను ఓఅత్తగారు!
ఎల్లంచుచీర నేకట్టుతాను

రాటమొడకలేను ఓఅత్తగారు!
రాణించుచీర నేకట్టుతాను.

౩

రాటముఒడకరమ్మ! ఓఅమ్మలార!
గాంధీకిజయమనుచు దారముతీయరే
ఏకులరాటమ్మ ఇంటికందమ్మ
మహాత్మాగాంధి ప్రజలకందమ్మ.

## కృష్ణగొల్లభామసంవాదం

యస్. వి. రత్నంశెట్టిగారు

గొల్లవారీ వాడలాకూ కృష్ణమూర్తి!
నీవు ఏమిపనులకు వచ్చినావు? కృష్ణమూర్తి!
పాలుకొనా వచ్చినానే గొల్లభామ!
మంచిపాలు పోసిపంపూ గొల్లభామ!
కొత్తకోడలయ్య! నేను కృష్ణమూర్తి!

మాయత్తగారి నడుగవయ్య! కృష్ణమూర్తి!
కొత్తకోడలాతెనేమె గొల్లభామ!
నారొక్కమిచ్చి పుచ్చుకొంటే గొల్లభామ!
నీ రొక్కము మాకొద్దయ్య కృష్ణమూర్తి!
నీవు రొంపుచేయక పోవయ్య కృష్ణమూర్తి!

## జోలపాట

శ్రీమతి పురాణం జ్ఞానమ్మగారు

ఏవూరికేవూరు యేనుగులబాటా
రాయదుర్గముకోట రాజులకుబాటా
సుల్తానుగోల్కొండ తురకలకుబాటా
అందమైనతిరుపతీ అందరికిబాటా.
ఆడబిడ్డలకనరాదు అవిధిపడరాదు

దూరానయివ్వరాదు దుఃఖపడరాదు.
ఆడబిడ్డలకన్నమ్మ నీళ్లకుపోతే
ఆడికలుమెండాయె అభావికడనూ.
మొగబిడ్డలకన్నమ్మ నీళ్లకుపోతే
మోదుగలుతంగేళ్లు పూచినట్లుండే.

శ్రీవెంకటప్పయ్య! దిక్కునీవయ్యా!
నరశింహా! శరణయ్య నాతాతవయ్య!
నావారినిరక్షింప నీభారమయ్యా!
నీకుసేవలుచేయు నాభారమయ్యా!
మాచిన్నబిడ్డలు మీదాసులయ్యా!
దాసులకునూరేండ్లు దయచేయవయ్యా!
కృష్ణకృష్ణాక్షయము కృష్ణాక్షయమ్మా
సర్వపాపక్షయము స్వామిదర్శనమూ.
కూటకూటమురచ్చ కూటములోరచ్చా
కూటములో మావదినకూతుళ్లరచ్చా
అంగడింగడిరచ్చ అంగట్లోరచ్చా
అంగట్లోమాఅన్న అల్లుండ్లరచ్చా.
కూటములోమావదిన యేమేమికోరూ
కుంభామభరిణాల కూతుళ్లకోరూ
మేడమీదమాఅన్న యేమేమికోరూ
అంచుధోవతులనూ అల్లుండ్లకోరూ.
ముద్దువచ్చానమ్మ అబ్బాయిముఖమూ
అద్దమైతోచునే వద్దిమామలకూ.
పొగడంపుశాలలో అబ్బాయిఆడా
పనసపండని అత్త యెత్తిముద్దాడూ.
పట్టుదట్టీకట్టి తిలకంబుపెట్టీ
పారాడుఅబ్బాయి పరుగుచూతాము.
పారాడెఅబ్బాయి పరుగుల్లుచూచి
పొగడమై తోచెనే అబ్బి అక్కలకూ.
అందెల్లుమువ్వల్లు అమరంగబెడదూ
ఆట్లాడుఅబ్బాయి ఆటచూతామూ.
ఆటలాడి నీవు అలిసివున్నావూ
వెండిగిన్నెలో నీకు బువ్వపెట్టేనూ
పమిడిగిన్నెలో నీకు పాలుయిచ్చేనూ
వుయ్యాలలో నిన్ను నిద్రవూచేనూ
జోలల్లుపాడెదను రార శ్రీకృష్ణా!

జోకొట్టెదనుస్వామి! పవళించవయ్య!
గోవింద! గొల్లపల్లెకు పోకవయ్యా
గోపికలునిన్నొచ్చి కొట్టేరుస్వామి!
రేపల్లెవాడలో గోపాలకృష్ణా!
ఆపదొచ్చినవేళ కాపాడుస్వామీ!
నీళ్లకావిళ్లు మాకెదురాయెనమ్మా
నీలవర్ణుడు మాకు తోడాయెనమ్మా
పాలకావిళ్లుమాకెదురాయెనమ్మా
బాలకృష్ణుడు మాకుతోడాయెనమ్మా.
శ్రీరామరఘురామ అన్నవారికి
చింతలన్నీబాసి సంతోషమానూ
నారాయణ! నారాయణ! అన్నవారికి
నానాటిపాపములు నాశమైపోవూ
గోవింద! గోవింద! అన్నవారికి
గోవిందుడిచ్చునే కోరుసంపదలూ.
ఒక్కడేగుళ్లోను వారిగివున్నాడూ
ఓచెలియచూతాము వోరుగుపెరుమాళ్ల
ఒక్కడేకొడుకనీ ఒగియకవెతల్లీ!
ఒక్కడేభూమేలు జగమేలుకాదా?
భూమికిపుత్రుడూ ఒక్కడేకాదా?
జగతికిచంద్రుడూ ఒక్కడేకాదా?
కౌసల్యకును రాముడొక్కడేకాదా?
కైకకు భరతుడూ ఒక్కడేకాదా?
పోలేరుతల్లి! మాపొత్తిళ్లుకాయీ
పొత్తిళ్లనాడేటి బాలూలకాయీ
పోలేరుతల్లికి పొలిమెండలనీ
పందిళ్లువేయించె తానుఅబ్బాయి.
అక్క! పోదామురావె అంకమ్మగుడికి
అంకమ్మగుడిచుట్టు సంపంగివనమూ,
సంపంగివనములో యేమివున్నాదీ?
సంపంగివనములో దేవుడున్నాడు.

దేవుడిపేరేమి? దేవిపేరేమి?
దేవుడుకాళా స్తీశుడు దేవిజ్ఞానాంబ.

## జోలపాట

చిలుకలాడేనమ్మ హంసలాడేనూ
పావురాళ్లాడేను పందిళ్లలోనూ
చిన్నమాఅబ్బాయి ఆడుకోబోతే
కంసాలికట్టెను కాళ్ల గజ్జెలను.
చిన్నమెత్తుపులిగోరు చిటిమావిరేకా
చిన్నమాఅబ్బాయి కెవరంపిరమ్మా
మాడెత్తుపులిగోరు మరిమద్దికాయా
మగువమాఅబ్బాయికి మామలంపేరు.
చక్కన్నివాడమ్మ సారంగధరుడు
చిక్కపడిచిత్రాంగి మేడనున్నాడు
మారుతల్లీచేత మాటపడననుచూ
చావునక్కవగదెంచె సారంగధరుడూ.
తూర్పునఒకమామ చూడావునంపె
పడమటనఒకమామ పాడావునంపె
ఆయావునీయావు నమరంగగట్టి
పితకరాపిన్నన్న బిందెల్లలోనూ
కాగబొయ్యె వదిన కాగుల్లనిండ
త్రాగరాఅబ్బాయి నీబొజ్జనిండ.
చిన్నారిపొన్నారి గాజుల్లసెట్టి
తేరమాఅబ్బాయికి తేనెగాజుల్లూ.
చిన్నారిఉయ్యాల చిలకల్లపందిరీ
శ్రీలక్ష్మిఊచు మాఅబ్బిఉయ్యాల
మాడల్లఉయ్యాల మంచిఉయ్యాల
మహాలక్ష్మిఊచు మాఅబ్బిఉయ్యాల.
ఆకాశబాణములు చంద్రదీపికలు
ఆమెరామునిపెండ్లి అయోధ్యలోనూ
నిండుపౌర్ణమినాడు తొలిచందమామ
ముత్యాలపట్టుచీర మొగ్గలరవికా
ముత్తైద నినుచూడ ముచ్చటేనాకూ.

శ్రీమతి పాకలరత్నమాలగారు

నినుజూడవచ్చెను నీమేనమామ.
కొండపల్లీచిల్క కోదూరిహంస
హేలాపురీచిల్క ఏకాంతమామ.
రావెరావేపిట్ట రత్నాలపిట్ట
కర్రతేవేపిట్ట కనకాన్నికొట్ట
కనకాన్నికొట్టన్ను కర్రల్లులేవూ
నెల్లూరుపోదాము మల్లెమువ్వలకు.
చిన్నమాఅబ్బాయి చిల్కంటివాడు
పండ్లదానిగంప పడగొట్టినాడు
కొట్టబోకోయమ్మి తిట్టబోకమ్మి
పాపమాఅబ్బాయి పడగొట్టినాడు.
వట్టివేర్లుపెట్టినా పెట్టిచల్లన్న
వాడలోమీతండ్రి వార్తచల్లన్న.
గంధమ్ముతీసిన సానచల్లన్న
గౌరిదేవిమీతల్లి కడుపుచల్లన్న
శ్రీరాములై పుట్టి వారధీగట్టే
శ్రీరామముద్రిక అందుకోసీతా!
శ్రీరామ! జయరామ! శృంగారరామా!
కారుణ్యగుణధామ! కళ్యాణరామా!
నిద్రబోనాతండ్రి నిద్రబోతండ్రి
భద్రకన్యకలొచ్చి నిన్ను లేపేరు
చిన్నారిపక్షువకు చిలుకపక్షువకు
మాయమ్మపక్షువకు మామలొచ్చేరు.
చిన్నవాడారార చంద్రుడారారా
బాలకృష్ణారార బంతందుకోరా?
హాయిహాయిహాయి ఆపదలుగాయి
చిన్నవారినిగాయి శ్రీశేషశాయి!



కీ. శే.
తల్లావఝ్ఝుల వరధనీ దేవిగారు

*

* *

సాహితీసమితి సభాపతులు, మధురకవితావిలసితులు, తెలుగువారి **Leigh Hunt** లు అయిన శ్రీయుత తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రిగారిసతి. వరధనీదేవిగారు సంస్కృతాంధ్రములందు చక్కని అభినివేశముకలిగి వఱలినది. సాధ్వి.

* *

*

*

* *

సీతారామమ్మగారు విదుషి, కవయిత్రి. 'అర్చక' పత్రికాధిపతులగు శ్రీయుత వేదాన్తం శ్రీనివాసాచార్యులుగారి ధర్మపత్ని. పత్రికానిర్వాహణమున ఈవిద్యావతి పతికి తోడుపడుచుండునది. ఇరువదిరెండుసంవత్సరములైన నిండని ఈవిజ్ఞానవతి 23-8-1931-వ తేదీని ఇహలోకమునుబాసినది. ఈమె తనజీవితకాలమున 'నీతిరామాయణము' అను చిన్నిపుస్తకమొకటి రచియించెను. ఇది ఈమె వైదుష్యమునకును, యోగ్యతకును తార్కాణముగనుండగలదు.

* *

*



కీ. శే.
వేదాన్తం సీతారామమ్మగారు

## కోకిలవలెకూయు అలారముగడియారము

అలారము గడియారములయుపయోగము అనంతమైనదేకాని దానివలన కొన్ని ఇబ్బందులునుగలవు. ప్రశాంతప్రభాతసమయమున పడకగదిలోని అలారము గడియారముమ్రోత చిరాకుపుట్టించునదిగానుండును. అట్టిసమయములయందు ప్రజలు ఈఅల్లారముగడియారములు సృష్టింపకయేయుండిన నెంతబాగుండును అని అనుకొందురు. ఈఅలారముగడియారములు-వానివలని ఉపయోగమెట్టిదైనను-బహిష్కరింపదగునవస్తువుగా భావింతురు. అలారముగడియారములవలన గలుగు ఈఇబ్బందిని తొలగించుటకు గడియారములనుచేయుటలో ప్రపంచప్రఖ్యాతిగాంచిన జర్మనీయందలి కార్ల్ జోసెఫ్ డోల్టు అండ్ సన్సువారు చిరకాలముగ ప్రయత్నించుచున్నారు. వారిప్రయత్నములు నేటికి సఫలమైనవి. వారొకక్రొత్తపద్ధతిగడియారమును తయారుచేసినారు.




దీనికి వారు 'కోకిలగడియారము'ని పేరిడినారు. మామూలు అలారముగడియారములుచేయు భరింపరాని కర్ణకఠోరమగుధ్వనిని ఇదిచేయదు. కోకిలవలెకూయును. ఆఅవ్యక్తమధురధ్వని అలారమిచ్చుటకుతోడు ఆనందమునుగలిగించును. కొన్నిమాసములందుమాత్రమేలభించు కోకిలగీతము ఇక ప్రతిదినమువినంగనుకలుగును. ఆకోకిలగీతము మేలుకొలుపు. ఉపయోగము, అందము, ఆనందము ఈగడియారమువలన సమకూడును.

*—From The "Export-Market," Poessneck, (Germany)*

3. వ్యాకరణశాస్త్రకథలు

# అక్షరాభ్యాసము

శ్రీమతి శ్రీపాద శారదాదేవిగారు

ఆంధ్రదేశములో కౌశికనదియొడ్డున వ్యాకరణద్వీపమనెడి బ్రాహ్మణాగ్రహారంబొండుకలదు. ఆ గ్రామమందున్న సుప్రసిద్ధబ్రాహ్మణకుటుంబములవారందరు మూడింటి పేర్లుమాత్రము గలవారయియున్నారు. అచ్చులపాటివారు, హల్లులపాటివారు, ఉభయాలవారు. పూర్వాచారమననుసరించి ఆగ్రామమునందుండువారి పరస్పరస్నేహబాంధవ్యములు గ్రామముదాటి బయటికి నెప్పుడునుబోయినదిలేదు. అందులో ముఖ్యముగా అచ్చులపాటివారిసహాయములేనిచో హల్లులపాటివారి లెక్కచేయుండదు. అనగా వారిపలుకుబడియే చచ్చిపోవుననుమాట. కాని యుభయాలవారు మిక్కిలి అదృష్టవంతులు. వీరు యుభయులకును గావలసినవారే. వీరులేనిదే యెవరికిని బని పూర్తిగనెల్లదు. ఇంతకు వీరికేమైన స్వతంత్రముగాఁ దమపని వెళ్లదీసుకొను తెలివితేట లేమైనగలవాయన్న నదిసున్న. ఒకనాఁడాగ్రామములో నొకకుటుంబి స్వగృహములో దమకుఱ్ఱవానికి అక్షరాభ్యాసకర్మ నడిపించెను. ఆయజమాని చదువులయ్యను ఊరిలోని పెద్దమనుష్యులనుబిలిచి తగినమర్యాదలుజరిపెను. ఎవరికిముట్టవలసిన బహుమతులు వారికిముట్టినవి. ఆశీర్వచనపనసలు బ్రాహ్మణోత్తములు జెప్పిరి. గృహయజమాని సదస్యులకుఁ జేతులుజోడించి "దయచేసి మీరందరును, బెందలకడనే భోజనమునకురావలసిన"దని ప్రార్థించెను. కొంతసేపటికి అందరును మడికట్టుకొనివచ్చి విస్తరులముందర పంక్తులుదీర్చి కూర్చుండిరి. వడ్డనలు ప్రారంభమయ్యెను. రావలసినవారందఱువచ్చిరి. గృహస్థు సంకల్పముచెప్పి నీళ్లువిడిచెను. "సీతాకాంతస్మరణకి జైజైరామ్" అనుకేకలతో భోజనారంభమైనది. వడ్డించువారు మారువడ్డనకలువుకొనుచు వచ్చుచు ఇంతలో వేడిపులుసువడ్డించుటకు ఆగ్రామములోని చదువులవంతులగారు పూనుకొనిరి. సాధారణముగా నెవరిఇంటిలో నేకార్యమువచ్చినను దాను ముందుగా నడుముకట్టుటయేకాక వడ్డనలో నతికష్టమైన పనియగు పులుసువడ్డన ఆయనతప్ప మరెవ్వరును దీసుకొనసాహసింపరు. ఇక నేమిచెప్ప నానాఁడుజరిగిన చిత్రము? పాపము చదువులయ్య పులుసువడ్డించుచు "వేడి వేడి!" యని యెంతో మొఱబెట్టుకొనినను, మాటల ధోరణిలోవినక, ప్రక్కనున్న ఆగంతుకబ్రాహ్మణుండొకఁడు తుయ్యాని తుమ్మినందున-ఒకబ్రాహ్మణుఁడు సరిగా పులుసువడ్డించుసమయమునఁ దనచేతిని దీయకపోయినాడు. వేడిపులుసు చేతిపైపడగానే కోపము రాను, గొన్నిపరుషములు—కొన్నివషట్కారములు ఆవంతులపైన కురిపించెను. ప్రక్కనున్నవారు కొంతమంది సరళముగా సముదాయించినారు. కాని హల్లులపాటివారిపంక్తిలో వీరికిని వారికిని మధ్యనున్నవారు చాల నొత్తిడికలిగించి పెద్దయలజడిచేయుటవలన నొకరిమాట లొకరికివినఁబడక వాగ్వాద మంతకంతకు హెచ్చిపోయెను. బలాబలములుచూచుకొన మొదలిడిరి. అచ్చులపాటివారిలో బదునాలుగురును హల్లులపాటివారిలో ముప్పదియేడుగురును మధ్యస్థులైన ఉభయాలవారిలో ముగ్గురును నుండ సంభవించినది. సరిగాలెక్కపెట్టలేదనువాదముకూడ లేకపోలేదు. భోజనమైనతరువాత నడివీధిలో దెబ్బలాటజరుగునట్లు వారందరు ఏర్పాటుచేసుకొనిరి. జగడమునకు ఆయాపక్షములవారు ఈక్రిందివిధముగ యత్నములను చురుకుగజరుపుగొన మొదలిడిరి. అచ్చులపాటివారిలో దీర్ఘముగానున్నవారు తొమ్మండుగురును, పొట్టివారేడ్గురునుగలిసి యుద్ధసమయమువందు, ఒక్కొక్క పొట్టివానివెనుక ఒక్కొక్క పొడుగువాఁడుండి పోట్లాడవలయునని తీర్మానించుకొనిరి. హల్లులపాటివారిలో మొదటికొంతమంది అయిదయిదువర్గములుగా విభజించుకొనిరి. వారికి వరుసగా క, చ, ట, త, ప, యని నామకరణమొనర్చుకొనిరి. అటుతరువాత నలుగురు అంతస్థులుగానుండి తమపక్షము వారికిఁగావలసిన యుద్ధపరికరములును సరపరాచేయునట్లు నిర్ణయించుకొనిరి. 'ఉషి' కల్పించుచు హెచ్చ

రించుటకు మరినల్గురును, దెబ్బతిన్నవారినిఁదీసికొనిపోవ బండినొకదానిని సిద్ధముగానుంచుటకొకరును మంచి నీళ్ళచెంబుపుచ్చుకొని సిద్ధముగానుంచుటకొకరును ప్రత్యేకింపబడిరి. పైవర్గములవారిలోఁ గడపటి అయిదుగురు దొమ్మిసందడిలోఁ దమతమ శత్రువులను వెక్కిరించుటకుఁగాబోలు ముక్కుతో నొకవిచిత్రమైనధ్వనినిఁ జేయుచుండిరి. మరియిద్దరుమాత్రము దంతములతోను దవడలతోను జప్పుడుచేయసాగిరి. ఇక మధ్యస్థులైన వారగు ఉభయాలవారు, వీరిలోను వారిలోనుగూడఁ గలిసియుండి జగడము ధర్మవిరుద్ధముగా జరుగకుండు లాగున జూచుచుండిరి. ఇట్లాయుభయులకు జగడమారంభమై పోరు ఘోరముగాజరిగినందున యుభయపక్ష ములవారికిని గాయములు దట్టముగాదగిలినవి. హల్లులపాటివారిలోఁ గొందరికిఁ దలకట్లూడిపోయినవి. చివరకు వారిలోవారికే రాజీకుదిరినది. మధ్యస్థులైన యుభయాలవారు పంచాయితికి 'అక్షయ్య' సిద్ధాంతిగారిని మంచి దినముచూచి మూహూర్తముపెట్టమనిరి. తుదకు వారు వివాదపరిష్కార విధ్యక్రిందిరీతిని స్థిరపరచుకొనిరి. పోరుబాటున పంతులు పులిసను చేతిమీదపడ్డించినాడని ఒప్పుకొనినను హల్లులపాటివారిలో నొకబ్రాహ్మణుండు అట్లు పరుషములుబలికి వివాదమునకు గారకుడైనందున హల్లులపాటివారు అచ్చులపాటివారి నిక ముందుఁ దమయింట నేకార్యమువచ్చినను దలధరించి గౌరవింపవలెను. ఇందునకుబదులుగా అచ్చులపాటివారు హల్లులపాటివారి పలుకుబడికేవిధమైన భంగపాటును గలుగకుండులాగునఁ బ్రవర్తింపవలయును. కాని యచ్చుల పాటివారుమాత్రము తాము స్వయముగ హల్లులపాటివారిసహాయార్థము వారియొద్ద కేగమనియును, దమకుఁ బదులుగాఁ దమ ప్రతినిధులను బంపుచుందుమనియును, దమ ప్రతినిధులకు దమకును నేవిధమైన వ్యత్యాసము లేదనియును వారొనర్చుపనులకెల్లఁ దామే బాధ్యులమగుదుమనియును వ్రాతపూర్వకముగా దెలియఁజేసిరి. ఇట్టిరాజీనామా యుభయులకును సమ్మతమైనదగుటచేత వారిరువురకును గపాలసంధి యేర్పడెను.

ర. కథలు

## మేకపోతు గాంభీర్యము

శ్రీమతి యన్. వి. సరళాదేవిగారు

అనగనగా ఒకఊరు. ఆగ్రామంలో ఒకగొల్లవాడు ఉండేవాడు. వానికి ఒకగొఱ్ఱెల మంద. ఆమందలో రెండుమేకపోతులుండేవి. దానిలో ఒకదానిగడ్డము మూరెడు. మరొక దానిగడ్డము బారెడు. ఆఊరికిసమీపంలోనున్న గుట్టలమీదికి ఒకనాడాగొల్లవాడు తన మందను మేతకుతోలుకొనివెళ్లేడు. మందంతా పచ్చని గరికపఱకలుకొఱుకుతూ తృప్తిపడుతున్నది. పెద్దమేకపోతు ఈయాకూఆయాకూ కొఱుకుతూ మందకుదూరంగా వెళ్లిపోయింది. అక్కడ ఒకచిన్నగుట్ట. దానిపైన తిప్పతీగ అల్లిబిల్లిగాఅల్లుకొని పందిరిగా ఏర్పడ్డది. ఆగుట్టగుహలో ఒకసింహండున్నది. నవనవలాడుతూన్న ఆతీగపొదనుచూచి మేకపోతు నోరూరి అందినయాకులుమేస్తూ పైకెక్కింది. ఎక్కటమెక్కటంతోనే దాని నాలుగు కాళ్లూ ఆతీగపొదలో ఇరుకుకొని పోయినవి. తీసుకోపోతే వచ్చేయికావు. అందినయాకులు తింటూ కళ్లుమూసుకొంటూ తెరుస్తూ పర్ణభక్షకుడైన మునిలాగా ఆమేకపోతు అల్లాగే ఉంది. ఈలోగా సింహము గుహబయటకు వచ్చింది. ఈక్రొత్తఆకారాన్ని, నిడుపాటి గడ్డాన్ని చూసింది. దాని జూలు తనకంటె ఎక్కువగాఉండటంవల్ల నిజంగా మృగరాజు భయపడ్డది. గుండెసర్దుకొని సింహం 'ఎవరునీవు?'అని గర్జించింది. మేకపోతు తడుముకోకుండా

అహం మేకా శతంవ్యాఘ్రం కుంజరాణాం సహస్రకం
ఏకంసింహం హనిష్యామి గెడ్డంపపపశుచలే.

అని నిర్భయంగా అంది.

(తమాషాశ్లోకము ఇది. కాబట్టి తప్పులతడక గానుంది. దీనియర్థం—నేను మేకను. ఇదివరలో నూరు పులుల్ని చంపేను. వెయ్యిఏనుగులను చంపేను. ఒకసింహాన్ని చంపవలసిఉంది. ఇదిఒక్కటే తరవాయి. నీవు కొరికావు. నిన్ను చంపగ్గానే నాశపథం తీరిపోతుంది. నాగెడ్డం గొరిగించుకుంటాను. అని)

ఈబడాయిమాటలువిని దిగులుపుట్టి సింహము ఉడాయించినది. తిరిగిచూడలేదు. దానికి ఒకనక్క ఎదురుపడ్డది. నక్క దీనికథంతా ఊహించి పకపకానవ్వుతూ "ఏంబావ గారూ? పలాయనమంత్రం పఠిస్తున్నారెందుకు? అది మేకపోతు. దానిగెడ్డంపనేగాని మరేం లేదు. మీరెందుకు భయపడటం? నేనుకూడావస్తా. పదండి"అని అందికాని సింహానికి ధైర్యం చిక్కలేదు. చిట్టచివరికి నక్క"అంతభయమైతే నీకాలికి నామెడకూ కట్టుకొనిరా నీప్రాణానికి నాప్రాణం ఒడ్డుతాను. చియ్యబట్టిన ఆపోతును చంపేవా అంటే చెరిసగం తినవచ్చు" అని చెప్పి తీసుకెళ్లింది. గుండెదడతోటే సింహం సాగింది. మెల్లిగా గుట్టదగ్గరకు వస్తున్నాయి ఈరెండూ. వీటిని దూరంగాచూచేను ఆమేకపోతుమహర్షి. గట్టిచిక్కేవచ్చిందే అను కున్నాడు. అవళంగా దానికొకయుక్తితోచింది. "నక్కబావా! ఎంతమంచివాడవు సింహాన్ని పట్టుకొని నీదగ్గరకుతీసుకువస్తే సరికదా అన్న నీమాట చెల్లించుకొన్నావు. నమ్మకపోతే చూడు నామెడకుకట్టివేసుకునైనా తీసుకొస్తానన్నావు. ఎంత విశ్వాసవంతుడవోయి!"అని నక్కను శ్లాఘించింది. ఈమేకపోతుమాటలు సింహంవిని నక్కమాటలు ఝూటాఅని నమ్మి "నన్నుచంపించటానికాతీసుకుపోతున్నావు నీదుంపతెగా"అని ఒక్కతాపు తన్నింది. దానితో నక్క చచ్చిపోయినది. అదరుబెదరులతో గడ్డంస్వామి మీదపడుతుందేమోనని ముందూ వెనకా చూడకుండా పరుగెత్తుతూ ఈచెట్టూ ఆగుట్టా తగిలి సింహం చచ్చిపోయింది. మేక పోతు గంభీరంగా అలాగే కూర్చొనియున్నది. కొన్నాళ్లకు వెతుక్కుంటూ గొల్లవాడువచ్చి దాన్ని లేవతీసుకుపోయినాడు. అప్పటినుంచి లోకంలో మేకపోతుగాంభీర్యం అనేమాట ప్రసిద్ధంఅయిపోయింది.

## పావురం, గుంటనక్క

శ్రీమతి అయ్యగారి మహాలక్ష్మీదేవిగారు

అనగనగా ఒకఅడవిలో ఒకపావురం, ఒకగుంటనక్క ఉంటూఉండేవి. వాళ్లిద్దరికీ చాలాస్నేహము. పాపము పావురం చాలాఅమాయకమైనది. కాని నక్కతెలివైనది. అది ఒకసారి పావురంతో చెప్పిందికదా నేను నిన్నెంతో ప్రేమిస్తూన్నాను, నేను నిన్నెంతప్రేమిస్తున్నానో అంతగానువ్వు నన్నుప్రేమించుటలేదు, ఏమిత్రుడైతే నన్నునవ్వించుతాడో, నన్నుఏడ్పించుతాడో, ఆకలివేసినపుడు అన్నముపెట్టుతాడో, కష్టములు వచ్చినప్పుడు కాపాడుతాడో వాడే నానిజమైన మిత్రుడుఅని నానమ్మకము. నీవల్ల నాకటువంటి సహాయమేదీ లేదుకదాఅని అంది. అప్పుడుపావురం ఓమిత్రుడా! నీవట్లుచెప్పుట పొరపాటు. నీవు నన్నెంతప్రేమిస్తున్నావో నేను నిన్నుకూడా అంతప్రేమిస్తున్నాను. నేనునిన్ను నవ్వించగలను, ఏడ్పించగలను. కష్టములువచ్చినప్పుడు

కాపాడగలను. నీకు కడుపునిండా అన్నము పెట్టగలను. నీకు నామాటలయందు విశ్వాసములేకపోతే నాతో కూడా రాఅని అంది. ఆమాటలువిని అలాఅయితేపద అని నక్క అంది. పావురం ఎగురుతూఎగురుతూ ముందు వెళ్లింది. వెనక నక్కనడుస్తూవెళ్లింది. వెళ్లివెళ్లి రెండూ ఒకరోడ్డుమీదికెళ్లేయి. ఆరోడ్డుమీద ఇద్దరుప్రయాణీకులు నడచివెళ్లుచుండిరి. వారిలో ఒకడు తన కర్రకుమూట తగిలించుకొని ఆకర్రభుజముమీద తగిలించుకొని ముందుగానడవ నారంభించెను. రెండవవాడు చేతిలో కర్రపట్టుకొని వెనుకవచ్చుచుండెను. పావురం మెల్లిగా వెళ్లి ముందునడుస్తూన్న ప్రయాణీకుని మూటమీద కూర్చుండెను. ఆబాటసారికి పావురంకూర్చున్న సంగతి తెలియదు. వెనుకనున్న బాటసారి పావురాన్ని చూచేడు. చూసి నేడీపావురం ఏలాగైనా దొరికితే దాని విలువైనమాంసము తినుటకుదొరకును అని తన మనమున తలచెను. ఈలా ఆలోచించుకొని వాడు తనకర్రను చాలాబలంగాఎత్తి పావురంమీదకొట్టేడు. పావురంఎగిరిపోయింది. ఆదెబ్బయొకటి బాటసారితలకి బలంగా తగిలింది. కర్రదెబ్బతిని మొదటిబాటసారి బాధవలన గిర్రున తిరిగిచూచెను. రెండవబాటసారి తెల్లబోయి నిలచుండెను. మొదటివాడు రెండవవానితో ఏమయ్యా నన్నెందుకు కొట్టేవు? ఏమిసంగతి? అని అడిగేడు. రెండవవాడు జవాబుచెప్పలేదు. మొదటివానికి కోపమువచ్చెను. ఒరేబద్మాష్! నేను నీకేంచేసేను? నన్నెందుకు కర్రతో కొట్టేవురా? అని అన్నాడు. రెండవవాడు అన్నా! నన్ను క్షమించు. నేను మనస్ఫూర్తిగా కొట్టలేదు. నీమూటమీద ఒకపావురం కూర్చునిఉంది. దానిని కొట్టుటకొరకు నేను కర్రవిసిరినాను అని చెప్పెను. మొదటివాడు ఒరే! మోసగాడా! నీవు అబద్ధంచెప్పుచున్నావు. నామూటమీద పావురము కూర్చున్నట్లయితే నాకు తెలియదా? ఉండుఉండు నేనిప్పుడే దీనియొక్క రుచి చూపించెదను అనిచెప్పి వాడారెండవ ప్రయాణీకుని కర్రతో కొట్టెను. కొంచెంసేపటివరకు వాళ్లిద్దరికీ ఘోరయుద్ధంఅయింది. నక్క దగ్గరనున్న ఒకపొదలో దాగుకొనిఉంది. అది ఈప్రయాణీకులయుద్ధంచూసి కడుపుబ్బనట్లు నవ్వింది. ఇంతలో పావురం అక్కడికొచ్చింది. ఏంస్నేహితుడా! నిన్ను నేనెలానవ్వించేను? బాగానవ్వించానాలేదా? ఇంకా నవ్వాలని ఉందాఏం? అని పావురంఅడిగెను. అప్పుడు నక్క ఔను, స్నేహితుడా! నేడునువ్వు నన్ను బాగానవ్వించేవు. కాని నన్ను నువ్వు ఏడిపించలేవు అనిఅంది. పావురము సరే. మంచిది అదికూడాచూచుదుకాని అనిచెప్పింది. అవిరెండు కొంచెముముందుకివెళ్లేయి. కొంచెందూరంవెళ్లిన తరువాత వాటికి రెండువేటకుక్కలు అగుపడ్డాయి. పావురం నక్కని ఒకపొదలోఉండమని చెప్పింది. నక్క దాక్కుంది. పావురంఎగిరి వేటకుక్కలదగ్గిరకెళ్లి తనరెక్కలు గట్టిగవిదలించసాగెను. కుక్కలు పావురాన్నిపట్టుకోడానికి దుమికేయి. అక్కడనుండి పావురం ఎక్కడైతేనక్కవుందో అక్కడకొచ్చివాలింది. వేటకుక్కలుకూడా అక్కడకు వచ్చేయి. మరియు నక్కనుచూచేయి. ఒకకుక్క వెనకనించి నక్కతోకపట్టుకొని లాగింది. రెండవది నక్కయొక్క గుండెలమీదవెళ్లికూర్చుంది. పాపం అప్పుడు నక్క చాలాఆపదలోచిక్కుకుంది, పాపం అది గట్టిగా అరవవారంభించెను. కుక్కలు కరచికరచి దానిని సగంప్రాణాలతో వదలి వెళ్లిపోయినవి. అప్పుడు పావురం చెట్టుమీదనుంచి నక్కదగ్గరకొచ్చి ఏమి స్నేహితుడా! నీస్థితి ఎట్లున్నది? ఇంకా ఏడవాలనిఉందాయేం? అని అడిగింది. అప్పుడు నక్క అన్నా! ఆకుక్కలు నన్నుచంపివేశాయి. నాసంగతేమీఅడగకు. నువ్వు ఈవేళ నన్ను చాలాఏడిపించావు. ఇప్పుడునాకు చాలాఆకలిగాఉంది. నాకేమైనా తినడానికిఇయ్యి అని అడిగెను. అప్పుడు పావురము మంచిది నువ్వు ఇక్కడేకూర్చో. నేను నీకుభోజనానికి ఏర్పాటుచేస్తాను అని చెప్పెను. ఇంతలో ఒకపిల్ల తట్టలో ఆహారపదార్థములుంచుకొని అత్రోవనే తనతండ్రికిభోజనము పొలమునకు తీసుకొని పోవుచుండెను. పావురము ఆపిల్లనుచూసి ఆపిల్లదగ్గరకెళ్లి ఒక్కమారుగా ఆగంపలోపడి రెక్కలుకొట్టుకొనెను. పాపం ఆపిల్లభయపడి ఆతట్ట నక్కడపారవేసి ఇంటికిపారిపోయెను. నక్క సంతోషముతోవచ్చి

కడుపునిండాతిని పావురాన్ని పొగడసాగెను. కొన్నాళ్లయినతరువాత ఒకరోజున ఆవిరెండూ ఎక్కడనుంచో తమయింటికి వెళ్లుచుండెను. త్రోవలో ఒకనది అడ్డమువచ్చెను. దానిలో ఎక్కువగా నీరుండుటచూచి నక్క పావురంతో అన్నా! మనమీనది ఏలాదాటడమూ అని అడిగెను. ఉండు నేను దానికుపాయముచెపుతాను అని పావురము ఆనదిలోనున్న తనస్నేహితుడైన మొసలిదగ్గరకువెళ్లి అన్నా! మమ్ములను ఆవతలియొడ్డు నకుచేర్పుము అని అడిగెను. అందుకు మొసలి ఒప్పుకొని నక్కను పావురాన్ని తనవీపుమీదఎక్కించుకొని నదిని దాటసాగెను. సగంనదిలోకొచ్చినతరువాత పావురము నక్కతో ఈమొసలిస్వభావం మంచిదికాదు. నిన్ను నీళ్లలోముంచేయ్యవలెననిచూస్తోంది అని పావురంచెప్పగానే నక్క భయంతో వణకసాగెను. కాని కొంచెము ధైర్యముతెచ్చుకొని మిత్రమా! నీవెలారక్షించుకొంటావో? నీవుకూడా నాతో మునిగిపోవలసి వచ్చును అనిచెప్పెను. ఆమాటలువిని పావురం నవ్వుతూ నేనెగిరిపోతాను. నన్ను మొసలి ముంచలేదు అనెను. ఆమాటలువిని మొసలి నక్కతో పావురంచెప్పినమాటలునిజమే. నేను నీప్రాణాలుతియ్యకుండా వదలిపెట్టను అని అనెను. పాపం అప్పుడు నక్క చాలాఆపదలోచిక్కుకొనెను. పాపం అదిగట్టిగా అరవ నారంభించెను. పావురము దానిఅవస్థచూచి మొసలితో స్నేహితుడా! నీవు నక్కను చంపకుండా వదలి పెట్టవా? అది ఇచ్చటికివచ్చునప్పుడు తనప్రాణములు తనతోతీసుకొనిరాలేదు. తనగుహలో దాచుకొని వచ్చినది. నీవు దానిని చంపినట్లయితే నీకష్టమంతా వృథాయగును. కాబట్టి ఆలోచించి మరీఆపనిచెయ్యి అని చెప్పెను. పావురంమాటలువిని మొసలి మాట్లాడకుండా ఇద్దర్ని అవతలిఒడ్డునదించేసింది. అవతలిఒడ్డుకుచేరేక పావురం నక్కతో ఏమిస్నేహితుడా! నేను నీప్రాణాలనికాపాడేను. లేకపోయినట్లయితే ఈవేళ ఆమొసలి నిన్ను నీళ్లల్లోముంచివేసియుండును అని అనెను. ఈమాటలువిని నక్క మాట్లాడకుండా లోకముడుచుకొని అడవిలోకి ఒక్కసారిగా పారిపోయెను. కథ కంచికెళ్లింది. మన మింటికొచ్చేము.

## జానెడుమనిషి మూరెడుగెడ్డంకథ

శ్రీమతి కొప్పర్తి సీతా దేవిగారు

అనగాఅనగా ఒకఊరిలో జానెడుమనిషి మూరెడుగెడ్డం అనువాడుకలడు. వాడు ఒకనాడు జొన్నకర్రలబండీ ఎలుకలుఎడ్లుగా తెత్తెత్తెపప్పప్పఅనుచు తోలుకొనిపోవుచుండెను. వెళ్లగావెళ్లగా ఒకనక్కకనిపించి జానెడుమనిషి, మూరెడుగెడ్డం, జొన్నకర్రలబండీ, ఎలుకలు ఎడ్లు తెత్తెత్తెపప్పప్పగాడ! ఎక్కడకువెళ్లుతున్నావు అనెను. అందుకువాడు రాజకుమార్తెను పెండ్లి చేసుకొనుటకు వెళ్లుచున్నాను అనెను. నక్క నేనుకూడావచ్చెదననెను. వాడు నక్కను ఒకచెవులోపెట్టుకొని మళ్లీ తెత్తెత్తెపప్పప్పఅనుచు తోలుకొనిపోవుచుండెను. కొంతదూరము వెళ్లగా పెద్దపులికనిపించి జానెడుమనిషి, మూరెడుగెడ్డం, జొన్నకర్రలబండీ, ఎలుకలుఎడ్లు, తెత్తెత్తెపప్పప్పగాడా! ఎక్కడకువెళ్లుచున్నావు అనెను. అందుకు వాడు రాజకుమార్తెను పెండ్లి చేసుకొనుటకు వెళ్లుచున్నాను అనెను. పెద్దపులి నేనువచ్చెదను అనెను. వాడు సరేయని దానిని మరియొకచెవులో పెట్టుకొనెను. మళ్లీ కొంతదూరము తెత్తెత్తెపప్పప్పఅనుచు వెళ్ళు చుండగా ఒకపాముకనిపించెను. జానెడుమనిషి, మూరెడుగెడ్డం, జొన్నకర్రలబండీ, ఎలుకలు ఎడ్లు తెత్తెత్తెపప్పప్పగాడా!ఎక్కడకువెళ్ళుచున్నావుఅనెను. అందుకు వాడు రాజకుమార్తెను పెండ్లి చేసుకొనుటకు వెళ్ళుచున్నాను అనెను. పాము నేనుకూడా వచ్చెదననెను. సరేరమ్మని

దానినికూడ నక్కఉన్న చెవులోఇమిడ్చెను. మళ్లీ వాడు తెత్తెత్తెపప్పప్పఅనుచు ఎల్లాఅవుతే రాజునుదర్శించి మీకుమార్తెను నాకుపెండ్లిచేయమనెను. అందుకురాజు మాఇంటిలో ఒకపిచ్చి ఏనుగఉన్నది దానిని చంపినఎడల పెండ్లిచేసెదననెను. వాడు పిచ్చిఏనుగుఉన్న శాలదగ్గరకు వెళ్లి పెద్దపులిని చెవులోంచితీసి దానిని పిచ్చివేనుగఉన్నశాలలోనికి పంపించెను. పెద్దపులి కన్నుమూసిన ఏనుగు చంపుటకు, ఏనుగుకన్నుమూసిన పెద్దపులిచంపుటకు సిదముగాఉన్నవి. ఇంతలో నక్క నదియొద్దకువెళ్లి ఆహారము తిని నీరుత్రాగి తను ఇసకలోపొల్లి ఏనుగున్న చోటికివెళ్లి కటకటాలమీదనుంచుని తనలోకకుఅంటియున్న ఇసకను ఏనుగకన్నులలో పడు నట్లు విదిలెను. ఇసుక ఏనుగుకంట్లోపడి కన్నుమూసెను. అప్పుడు పెద్దపులి ఏనుగును చంపివేసెను. అప్పుడు జానెడుమనిషి, మూరెడుగెడ్డం వీటిని చెవులలోపెట్టుకొని రాజుదగ్గరకు వెళ్లి పెళ్ళిచేయుమనెను. రాజుచెయ్యననెను. వాడు పామునుతీసిభయపెట్టెను. రాజుభయ పడలేదు. తానువచ్చేటప్పుడు డొ్రముక్కతోదాచియుంచిన సముద్రపునీళ్ళు వదలిపెట్టెను. ఆపురజనులందరు కొట్టుకొనిపోవుచుండిరి. కొట్టుకొనిపోవుచున్న రాజకుమార్తెను తీసుకొని పెండ్లిచేసుకొని తెత్తెత్తెపప్పప్పఅనుచు తోలుకొనిపోయెను. అక్కడ నక్కకు, పాముకు, పెద్ద పులికి ఆహారముపెట్టి పంపించెను. తను హాయిగా కాపురముచేయుచుండెను.

## తెలియని తప్పిదము

శ్రీమతి పాకల శ్రీలక్ష్మీకామేశ్వరమ్మగారు

రామారావుగారు విశాఖపట్నంలో డిప్యూటీకలెక్టరు. ఒకానొకఅమావాశ్యనాడు ఆయన భోంచేసి క్రింద తలుపులన్నీవేయించి మేడమీదకు వెళ్లినారు. అప్పటికి వీరికుమా రుడు ఇంకామేల్కొనివున్నాడు. రామారావుగారు "ఇంకా మేల్కొనిఉన్నావెందుకురా? పడుకో"అంటూనే పక్కమీదకువెళ్లి పడుకున్నారు. ఇంతట్లోకే వారింట్లో మేడదిగువను పెట్టెలుతీస్తున్నసందడిఅయింది. అప్పుట్లో దొంగలుపడడం ఎక్కువగాఉండడముచేత కొంచెం అనుమానంతోచి ఆయన చప్పున బల్లమీదనున్నపిస్టల్‌తీసికొని మేడదిగి క్రిందకువెళ్లినారు. వీరు వెళ్లేటప్పటికి సూట్‌కేస్‌తాళంరాకపోవుటచేత ఆపాళంగాపెట్టెనేపట్టుకొని అదిన్నీకొంత సామగ్రినిన్నీపట్టుకొనివెళ్లిపోవుటకు సిద్ధంగావున్నాడు దొంగ. వెంటనే రామారావుగారు గుమ్మానికిఅడ్డంగానిలువబడి పిస్టల్ దొంగమీద గురిపెట్టి "అవన్నీ అక్కడపెడ్తావా? లేక నిన్ను షూట్‌చేసెయ్యమంటావా?"అన్నారు. సరి. వీరిమాట ముగియకుండానే పానకంలో పుడకలాగు దురదృష్టవశాత్తూ వీరి కుమారుడు క్రిందజరుగుచున్న సందడివిని గబగబామేడ మీదనుండిదిగివచ్చి తండ్రిచేతులోనున్న పిస్టల్‌నుచూచి తనపిస్టల్ తండ్రి ఎక్కడతీసుకు పోతాడో అన్నభయంచేత "నాన్నా! నేనుఆడుకొనేపిస్టల్ ఎందుకుతీశావ్? నాదినాకిచ్చేయి" అన్నాడు. సరి. ఆమాటతోనే అందులోవున్న కిటుకు దొంగకు తెలిసిపోయింది. వెంటనే రామారావుగారిని త్రోసివేసి పెట్టె, వస్తువులు అన్నీ పట్టుకుపోయినాడు దొంగ.

# మారికాపురి మహాత్మ్యము

శ్రీమతి తురగా కామాక్షమ్మగారు

శ్రీమారికాపురి లక్ష్మీచన్నకేశవస్వామి శంఖము, చక్రము, గద, ప్రయోగచక్రముధరించి శ్రీమహాలక్ష్మితోగూడి భక్తులకోరికలు కొనసాగించుచున్నాడు. ఈమహానుభావుడు కృతయుగమునుండియు నిచ్చటనేయున్నాడుఅని స్థలపురాణమందున్నదని మహాభక్తులు చెప్పుదురు. మార్కండేయమహాఋషి గుండికానదీతీరమున తపస్సుచేయుచుండెను. కీశుడనేరాక్షసుడుపోయి ఆయన తపోభంగముగావించుచుండెను. అప్పుడు మార్కండేయుడు ఆరాక్షసునిబాధకోర్వజాలక శ్రీమహావిష్ణుమూర్తినిగూర్చి (తపస్సు) స్తోత్రము చేసెను. అంతట శ్రీమన్నారాయణుండు ప్రత్యక్షమాయెను. అంత మార్కండేయుడు భగవంతునిచూచి మహానందపరవశుడై ఓమహానుభావా, జగద్రక్షకా, దీనదయాళు, భక్తవత్సలా, పరమపురుషా, ఆపద్బాంధవా, అనాథరక్షకా, శరణాగతత్రాణా, వత్సలా, గజరాజరక్షకా, శ్రీవత్సకౌస్తుభధరా, గోవర్ధనోద్ధారణా, క్షీరసాగరశయనా, లక్ష్మీనారాయణా, నన్ను రక్షింపుము; కీశుడనేరాక్షసునిబాధ నివారింపుము; స్వామీయని వేడుకొనెను. అంత శ్రీమన్నారాయణుండు ఆదిశేషుని ఆరాక్షసునిమీదికి ప్రయోగముచేసెను. అంతట (ప్రయోగచక్రము) ఆదిశేషుడు ఆరాక్షసుని సంహరించెను. మార్కండేయుడు తనయొక్క బాధ నివారణాయెనని చాలాసంతసించి భగవంతునికొనియాడి అనేకవిధముల స్తోత్రముచేసెను. దేవతలు పుష్పవృష్టిగురిపించిరి. గంధర్వులు పాడిరి. అప్సరసలు ఆడిరి. మహానుభావులైన ఋష్యాదులు స్తుతించిరి. అంతట మార్కండేయుడు స్వామినిచూచి మీరిచ్చట ఉండవలసినదనికోరెను. అదిమొదలుకొని శ్రీలక్ష్మీచన్నకేశవస్వామి శంఖము, చక్రము, ప్రయోగచక్రము, గద ధరించి మార్కండేయుని తనలోఐక్యముచేసుకొని ఇచ్చటనేయుండెను. కృతయుగమున గజారణ్యమనియు, ఏనుగలు తమతొండములతో గంగతీసుకవచ్చి స్వామికి అభిషేకముచేసి తామరకమలములుతెచ్చి పూజలొనర్చి ఏనుగలు కడతేరెను అనియు, త్రేతాయుగమునందు మాధవీపురియనియు దేవతలందరు తమలోకమునగల దేవపారిజాతములు, దేవగన్నేరులు, తులసి మొదలైనపుష్పములతో దీనదయాళుని అర్చించిరనియు, ద్వాపరయుగమున ఋష్యాదులు కేశవుని పూజించిరనియు, కలియుగమునందు మారికామారులు స్వామిసేవచేసి స్వామియందైక్యమయిరనియు భక్తులుచెప్పుదురు. వారిపూర్వపుణ్యఫలమున స్వామి వారికిప్రత్యక్షమై తనలోచేర్చుకొనుట ఎట్టిపుణ్యమో కొనియాడనెవరితరము? కలియుగమువచ్చేటప్పటికి స్వామికిచుట్టు పుట్టమొలచెను. ఆదారిని మారికయనుగొల్లతల్లి పెరుగుతీసికొని స్త్రీలతోకలిసి పోవుచుండెను. అప్పుడు స్వామి దాహమని అనెను. ఆమాట మారికయను గొల్లతల్లికి వినవచ్చెను. అంతట ఆమె ఎవరు దాహమనిరి? ఇచ్చట యెవరులేరే అని కొంతసేపు ఆలోచించుచూ నిలచెను. తక్కిన స్త్రీలందరు వెడలిపోయిరి. అంతట ఆమె ఈపుట్టయందెవరో మహనీయులుండవచ్చునని తలచి పుట్టయందు పెరుగంతయు పోసెను. అంత మహానుభావుడైన శ్రీలక్ష్మీచన్నకేశవస్వామి ఆమె ధైర్యమునకును, భక్తిశ్రద్ధలకును ఆనందించి తల్లీ! ఇక చాలును; దాహముతీరినది; నీభక్తికి సాహసించితిని; నీఅత్తమామలు నిన్ను దండింతురేమో అయినను నీకు ఏమి భయములేదు; కనుక నీవు వెళ్ళు. దారిలోనుండు గుండ్లకమ్మయందుండు ఇసుకను కుండనిండా తీసుకవెళ్ళి గాదెలోపోయుము; ఈమాదిరిగానే ప్రతిరోజును చేయుచుండుము. నీకేమియు భయములేదని స్వామిసెలవిచ్చెను. అదిమొదలుకొని ఆతల్లి అలాగే చేయుచుండెను. ఇది కొందరుస్త్రీలుచూచి ఆమె అత్తమామలతోచెప్పిరి. అంతట వారు మారికనుపిలచి ప్రతిరోజును నీవు పెరుగుఏమిచేయుచున్నావు? అమ్ముతున్నావా? లేక త్రాగుతున్నావా? ఎచ్చటనైనా పోయుచున్నావా? ఎవరికైనను ఇచ్చుచున్నావా? నిజమైనసంగతిని చెప్పవలసినదనిరి. అప్పుడు ఆమె భగవంతునిపై

భారమువైచి ఏమిదండించినను సరే అనితలంచి జరిగినసంగతిఅంతయు పూసగ్రుచ్చినట్టుగా చెప్పెను. అంతట వారు ఆదేవుడెవరో ఆపుట్ట యేదో మాకు చూపించమని అడిగిరి. ఆమెనుపిలుచుకొని మరునాడుఉదయము అత్తమామలు, భర్త మొదలైనవారందరుపోయి ఆపుట్టనుచూచి ఇందెవ్వరున్నారో చూతమని పుట్టనుతీసి చూచిరి. అప్పుడు శ్రీమన్నారాయణమూర్తి శంఖము, చక్రము, గద, ప్రయోగచక్రము, దశావతారములు గల మకరతోరణము, కుడిచేతిప్రక్కన మార్కండేయమహాఋషి దండకమండలములతో నుండెను. అటు వంటి శ్రీలక్ష్మీచన్నకేశవస్వామి ప్రత్యక్షమాయెను. అంతట వారందరును మన మారిక యెట్టి పుణ్యము చేసెనో! ఈమహానుభావుడు ప్రత్యక్షమాయెను. ఆమెవల్లనే మనకు శ్రీలక్ష్మీచన్నకేశవస్వామి దర్శనమిచ్చెనని సంతసించి స్వామినిస్తోత్రముచేసి ఇంటికివెడలిపోయిరి. ఆనాటిరాత్రి ఆమెభర్తస్వప్నములో శ్రీచన్నకేశవస్వామి నాకు గర్భాలయము కట్టించుమని సెలవిచ్చెను. అంతట నిద్రనుండిలేచి నేను యెట్లుకట్టింతును; ద్రవ్యములేదేఅని చింతించి తనకేమియుతోచక తనభార్యనుపిలచి పూర్వపుణ్యావశమున స్వామి స్వప్నమునవచ్చి గర్భాలయము కట్టించమనికోరెను. నేను ద్రవ్యహీనుడను ఎట్లు కట్టింతునాయని చింతించెను. అంతట మీరుభయపడవలదు. భగవంతుడు భక్తపరాధీనుడుకావున భక్తులనురక్షించును. ఆయనయే ద్రవ్యము నిచ్చును. సంకల్పము నెరవేర్చుకొనును. కనుక మీరు భయపడవలదుఅని భర్తకుచెప్పి ఆమెపోసిన యినుక ఏమైనదో చూతమని గాదెదగ్గరకు వెళ్లిచూచెను. ఇనుకఅంతయు బంగారుగామారియుండెను. అంతట ఆమె భర్తకు ఆగాదెను చూపించెను. అంతటఆయన భగవదనుగ్రహమునకు సంతోషించి భార్య భక్తికిమెచ్చి సంతసించెను. అంతట ఆగొల్లబోయడు స్వామిగర్భాలయముకట్టించుటకు జ్యోతిష్కులచేత మంచి సుముహూర్తమేర్పరచి దేవాలయముకట్టుటకు పునాదితీయుటకు ప్రారంభించెను. అంతట ఆభూమిలో ద్రవ్యము దొరికెను. ఆద్రవ్యము భగవంతుడిచ్చినద్రవ్యమనితలచి, ఆద్రవ్యమును గాదెయందుండు బంగారమునుఅంతయు సెలవుచేసి శరీరకష్టముచేసి దేవాలయముపూర్తిచేసిరి. అందు స్వామినిప్రతిష్టచేసి వారిశక్తికొలదిఅభిషేకములు, పూజలు, అన్నదానములుచేసి బ్రాహ్మణులతృప్తులచేసిరి. అప్పటినుండి వారు భార్యాభర్తలిద్దరు స్వామినినమ్మి పాదసేవలొనర్చి ఇహసుఖమునుమరచి భగవధ్యానములోనుండి కాలముగడుపుచుండిరి. అంతకొంతకాలమునకు భగవంతుడు ప్రత్యక్షమై మీకేమివరముకావలెనని అడిగెను. అంత వారు స్వామీ మాకేమియు కోరికలులేవు మీ పాదమే దిక్కనినమ్మితిమి. కనుక మీలో చేర్చుకొనుము అనికోరిరి. దీనదయాళుడు కావున వారిని తనయందైక్యముచేసుకొనెను. కనుక భార్యవల్లనే తనకును మోక్షముకలిగెను. పతివ్రతలైన స్త్రీలు చేసినపుణ్యమువలన పురుషులకుకూడ విష్ణుసాయుజ్యము కలుగునని శ్రీలక్ష్మీచన్నకేశవస్వామిమహాత్మ్యమువలన తెలియుచున్నది. కనుక స్త్రీలు పతిసేవచేయుచు భగవధ్యానమును మరువక చేసిరేని భార్యాభర్తలుభయులు కడతేరుదురు.

## ప్రార్థన

శ్రీమతి నరహరిశెట్టి నాగరత్నాంబగారు

చిత్తవీథిని నిన్జూచు స్థిరతలేక
నిన్ను జేరెడి తెలివుగాన్పింపకుండె
నుష్మదంఘ్రిసరోరుహయుగ్మమువయి
నవిరళానందభక్తి నాకలవరపుము
రంగ!రంగా! విఠలు! పాండురంగ! విఠలు;
పండరీనాథ! విఠలు! తుభ్యంనమోస్తు!

... ... ...
పండరీపురవిఠల! నీవామభాగ
మున రమామణిరుక్మిణి యొనసికొలువ
భక్తతతి కొంగుబంగారువగిదిగాఁగ
హస్తవిన్యస్తజఘనుఁడవగుచుదనరు
సురుచిరాకృతి నొకమాఱు జూపుమయ్య!

# రాటపు పాటలు

శ్రీమతి ఇనగంటి రత్నమ్మగారు

౩౩
పాపకర్మనిచేను యేమేమిబండు
పలుగురాళ్లుబండు పల్లేరుబండు
అన్నయ్య నీచేన్కు యేమేమిబండు
దంతపిప్పళ్లుపండు ధనియాలుబండు
మొలగపిప్పళ్లుపండు యేలకులుబండు
సాలుకెయ్యిపుట్లు సన్నొడ్లుబండు.

౩౪
చక్కా-నన్నాగారి ముక్కు-పై చెమట
చేరుజెగిముత్యాలు చెరిగిచల్లుండు.

౩౫
చెరువుకట్టలమీద కొంగల్నిజూచి
చెరువుచేపలన్నీ చెల్లాటలాడె
మందకట్టలమీద మాఅన్నల్నిజూచి
మచ్చికలువేసేరు మామకూతుళ్లు.

౩౬
ఇల్లలికిముగ్గెట్టి యింతపనిజేసి
యీయింటియిల్లాలు యెందుబోయింది
అన్నలతోవియ్యము అందబోయింది
వదినెలతోవరిపాలు దంచబోయింది.

౩౭
విత్తనాలగింప నత్తినెట్టుకోని
వీధిలోఅబ్బాయి అప్పయిల్లకుగు
నాలుగిండ్లనడుమ చిత్తారుపైక
నవ్వులానాలక్ష్మి నాతమ్ముడనెను.

౩౮
కలికికన్నులవాడు కాముడప్పన్నా
కలవారిపట్టికి కావలున్నాడు
మంచిగంధముదెచ్చి పొంచులున్నాడు
కావలేలుంటావు కట్టుకంకణము
పొంచులేలుంటావు పోయితలబ్రాలు.

౩౯
విత్తులేసిఅన్నల్లు యిండ్లకొస్తుంటె
చేరదేసికన్నులా చేడలెదురైరి.

౪౦
గోపెమ్మ! నీవుగన్న కొడుకుల్లలోకి
భీకరముగలవాడు భీముడుజంపన్న
నాతల్లి! నీవుగన్న కొడుకుల్లలోకి
రాజంశగలవాడు రాముడెంకన్నా.

౪౧
వడ్లల్లో వరిపోట్లుకలపకే తల్లి!
వంశాన నీకడుపు వర్ధిల్లవలెను
పాలల్లో పంచదారకలపవే తల్లి!
భాగ్యాన నీకడుపు ఫలమందవలెను.

౪౨
ఏడుగురుస్త్రీలను యేతల్లిగనును?
యేకచక్రమంతా యేతండ్రియేలు?
యేడుగురుస్త్రీలను కనునుమాతల్లి
యేకచక్రామంత యేలుమాతండ్రి.

౪౩
బుద్ధిగల నాముద్దు ఓయన్నలార
భూమణాలిచ్చేను భూములేలండి
చాలకుంటె నానుసరులుయిచ్చేను
వడ్యాణమిచ్చేను వోడిరాకన్నా.

౪౪
బుద్ధిగలఓయన్నా భూమేలాబోతా
తల్లికితండ్రికి దణ్ణములుబెట్టు.

—సశేషము.




## మెలుకువలు

యు. వేంకటనరసుగారు

### అరటికాయల నిలవరము

కూరకుగా అరటికాయలు తెచ్చుకొన్నప్పుడు మిగిలినవి మూలపడవేయుచున్నారు. అవి రెండుమూడు నాళ్లలో ముగ్గి దేనికినిబనికిరాకపోవుచున్నవి. అట్లుమిగిలిన కాయలను గాలి ధారాళముగాగలచోట చన్నీటి పాత్రలోపడవేసి ఉంచినయెడల యెన్నిదినములకైనను చెట్టునుండికోసిన పచ్చికాయలవలెనే యుండును.

### ఉడకనికందిపప్పు

సాధారణముగా ఉడకనికందిపప్పును 'బియ్యపుకడుగులో' ఎసరుపెట్టి అందులో పప్పువేసిన త్వరలో ఉడుకును. లేదా పచ్చిబియ్యపుతౌడును ఉడుకుచున్న బేడలలోవేసిన పప్పు మెత్తగానుడికి రుచియు, నారోగ్యముగలిగించును.

## వంకాయ ఆవకాయ

శ్రీమతి వి. వసంతగారు

లేతవంకాయలు బాగకడిగి నూనెవంకాయకుతరిగినట్లు తరగవలెను. ఆవపిండి 1 భాగం, మెత్తటి కారపుపొడి(మిరపపొడి) 1 భాగం, ఉప్పు 1¼ భాగం, చింతపండు-గింజలు పుల్లుఏరి శుభ్రముచేసి గ్రహించవలెను. ఆవపిండి, మిరపపొడి, ఉప్పు, చింతపండు, మంచినూనె 5 పలాలు (1వీసెకు 5పలాలు వేయవలెను.) అన్నియు బాగకలిపి ఈవంకాయలలో ఆవకాయలోకూరునట్లు కూరవలెను. పసుపుకూడ వేయవలెను. 20 రోజులు,1 నెలకూడ నిలవయుండును. అప్పుడప్పుడు కుదిలించవలెను.

## జిలేబి చేయువిధము

శ్రీమతి పాకలరత్నమాలగారు

అర్ధశేరు పెసరపిండిని మెత్తగాజల్లించి ఒక కళాయిపాత్రలోవేసి అయిదారుతులముల పెరుగునీళ్లను కలిపి జారుగా సిద్ధముచేసుకొనవలెను. పెరుగునీళ్లుకలిపినపిండి లేసెవలె నుండవలెను. చక్కెరను పాకము చేసుకుని(లేతపాకముగానుండవలెను)యొకచో నుంచవలెను. వెడల్పయినపళ్లెమును పొయ్యిమీదపెట్టి ప్రథమమున సవాశేరు నేయిపోసి కాచవలెను. ఒక టెంకాయచిప్పకుగాని, యిత్తడిచెంబునకుగాని చిటికెన వ్రేలంతరంధ్రముచేసి దానిలో పైనకలిపిఉంచిన పెసరపిండినిపోసి కాగుచున్న నేతిలో చుట్టలుచుట్టలుగాత్రిప్పి రెండువైపులను వేగినతరువాత పంచదారపాకములోవేసి చట్రముతో ముంచవలెను. ముంచినదానిని వెంటనే తీయుచు మరియొకపళ్లెములోపెట్టుకొని ఉపయోగించవలెను. ఈజిలేబికి రంగుకావలసినయెడల పెసరపిండిని కలుపుపెరుగులో కొద్దిగా పసుపుకలుపవలెను.

## సగ్గుబియ్యపు హల్వా

శ్రీమతి నాయిని హనుమాయమ్మగారు

కొలత పావు (అనగా ¼ శేరు)తో ఒకటి సగ్గుబియ్యముకొలిచి ఉంచుకొనవలయును. అదే పావుతో ఒకటి చక్కెరకొలిచి ఉంచుకొనవలయును. పెద్దకాయఅయినచో ఒక టెంకాయతురిమి పాలుతీయవలయును. చిన్నవిఅయినచో మూడుచిప్పలు (1½ కాయ) తురిమి పాలుతీయవలయును. తగుమాత్రపునెయ్యి బాణలిలో పోసి, కొద్దిగా జీడిపప్పువేయించి తీసుకొనవలయును. తర్వాత ఈసగ్గుబియ్యము కొద్దిగా వేయించుకొని అకొలత పావుతో 2½ పావులు (టెంకాయపాలు, నీళ్లుకలిపి)పోసి, కళాయిపాత్రలోపోసి, ఉడుకబెట్టవలయును. (బాణలిలోనే ఉడకబెట్టితే నలుపుఅవును. కావున కళాయిపాత్రలోపోయుట మంచిది.) సన్నపుమంటపై ఉడుకబెట్టుచూ, సగ్గుబియ్యము ఉడికినతర్వాత కొలిచిఉంచుకొన్న చక్కెరపోయవలయును. బాగా గట్టిగా అగునటూ కలుపుచూయుండి గట్టిపడగానే జీడిపప్పు, యాలకులపొడి, నెయ్యివేసి దింపవలయును. చల్లగ చల్లారినతర్వాత తినవలయును. లేనియడల చేతికి అంటుకొనును.

## దొండకాయకూర

శ్రీమతి వి. సత్యవతమ్మగారు

దొండకాయలలో లేతవిగాఉండునవి వంకాయతరిగినట్లే తరుగవలెను. ఉప్పు, పసుపువేసి బాగాఉడికించవలెను. జాస్తి నీళ్ళతో ఉడికించినగాని దానిపసరు పోదందురు. నీళ్ళుమిగులకుండా ఉడికించిన మిక్కిలి పైత్యమని, తల తిరుగునని అందురు. మిగిలిననీళ్ళు పారబోసి బాణలిలో తిరుగబోతవేసి ఈబద్దలను అందులో వేయగానే చిక్కటిగోటిపులుసు వేయవలెను. తరువాత పచ్చిపిండి మనకు కావలసినంత, తీపి కొరకు బెల్లము, కొబ్బెర పచ్చిదిగాని ఎండుదిగాని తురిమి, ముంతమామిడిపప్పు కూడవేసి సన్నటిసెగమీద ఉంచవలెను. చాల రుచిగాఉండును.

## గవ్వలు చేయువిధము

యు. సత్యబాల సుశీలా దేవిగారు

రుచిగల పిండివంటలలో నిదియొకటి. సవాశేరు మైదాపిండిని బియ్యంజావబోసి కొట్టిన పిండిని పావుశేరు-కలిపి అందులో 5 తులములనెయ్యి, కొద్దిగా సోడాఉప్పువేసి-తగుమాత్రము నీరుపోసి ముద్దగాచేసి బాగామర్దనచేసి ఒకగంటసేపు అట్లేఉంచవలెను. పిమ్మట తెల్లనిబెల్లం ¼ వీశెడుకొట్టి ఒక పావుశేరు నీళ్ళుపోసి పొయ్యిమీదపెట్టవలెను. దానిని చేతితో తాకితే ఒక అంగుళము తీగవచ్చేటట్టు పాకముచూసి దింపుకొనవలెను.తరువాత పైనచెప్పబడినపిండిని-గోలీయంతతీసుకొని 2 అంగుళములపొడుగుగాతట్టి దానిని గుండ్రగా చుట్టవలెను. అట్లుచుట్టినదానిని కొనలుగుండ్రగా ఉండునట్లు మూసివేయవలెను. పిండివంతయు ఈవిధముగా ఉండలుచేసి కళాయిలో సవాశేరు నెయ్యిపోసి కాగినతరువాత యీఉండలు పట్టినన్నివేయించి ఎరుపు రంగువచ్చినవెంటనేతీసి పైనచెప్పబడిన పాకములో వేయవలెను. అన్నివేయించి పాకములో వేసినతరువాత బాగా పాకములోతడిసేటట్లు కలియబెట్టి పళ్లెములో పోయవలెను. పాకము ఆరి గట్టిబడినపిమ్మట భుజించవలెను. మిక్కిలి రుచిగాఉండును.

---

ఈశీర్షికకు సంబంధించినవిషయములు విరివిగా పంపవలసినదిగా పాకకళాకుశలలగు స్త్రీలను ప్రార్థించుచున్నారము. —సంపాదకుడు

---




## లాలిపాట

(సంపాదకురాలు) శ్రీమతి బొడ్డు సీతామహాలక్ష్మిగారు

లాలీ శ్రీకృష్ణయ్య నీలామేఘవర్ణా బాలాగోపాలనీవు పవ్వళించవయ్యా　లాలి.
శృంగారించిన మంచిబంగారుటుయ్యాలలో శంఖచక్రధరా స్వామీ నిదురబోవయ్యా　లాలి.
శేషపాన్పుమీద శయనించినాకృష్ణ దోషాపహారవసుదేవతనయా రావయ్యా　లాలి.
ప్రొద్దుబోయెనురా ఒకముద్దునాకియ్యరా సద్దుసేయక స్వామి నిద్దురబోవయ్యా　లాలి.
లలితాంగిరుక్మిణి లలనాయెకావలెనా పలుక్కులో నెలసత్యభామాకావలెనా　లాలి.
నగుమోముగలబీబీనాంచారుకావలెనా నవమోహనాకార నాచిన్నికృష్ణా　లాలి.
ఇందరిలోపల నీకు ఎవరూకావలెనూ ఇందీవరాక్షీ కాళిందికావలెనా　లాలి.
గుజ్జాముంగురులెగదువ్వీ పిగపైపూలుచుట్టుకొని గజ్జలుఘల్లుఘల్లురవ రావయ్యా　లాలి!

## కీర్తన

(సంపాదకురాలు) శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

పరమానందమేరామభజనా! నిత్యానందమేరామభజనా!
హృదయానందమేరామభజనా! బ్రహ్మానందమేరామభజనా!
హరిహరూలతత్వముకన్నా　పర.
పంచదార, ద్రాక్షపండ్లుతిన్నా! భక్తిమించి మాధుర్యములేదన్నా　పర.
పాలువెన్నభుజించూటకన్నా! మధురమన్నా, హరినామామువిన్న　పర.
రాజ్యపాలానామదియేటికన్నా? దివిజపూజ్యునిపూజింపుచున్నా!　పర.
పరమభక్తాలుపోయినదారి, భుక్తిముక్తులొసంగుమీదయమీరి　పర.
వరద! దాసాంతరాత్మసంచారి! కరుణసాగరుడై నామురారి!　పర.



## పేరులేని స్త్రీచిత్రప్రచురణమువలన:—

"లార్డు నార్తుక్లిఫ్-పత్రికాధిపతి-అచ్చుకూటములోనికివచ్చినాడు. కట్టి సిద్ధముగానున్న వార్తాపత్రిక పుటయొక్క ప్రూఫు చూపినారు. ఆపుటలో ఒక్కబొమ్మకూడలేదు. లార్డు నార్తుక్లిఫ్ వికలుడైనాడు. వార్తాపత్రికలో పటములేనిపుటఅన్నచో అతనికి తలయేరు. దగ్గర బల్లమీదపడియున్న బ్లాకులలో చేతికందిన దాని నొకదానిని గ్రహించినాడు. కట్టినపుటనువిప్పి అందీబొమ్మను ఇరికించమని ఆజ్ఞఇడినాడు. బ్లాకు ఇరికించబడినది. బొమ్మలేకుండ పుటకట్టించినందులకు చీదరపడుచున్న అధిపతిఎదుట సహాయసంపాదకుడు వణకుకాళ్లతో, వణకుచేతులతో నిలబడియున్నాడు. బొమ్మ అయితే ఇరికించబడినది. దానికి ఏమిపేరు పెట్టుట? స్త్రీలు స్నానమాడునపుడుధరించు దుస్తులలో వర్తకముచేయు ఒకఘరమువారి కేటలాగులోని వదులువదులుబట్టలుకట్టిన ఒకవయ్యారిచిత్రమది. ఆకేటలాగుబొమ్మకు ఏమని పేరుపెట్టుట? సాహసించి సహాయసంపాదకుడు అధిపతితో 'ఈమెఎవరు? ఏమిపేరుపెట్టుదము?' అనెను. 'ఎవరయ్యా ఆమె' అను ప్రశ్నతో నార్తుక్లిఫ్ చుట్టునున్నవారిని చూచెను. ఎవరును ఎట్టిజవాబును ఈయలేదు. ప్రబోధితుడైనవానివలె దిక్కులుపరికించుచు నార్తుక్లిఫ్ 'ఆమెకురెండునామములిండు. మొదట 'ఈమెఅందమైనదికాదా?' అని ప్రచురించుడు. ప్రక్కను 'ఈమెఎవరు?' అని ప్రచురింపుడు. దానితో ఈసంబంధమైన మనకష్టముతీరును. ప్రతిదినముకంటె ఈదినము మనపత్రిక ఎక్కువకాపీలువెలబోవును' అనెను. అట్లే జరిగెను. ఆదినముఆపత్రిక కాపీలు ఎక్కువ వెలబోయెను."

*—From Tom Clarke's Life of Lord Northcliff.*

## థోమస్ హార్డీ పుట్టుక: ఒక స్త్రీ చేసిన ఘనకార్యము:—

"ఆధునికాంగ్లనవలాకారులలో ప్రఖ్యాతుడగు థోమసుహార్డీనామము హిందూదేశమున పలువురు వినియుందురు. డార్చెస్టరునందు థోమస్హార్డీ కంచువిగ్రహమును బహిరంగపరచుచు ఆప్రసిద్ధనవలాకారునిపుట్టుకకు సంబంధించిన ఒకక్రొత్తకథను సర్ జేమ్సుబారీగారు చెప్పినారు. హార్డీపుట్టగానే డాక్టరు పరీక్షించెను. జీవలక్షణములేవియు ఆడాక్టరునకు కానరాలేదు. కావున హార్డీని—చనిపోయినాడనుకొని—ఒకతట్టలో పడవైచెను. ఆంగ్లసారస్వతార్చకుడుకాగల ఆశిశువిట్లు చనిపోయినట్లుతలపబడి తట్టలోపడియుండెను. డాక్టరు ఆబాలుని తట్టలోపారవేయుచుండగా ఒకస్త్రీచూచెను. ఆమె ఆబాలుని తట్టలోనుండగా తానుకూడచూచెను. బాలుడు బ్రతికియున్నట్లు ఆమె పసిపట్టెను. బాలుడు బ్రతికెను. పెద్దవాడయ్యెను. ఆంగ్లసారస్వతమును మహత్తరముగ వెలయించెను. థోమస్హార్డీయొక్క ఈకంచువిగ్రహమునుచేసిన శిల్పి

ఎరిక్ కెన్నింగుటన్ గారే ఆతనిని ఆవాడు మృత్యుదేవతవదనమునుండిరక్షించిన ఆస్త్రీయొక్క కంచువిగ్రహ మునుగూడచేసిన బాగుండును."

*—The Indian Nation.*

## టర్కీ దేశపుస్త్రీలు: వ్యాపారపుటోడలయందు నౌకరీ:—

"టర్కీదేశమునందలి వర్తకసంబంధమైన ఓడలసముదాయమునందు **(Mercantile Marine)** ఆదేశపు స్త్రీలు విరివిగ పనులకుకుదురుచున్నారు. స్త్రీలిట్లు పనికి కుదురుచుండుటచే టర్కీదేశమునకు **Mercantile Marine** కలదనువిషయము ప్రపంచమునకు తెలియవచ్చుచున్నది. స్టామ్బవుల్ అను ప్రదేశమునందలి మర్కంటైలు మెరయన్ ట్రెయినింగుస్కూలునందు ఈవత్సరము పెక్కురు టర్కీదేశపుస్త్రీలుచేర్చుకొనబడిరి. పైవత్సరమునకు తగుతరిబీతుతో మొదటిజట్టుస్త్రీలు ఆపాఠశాలనువీడుదురు. కొంతకాలము ఇంత ఉద్ధృతముగను స్త్రీలిందుప్రవేశించుచుండుచో ఇపుడు మర్కంటైలు మెరయన్‌నందు పనిచేయుచున్న పురుషులు పరదాను ధరించి అంతఃపురములకుపోవచ్చునని ఒకరు చమత్కారముగ ననుచున్నారు."

*—The Rangoon Weekly Review.*

## ఋతుశూల: హిందూదేశపుస్త్రీలు:—

**Dr. A. K. Das Gupta** B.A., L.M.F. గారు **Puberty in girls with its Anomalies** అను వ్యాసమున ఇట్లు వ్రాయుచున్నారు: "ఋతుశూలగలయువతికి ఒడలు తెలియదు. ఉద్రిక్తయగును. కోపము హెచ్చును. స్థిరచిత్తములేకుండును. భయము సంకోచము చుట్టుముట్టును. హిందూదేశమునందలి నేటిస్త్రీలయందు ఋతుశూలవ్యాధి సర్వసాధారణమగుచున్నది. ప్రసవమగుటతో ఈవ్యాధి ఎట్టిమందును అక్కరలేకనే తలువ నయమగును. ప్రసవమునకు ఈవ్యాధి నివారింపబడుటకుగల సంబంధము వైద్యులలో మిక్కిలి వివాదమును పెంపొందించినవిషయము. ఆవిషయములను వివరించుట కిట తావుచాలదు."

*—Indian Medical Record.*

## శ్రీమతి హ్లాఆంగ్ సతి:—

"శ్రీమతి హ్లాఆంగ్ సతి బర్మాస్త్రీసంఘాధ్యక్షురాలు. బర్మాదేశమునందొక ప్రముఖురాలు. స్త్రీలు రాజకీయమున పాలుగొనుట వారిహక్కనియు, వారివిధియనియు ఈమె విస్పష్టముగచాటినది. దేశపరిపాలనా విధానమున స్త్రీలును తమకుతగురీతిని భాగస్వాములుకావలయునని ఆమెనిశ్చయము. బర్మారాజ్యాంగవిధానము ఈమె భవిష్యజ్జీవితముచే ఉజ్జీవితముకాగలదు. ఈమెఆకారము ఉద్దీపనకారి; ఈమెఆశయములు ఉన్నతములు, ఉచితములు; ఈమెభావములు దేశహితకరములు."

*—The Rangoon Mail.*

## వివిధదేశములలో పెండ్లికి వయస్సు:—

"మనదేశములో కడుపులో బిడ్డకుగూడా పెండ్లిచేసేవారు పూర్వము. ఇప్పుడు హరబిలాసశారదా గారి పుణ్యాన బాలిక వివాహపువయస్సు 14 ఏండ్లని శాసింపబడినది. ఇతరదేశములలో శాసనాలప్రకారము ఇట్లున్నది. ఫ్రాంసులో బాలునికి 18 సంవత్సరాలు, బాలికకు 16 ఏండ్లు ఉండవలెను. జర్మనీలో వరునికి అధమము 18 ఉండవలెను. పోర్చుగల్, గ్రీసు, స్పెయిను దేశములలో బాలునికి 14 ఏండ్లు, బాలికకు 12 ఉండవలెను. ఆస్ట్రియాలో పెండ్లికొడుకుకు, పెండ్లికూతురుకి ఇద్దరికి 14 ఏండ్లుండవలెను. ఇకటర్కీలో నడువగలిగి మంత్రాల ఉచ్చరింపగలిగిన బాలికలుబాలురు వివాహబంధములో తగులుకోవచ్చును. పెర్షియాలో ఈమధ్యనే బాల్యవివాహాలనిషేధించే శాసనము చేయబడినది." —జమీందారిరైతు.

### సహకారోద్యమము: హిందూదేశ స్త్రీలు:—

"హిందూదేశములో సహకారోద్యమమున స్త్రీలు పాల్గొనిననాటినుండి నేటివరకుచూచిన ప్రత్యేకముగ స్త్రీసహకారసంఘములసంఖ్య 1930 లో 112 నుంచి 128 వరకు వృద్ధికాబడి మొత్తము సభ్యులసంఖ్య 2000 వరకుగలరు. బొంబాయిలో స్త్రీలకు ప్రత్యేకముగ సహకారస్టోరు సంఘమొకటి స్థాపింపబడినది. ఇప్పుడు సభ్యులు 70 మందిగలరు. ప్రభుత్వసహాయ మణుమాత్రము లేకుండ స్త్రీలలో తమంతట తాము సంస్థ నడుపుచున్నందులకు వారి ఉత్సాహమును గమనించవలసియున్నది." —సహకారము.

### నగ్నమతోపాసన:—

"యూరపుఖండములో దిగంబరత్వము ఒకదేశమునుండి యింకొకదేశమునకు ప్రాకుచున్నది. అది యందొకసంఘము జర్మనీదేశములో సముద్రతీరమునగల ఒకచిన్నద్వీపమందు నెలకొల్పబడినది. ఆసంఘము యొక్క ఆవరణలోనికి పోదలంచువారలు ముందుగ వస్త్రములను పూర్తిగ విప్పివేయవలయును. దిగంబర తత్వము నారాధించు ఒకపాఠశాలగూడ స్థాపింపబడియున్నదనిగూడ తెలియుచున్నది. ఇటీవల పారిస్‌నగరమున ఒక భావోన్నతనగరమున ఆదామురుద్యానవనమను పేర బరగుచున్న సౌధమును పోలీసులు రాత్రిసమయమున చుట్టుముట్టిరి. ఈభవనము బలవత్తరమగు నొక దిగంబరసంఘ యాజమాన్యముక్రింద సాగింపబడుచున్నది. రెండవయంతస్తులో నాట్యముసాగుచుండును. ఇందులో నాట్యమాడు స్త్రీపురుషులు నోదులుగనుండు వరాయిలు పొట్టినిక్కాయలుమాత్రము ధరింతురు. దీనికి పైనగలమందిరము చాల రమణీయములగు లతలతోడను, దివ్వెలతోడను అలంకరింపబడియున్నది. అందు దిగంబరులగు స్త్రీపురుషులు రాత్రిసమయములందు నాట్యమాడుచుందురు. ఈఆదాముమందిరమందు నాట్యమాడు స్త్రీపురుషులవర్తనమును విని పోలీసులు హఠాత్తుగా ఒకనాటిరేయి ఆభవనమును చుట్టుముట్టిరి. ఆసమయమున భవనముయొక్క పైభాగమున దిగంబర నాట్యము సాగుచుండెను. పోలీసులు వచ్చిరనగనే వేవేగ నాట్యమందు పాల్గొనినవారు వదులువరాయిలను తొడుగుకొనిరి. అందు పాల్గొనువారిలో రహస్యముగ అక్కడకువచ్చిన బాలికలెందరోకలరు. అటుగల 200 స్త్రీపురుషులను మోటారులలోయెక్కించుకొని పోలీసుఠాణాకు గొంపోయిరి. వారిలో యిరువదిమంది ఇంగ్లాండువారని తెలిసినది. మరుసటిదినము ఆసంఘపుపుస్తకములు పరిశోధింపగ భయానకములగు వివరములు తెలియవచ్చెను. ఈదిగంబరసంఘములో పదివేలమంది యూరపియను స్త్రీపురుషులు సభ్యత్వము వహించుచుండిరి. ఆమొత్తములో మూడువేలమంది ఇంగ్లాండునకు చెందినవారైయుండిరి." —శారద.

### వ్యయకర్తనము: సైనికవ్యయము:—

"1913-14 లో హిందూదేశమున సైనికవ్యయము 29 కోట్లు. మఱిపీడేండ్లకు 1921-22 లో అవ్యయము 68 కోట్లకు పెరిగెను. ఇంచికేపుకమిటీవారి సిఫార్సులవలన ఆవ్యయము 1927-28 లో 54½ కోట్లకు తగ్గింపబడెను. దేశముయొక్క ఆర్థికపరిస్థితులు నానాటికి తీసికట్టుగానగుటచే 1930-31 లో అది 52 కోట్లకు తగ్గెను. ఇపుడు వ్యయకర్తనసంఘమువారు ఈ 52 కోట్లలో మఱిమూడుకోట్లు తగ్గించమనుచున్నారు. దేశావృతమైన నేటి మహాదారిద్ర్యమున ఈమూడుకోట్లతగ్గింపు సముద్రమున కాకిరెట్టవంటిదగును."

—*The Amrita Bazar Patrika.*

### సహగమనములు:—

"సహగమనము శాసనముచే నాపఁబడియె. కాని యది యపుడపుడు రూపాంతరములతో జరుగుచుండుట పత్రికాపాఠకులకు విదితము. వితంతువివాహము, రజస్వలానంతరపరిణయములవలెగాని నిరశనవ్రతాది

కముపలెగాని జాతీయపత్రికలలో నివి ప్రాముఖ్యముపొందుటలేదు! బొంబాయిరాజధానిలో శ్రీమతి అఖండ సౌభాగ్యవతియగు 22 సం॥ గల యశోదాబాయి భర్త చావుబ్రతుకులమీదనున్నాఁడని తెలుసుకొని 3, 4 దినములుపవసించి, యమునా నదిలో స్నానముచేసి యాఉదకమును పెనిమిటినోటిలోఁబోసి తాను త్రాగి, భర్తను క్రిందఁబెట్టగానే, దేహమునిండ నెయ్యిబూసికొని, కిరసనాయిలుతోఁదడిపిన మంచి చీరగట్టుకుని, నిప్పు ముట్టించుకొనెను. డాక్టరులువచ్చినను దగ్ధమగుచున్న నాపతివ్రత యెవ్వరిని తాకనివ్వలేదు. భర్త మరణించెను. శ్మశానవాటికలో భర్తశవము ఎన్నిపర్యాయములు ముట్టించినను, యీమె ప్రాణములుగూడఁ బోయి యీశవముగూడ వెళ్ళునంతకుఁ జల్లారిపోవుచుఁ జివరకు రెండుశవములు జంటగకాలి భస్మావశేషములైనవి. ఇదంతయు బొంబాయి సమాచార్ అను గుజరాతు దైనికపత్రికలో వర్ణింపఁబడియె. 20—5—31 తేదీన ఉత్తరఇండియా సీతాపురముజిల్లా, ఓహటపీర్ గ్రామమందు నొకక్షత్రియాంగన సహగమనోన్ముఖురాలుకాఁగా బలవంతముగ పోలీసువారిచే నాపఁబడినఁ, గూర్చుండి, లోనినుండి అగ్ని ప్రజ్వలింపజేసి, శరీర దగ్ధము చేసికొనెను. ఆదగ్ధదేహమును పతిచితిమీదఁబెట్టి రెంటెని భస్మముచేసిరి. ఆమె అగ్నిపుట్టించిన ప్రదేశమునఁ బ్రతిగురువారము జాతరజరుపుచున్నారట! దీనివివరమంతయు వంగవాసి, సమ్మేళనపత్రిక, బ్రాహ్మణ సర్వస్వము మొదలైన హిందీపత్రికలలోఁ బ్రకటింపఁబడినది. ఇట్లనే అనేకమంది రాజపుత్రస్త్రీరత్నములాధర్మమాచరించి లోకమాతలైరి! చివరకు నొకపక్షియు నట్లనే సహగమనమాచరించినట్లు దెలిపిన కపోతోపాఖ్యానము భారతాలంకారముగద!"

—వర్ణాశ్రమ.

## చిలుకకు పలుక నేర్పుట:—

"మీయింట నొక పెంపుడుచిలుక కలదా? ఆచిలుకకు పలుక నేర్పుటకు మంచివిధానమిది. సాయంకాలముగాని రాత్రిగాని దానిపంజరముచుట్టును ఒక నల్లగుడ్డను చుట్టుము. అప్పుడు నెమ్మదిగను స్పష్టముగను నీవు చిలుకచే పలికింపదలచినమాటలను ఉచ్చరింపుము. చిలుకను నీమాటలను వినునట్లుచేయుటకే పంజరము చుట్టును నల్లనిగుడ్డను కట్టుటయొక్క ఉద్దేశము. అట్లు గుడ్డచుట్టనిచో చిలుక దిక్కులుచూడగలదు. నీవు చెప్పెడిమాటలను వినిపించుకొనదు. శబ్దము హెచ్చుగనుండుతావున చిలుకను ఉంచకుము. వీథికిచేర్చిన కిటికీదగ్గర చిలుకపంజరమునుంచరాదు. ఆటలాడుకొను పిల్లకాయలచప్పట్లును, గోవిందలను వినబడుతావున చిలుకను అసలు ఉంచరాదు. ఉంచినచో అర్థములేనికేకలనే అదియు ప్రతిశబ్దించును. అట్లగుచో ఆచిలుక పలుకులు ముద్దువచ్చుటకుబదులు అల్లరిదై సహింపరానివగును."

*—The Hindu Illustrated Weekly.*

## స్త్రీ ప్రేమాస్వరూపిణి:—

"ఉన్నతికొఱకు ఆశ, అభిరుచి అనునవియే పురుషప్రకృతిలోని మూలధర్మములు. పురుషుడు కీర్తిని, సంపదను వాంఛించును. ప్రపంచమునుగూర్చిన తలంపులలో తావు నభిలషించును. తోడిమానవులపై యాధిపత్యమును కోరును. ఇక స్త్రీజీవితమన్ననో ప్రేమనుగూర్చిన ఒకచరిత్రమే. ఆమెకు హృదయమే సర్వప్రపంచమును. హృదయముతోడనే ఆమెకు సన్నిహితసంబంధము. హృదయసామ్రాజ్యమును పరిపాలింప నామెకు కోర్కె. ఆసామ్రాజ్యమునందలి గుప్తమగు నిధులను కొల్లగొట్టవలెనను తీవ్రకాంక్షాక్షుభితచిత్త. సానుభూతిరూపమగు సేవాదళములను దండయాత్రకై పంపును. ప్రేమవ్యాపారమునకై తన ఆత్మను, జీవితమును కూడ బేహారమను నౌకపై నెక్కించును. ఈనౌక దురదృష్టవశమున తుపానుచే ప్రక్కలైనచో ఆమె జీవితము దుర్భరము. అంతటితో 'హృదయవ్యాపారము'న నామె దివాలా తీసినట్లే. ప్రేమవ్యాపారములో

క్లిష్టపరిస్థితు లేర్పడినచో ఆమె హృదయమనుకోట పరరాజుచే పట్టుకొనబడి, కొల్లగొట్టబడి నిర్మానుష్యము గావింపబడినట్లే. ఇట్టి దురదృష్ట దేవతాహస్తనిర్ముక్తాశనిని ధరింపఁగల్గిన ప్రకృతిగలది హైందవ స్త్రీయే. కనుకనే స్త్రీ తుమామూర్తి అనుట."

—అకుండి వెంకటశాస్త్రి

"పరిశీలన":—

"గతమాసపు గృహలక్ష్మిలోని "పరిశీలన" అనువ్యాసము పఠించితిని. అందు పదియేండ్లబాలికలైనను బరిణయమన్నను పురుషులకన్నను సిగ్గుపడుట, మాట్లాడకుండుట ఇది సత్ప్రవర్తనమని వారి యభిప్రాయమై యుండుననియు, అద్దానిని సత్ప్రవర్తనమనుటకంటె ఉన్మాదమన్న బాగుండుననియు వ్రాసిరి. మరియు ఉపాధ్యాయుఁడు పాఠముచెప్పుచో యుక్తవయస్సుగలిగిన యువతియేయుగుఁగాక తలవంచికొని కాలు వేల వ్రాయుచో నిఁక నుపాధ్యాయుఁడన్నను పాఠమన్నను ఏమియో తెలియకున్నదికావున స్త్రీలిట్టి యనవసర లజ్జాదులఁబోఁగొట్టికొన యత్నింపవలెననిరి. కాని ఉత్తమవంశజాతలగు యువతీమణులకు లజ్జావినయశీలాద్యాదిగుణములే పెట్టనిభూషణములు. అట్టిపవిత్రమైనలజ్జను వీడుటయం దెంతటి గొప్పతనమున్నను అది పరిత్యాజ్యమను హేతువునైయున్నది. మరియు తలవంచినంతమాత్రమున నుపాధ్యాయుఁడన్నను పాఠమన్నను నేమియో తెలిసికొనలేనంత మూఢురాండ్రుగ స్త్రీలున్నారనితలంచుట పాడిఁగాదు. అయినను స్త్రీ తన సహజమగులజ్జను వీడవలెనన్న మున్ముందు పురుషుఁ డుత్తముడైయుండవలెను. తనయెట్టయెదుట నిలువబడిన యువతీమణినిఁ దనకన్నబిడ్డవలెనో లేక సోదరివలెనో వాత్సల్యముతోఁ జూచుటకుమారు కుదృష్టితో చూచుచు తాను నీతిబోధనొనర్చు ఉపాధ్యాయుఁడనుమాటమరచి హైన్యమగు నీచపుబల్కుల నుగ్గడించుచు స్త్రీల బుద్ధినిఁ జెడుమార్గములకుఁద్రిప్పు మహానీయులుగలరు. ఇటీవల నొకమాసమున్నంటొనర్చిన యకృత్యము గృహలక్ష్మి తెలుగువారికి విన్పించినది. ఇట్టివి వినుచుచూచుచున్న హైందవనారీమణులు గుండెబెదురులేక విద్యనభ్యసించుటెట్టులో దలియకున్నది. అదియునుంగాక తలపైకెత్తి ఉపాధ్యాయుని మోమువంకఁజూచుచున్న విద్య వచ్చుటయు తలవంచిన విద్యరాకుండుటయునా? గురుభక్తి, విద్యాసక్తియున్నచో ఎటులైన విద్యరాగలదు. స్త్రీలు లజ్జించుటకును భయపడుటకును కొందఱు దుర్మార్గులగుపురుషులే కారణము. లజ్జించుటయే ఉన్మాదమగుచో ఇక కానిదేది? సిగ్గుపడుట స్త్రీలు ఈనాఁడు క్రొత్తగ నేర్చినవిద్యగాదు. అది వారికి పుట్టుకతో వచ్చుచున్నది. పూర్వపుకవీశ్వరులు స్త్రీలు లజ్జించుట నెంతయో శృంగారముగ వర్ణించియుండిరి. మరియు నాబిడియమే నాడాలయినదని మహాత్ముఁడు తనఆత్మకథయందు వ్రాసియుండెను. పురుషులకే బిడియము డాలైనప్పుడు స్త్రీకిమాత్ర మేలకాదు? స్త్రీకి ధైర్యసాహసాదిగుణములవలెనే లజ్జయు నొక అలంకారమయి యున్నది. ఎంతవిద్యాధికురాలైనస్త్రీయైనను పురుషునియొద్ద నిర్లజ్జగనుండుటకన్న కొలదిగ లజ్జావనతవదనలై యుండుటయే మేలని మదభిప్రాయము. అట్లని పురుషులతో సంభాషింపరాదనియు వారికి కనబడరాదనియు కాదు నేచెప్పునది. కొందరు ఘోషాలోనుండుస్త్రీలు స్త్రీలనుచూచినను బిడియపడెదరు. ఏదేనిసభకు వెళ్లినచో భయపడుట, మాటలాడలేకపోవుట మొదలగువానికి లోనయ్యెదరు. అట్టిస్త్రీలను ఘోషానుండి విముక్తురాండ్రుగఁజేసి దేశసేవకును, ఉన్నతవిద్యాభ్యాసమునకును ప్రతిబంధకమైనఘోషాను నిర్మూలింప సమకట్టుట ఉత్తమపురుషుల విధియైయున్నది."

—ఉపాకల రత్నమాల.

గాంధీమహాత్ముఁడు: ఏసు క్రీస్తు:—

"రాజకీయములందు గాంధిగారివంటి నాయకుఁడిదివర కెన్నఁడును దొరుకుటనుగూడ కలిగియుండలేదు. అటులనే గాంధిగారు లండనుకు బయలు దేరునపుడు భారతీయులకొసగిన అంత్యసందేశముగూడ అపూర్వముగా

మన్నది. నేను లండనునుండి మరల భారతదేశమునకు వచ్చినపుడు నేను లండనులో మీలాభములను భంగపరచితినట్లు మీకుతోచునెడల మీరునన్ను చంపివేయుడు. మీరు నన్ను చంపివేసినను గూడ అదియొక దౌర్జన్యమని, నేను భావింపను అని గాంధిగారపుడు తెలిపియుండెను. ఏసుక్రీస్తు 2000 యేండ్లక్రితము రోమనులు కొరతవేసినపుడు "వారుచేసినపని యెట్టిదో వారు గ్రహించియుండలేదుగాన వారిని క్షమించుము." అని చేసిన ప్రార్థనకు ఇపుడు గాంధిగారొసంగిన సందేశము వింతప్రతిధ్వనియని మీరేగ్రహింపగలుగుదురు."

—బ్రహ్మండు హెబ్రక్షీ.

## నేటి స్వాతంత్ర్యసమరము స్త్రీలు:—

ది 1-11-31 తేదీని ఇచ్ఛాపురమునజరిగిన గంజాంమండలాంధ్రమహిళాసభాహ్వానసంఘాధ్యక్షురాలి ఉపన్యాసమునుండి:

"ఓ స్త్రీరత్నములారా! మన పూర్వగౌరవస్వాతంత్ర్యములను కొనియాడుచు కాలముగడిపిన ప్రయోజనములేదు. ప్రపంచములో మన మెుక జాతివారమని స్వతంత్రులమని తలయెత్తితిరుగుదమన్న మెుదట మన సాంఘికదురాచారములను నిర్మూలింపవలెను. స్వరాజ్యసిద్ధికై మహాత్ముడువిధించినవిధానమును కార్యరూపమున బెట్టవలెను. కొట్లకొలది తోడిమానవులను అంటరానివారలుగాజూచుటకన్న ఘోరపాతకమింకొకటిలేదు. దేశదారిద్ర్యమునకును, మన అధఃపతనమునకును గారణభూతములయిన సారాయి, గంజాయి, నల్లమందు మెుదలగు మాదకద్రవ్యములను మన సోదరసోదరీమణులు సేవింపకుండజేయుట మన పరమధర్మము. గౌరవప్రదమగు గృహపరిశ్రమములలో నూలువడకుట ముఖ్యమైనది. ఖద్దరువస్త్రములుధరించుట మన మతధర్మమనియు, దేశకల్యాణసాధనమనియు, స్వరాజ్యసిద్ధికి మెుదటిసోపానమనియు యెరుంగవలయును. విదేశవస్త్రములే గాక సబ్బులు, సువాసనతైలములు, ఫేసుపౌడర్లు విలాసవస్తుసముదాయమంతయు సంపూర్ణముగా బహిష్కరింపవలెను. మనలో యేకొలదిమందియో విద్యావతులై పైకివచ్చినంతమాత్రమున ఆంధ్రస్త్రీలోకమెల్ల మేల్కాంచినదనుకొనుట వెఱ్ఱిభ్రమ. మనలోగల మూఢవిశ్వాసములను తొలగించుటకు పల్లెలందును, పట్టణములయందును స్త్రీసమాజములనుస్థాపించి, స్త్రీలలో విద్యానురక్తి, జాతీయభావము, శిశుపోషణ మెుదలగునవి పురికొల్పవలయును. మహాత్ముని ఉద్యమము భారతదేశమునకు స్వాతంత్ర్యమొసంగినను ఒసంగకపోయినను భారతమహిళాస్వాతంత్ర్యముమాత్ర మొసంగినదని నేను నొక్కిచెప్పుచున్నాను. గత లవణసత్యాగ్రహమందు మన ఆంధ్రస్త్రీలుజూపిన త్యాగధైర్యసాహసాదులు మిక్కిలి అద్భుతములు. పడిన కాయక్లేశము లపారములు. మన యాంధ్రయువతీలలామలు, కుసుమసుకుమారకోమలాంగులు సైతము పోలీసువారి దారుణమగు లాఠీదెబ్బలనెదిర్చి మనోవాక్కాయకర్మంబుల జంకరుంగక రణరంగమందు నిలచుటచూడ మన పూర్వ ఆంధ్రవీరవనితలను స్మరింపజేయుచున్నది. మనము దేశదాస్యవిముక్తికొరకు ఇప్పటికి పడినకష్టములు, ప్రాణాపాయములు సముద్రమునకు ఉప్పుదర్శనమువంటిది. మాతృదేశస్వాతంత్ర్యసిద్ధికి ముందు మనమింకను కడుయిడుములనుగుడువ సర్వసంసిద్ధులమై యుండవలసియున్నది."

—తూములవరహాలమ్మ.

## స్త్రీ ప్రజావతియై సుఖించునా? పతిప్రాణయై సుఖించునా?:—

"ఈవ్యాసము పైన తెలియపరచినరెండువిషయములకు ద్వైధీభావముకల్పించి, వికల్పముగాజేయునదిగాదు. సర్వసాధారణముగా పతిప్రాణ ప్రజావతియే, ప్రజావతి పతిప్రాణయేగావచ్చును. కాని దీనిచర్చించు విషయము పరిణామసుఖమునుగురించి. మెుట్టమెుదట ప్రజావతియందునను పతిప్రాణయందుననుగల ప్రజా

శయముల వేరువేరుగాగమనింతము. ఒక సామాన్యకుటుంబమునకు జెందినయువతి గర్భవతిగాకున్న జెండడి గౌరవమెల్ల రెరింగినదే. ప్రతిస్త్రీయును ముక్కున వ్రేలిడుకొని 'నాల్గుసంవత్సరాలైంది కాపురానికొచ్చి, బిడ్డాలేరు, పాపాలేరు' అని యెత్తిపొడుచును. తన కత్యంతముగూర్చుతల్లిగూడ 'మాఅమ్మాయికడుపున యింత వలుసైనాపడదాయె'నని విచారించుచుండును. హైందవసనాతనధర్మముగూడ పుత్రులులేనివారికి గతులులేవని తెలుపుచున్నవి. పెద్ద లనపత్యునింట మంచితీర్థమైన త్రాగరు. అదియుంగాక సంతానమనునది దంపతుల ప్రేమ బీజమున నుద్భవించినమొలక. ఇక పతిప్రాణ. పతిప్రాణ సంతానవతియైనపిమ్మటనే గౌరవింపబడునుగాని యంతదనుక నాస్కారములేదు. అదియుంగాక నాపె భర్తృసహధర్మచారిణిగా గౌరవింపబడినమాత్రమున నేమాయెను? సర్వవిధముల పతి కనురక్తగావలయునుగదా! ఏజడుడు తనయువతి యౌవనలతాలక్షితములని సంతానముగోరకుండును? వంధ్యయగుటచేనేమి ఋతరియే యితరకారణములచేనేమి సంతానహీనురాలగు వారి మణి తనయందు భర్తకనురాగముగలిగింపనేర్చునా? ఇవి మనకిట నప్రస్తుతములు. ఒకపతిప్రాణ ప్రజావతియై దైవవశంబునగాని లేక మానవయత్నమునగాని భర్తృవియోగమును జెందినదనుకొందము. అట్టియెడ ఆమె యేమిచేయవలెను? వివాహితయై వేరొకభర్తృసమక్షమున సుఖింపవలెనా? లేక తనసర్వస్వము పుత్రులుగానే భావించి శేషించిన తనజీవిత మిట వెళ్లబుచ్చుకొనవలెనా? వీనియందుగల తరతమభావము విమర్శనీయము."

—హరిరాధాకృష్ణమూర్తి.

పెండ్లికొడుకులపై పన్ను:—

"సింధుదేశముందలి హైదరాబాదునగరమున ఆనందకరవిషయములు జరుగవని దురభిప్రాయపడువారు ఇప్పుడే అచ్చటినుండిచేరిన పెండ్లికొడుకులపై పన్ను వేయవలయునని వార్తనుచూచి తమ అభిప్రాయమును మార్చుకొనవలెను. హైదరాబాదు మునిసిపలుసంఘసభ్యుడు ఒకానొకబ్యారిష్టరు మ్యునిసిపలుసంఘసమావేశమున పెండ్లికొడుకులపై పన్ను వేయవలయునను తీర్మానమునుపపాదింప నోటీసునిచ్చినాడు. ఈతీర్మానము ఒకే కార్యముతో రెండులాభములను పొందజూచునది. మ్యునిసిపలువారి ఆదాయమునందలి లోటునుపూర్తి చేయును, హెచ్చుకట్నములను తగ్గించును. కాని నిజమరయుచో ఈరెండపకాంక్ష నెరవేరజాలదని తెలియగలదు. కట్నము తీసికొనువాడు ఈపన్నునుగూడ మామగారినెత్తిని రుద్దును. అవసరముగావున పెళ్లికూతురు తండ్రి దీనిని భరింపకతప్పదు. ఇట్టితలపెట్టినపన్ను ఆడుపెళ్లివారికి ఎక్కువ అవిధిని కూర్చునదిగానున్నది. ఆశయముకూడ నెఱవేరజాలదు."

—*The Statesman.*

"దేవలోకసంబంధమైన ఉద్రిక్తత":—

"నవంబరుమాసపు గృహలక్ష్మిలోని డైరీలో సెప్టెంబరు 30-వ తేదిని మీరువ్రాసిన విశేషంకోసరమై మిమ్మల్ని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. ఆఅద్భుతఅతిలోకచర్య రాజోలులోనే జరిగింది. వాళ్లు కాపురమున్నయిల్లూ ఆమె ప్రాణత్యాగంచేసిన రెట్టమెదుటనున్నయ్యి నేను చూశాను. ఆసంగతి జరిగినప్పుడామె నెలుపలఉంది. 3 నెలల పసిపిల్లగల బాలింతరాలూ, అప్పుడు. వాళ్లు చాలాడబ్బుఉన్నవాళ్లు. ఆమె వంటిపైన అప్పుడు 1000 రూపాయిలవగలుదాకా వున్నాయి. తరువాతసుఖజీవనం చెయ్యడానికికూడా యేమీ ఆమెకు లోపంలేదు. కాని ఆ ప్రేమహృదయంలోవున్న ఒక దేవలోకసంబంధమైన ఉద్రిక్తత ఆమె నల్లాచేయించింది. అప్పుడామెకు ఒకకావ్యకుసుమాంజలినిచ్చి తర్పణంచెయ్యాలనిపించింది....అంతదూరాన్ని వున్న మిమ్మల్ని ఈసమాచారం ఆకర్షించడం, అది మీరు గృహలక్ష్మిలో ప్రకటించెయ్యడం, మీదయాలలితమైన హృదయాన్ని ప్రతిఫలిస్తోందనుకొంటా."

—కస్తూరి రాజామాణిక్యము.

**పెళ్లిళ్లపై పన్ను:—**

"బొంబాయి మునిసిపలుసంఘమువారు ఆదాయము నభివృద్ధిపఱచుకొనుఆకాంక్షతో కొన్ని విచిత్రమైన పద్ధతులతల పెట్టినారు. అందు వివాహములపై పన్ను ఒకటి. ఈపన్నువిధించు సంకల్పముచే బొంబాయి హిందూదేశమునందలి జన్మనిరోధనోద్యమమునకు ప్రోత్సాహముకల్గించు మునిసిపలుసంస్థలలో పురోగామి కాగలదు. విదేశములలో కొన్నిటియందు బ్రహ్మచారులపై పన్నుగలదు. బొంబాయి అందుకు విరుద్ధముగా వివాహములపైపన్ను తలపెట్టినది. ఇది ఒరిజినల్ గానున్నది. ఇది వివాహవ్యయములందుజరుగు దుబారాను ఆధారముగ చేసికొని వేయబడుపన్ను అగుచో కొంత సంఘసంస్కరణము జరుగగలదు. కాని మునిసిపలుఆదాయముమాత్రము పెరుగజాలదు."

—*The Madras Mail.*

**"భారతజాతికి యథార్థమగు ధర్మగ్లాని":—**

"భారతదేశమున ప్రాముఖ్యమునొందియున్న హిందూమహమ్మదీయమతములు పరస్పరవైరుధ్యము గలిగియున్నను మాతృస్థానమగు స్త్రీజాతిని దాస్యశృంఖలానిబద్ధుల గావించుటయం దుభయమతములవారును ఏకోన్ముఖముగా బని చేసిరి. మహమ్మదీయులు బాహ్యప్రపంచమునుండి తప్పించి స్త్రీజాతిని బురఖాలతో బంధించిరి. అర్ధాంగియని స్త్రీనిసంబోధించు హైందవులు స్త్రీజాతికి సహగమనము నిర్బంధవైధవ్యము విపరీతనిబంధనముల గల్పించుటయే గాక 'నస్త్రీస్వాతంత్ర్యమర్హతి' అను సూత్రమునుగల్పించి ఈశ్వరసృష్టిలో సగభాగమగు స్త్రీజాతికి మహావమానమొనర్చిన భారతజాతికి యదార్థమగు ధర్మగ్లాని ఇంతకన్న వేఱుకలదా?"

—నవయుగ.

**కృష్ణాపత్రికవారి చౌర్యము:—**

"యీమధ్యకృష్ణాపత్రికలో గ్రంథచౌర్యం అనే విషయంగురించి కొంతప్రకటన జరిగింది. నిజంగా గ్రంథచౌర్యం అనేది చాలా అసహ్యకరమైనవిషయం. ఇంకొకరి తెలివితేటలు తనవిగా లోకం అనుకోవాలని తలపడంకన్నా హీనం సాహిత్యజగత్తులో వుండదు. గ్రంథచౌర్యం చేశారన్న నేరముమీద కృష్ణాపత్రికలో కొందరిని పట్టుకుయేకేరు. ఆకవులు, గ్రంథకర్తలు ఆదేవిధాన్ని చౌర్యంచేసివుంటే నిజంగాతప్పే. అందుకు వాళ్లు పశ్చాత్తాపపడాలి. కాని కృష్ణాపత్రికలో యేతప్పునుగురించిన విమర్శనలు వెలువడ్డాయో ఆదేతప్పును "కృష్ణాపత్రిక" నేటివరకూ సాగిస్తూనేవుంది. ఇదియెవ్వరకూ తెలియదనా, లేకపోతే ఆంధ్రపత్రికలలో పెద్దన్నయ్యను నేనేగదా, నాకలానికి యేమిఅడ్డు అనా ఇలాగుచెయ్యడం? బొంబాయి నగరంనుంచి వెలువడుతూవున్న "ఫ్రీప్రెస్ జర్నల్" ("*Free Press Journal*") దైనికపత్రికలో కథారూపకసంపాదకీయాలు తరుచు వెలువడుతూవున్నవి. వాటిని అలాగునే తర్జుమా చేసి యీకథారూపకసంపాదకీయము ఫలానిపత్రికనుండి తర్జుమాచెయ్యబడిందనిగాని ప్రధానాంశం ఫలాని పత్రికలోనిదనిగాని వ్రాయకుండా స్వంతంగా తమ కార్యాలయంలోనే మాతృక తయారు అయినట్టుగా-పెద్దఅచ్చులో సంపాదకీయంప్రక్క వేసికొంటూవుంది. కృష్ణాపత్రిక సంపాదకీయములోనికికూడా యెగబ్రాకిన విశ్వబిక్షువు కాపోను, కాస్త ఫ్రీప్రెస్‌లోనిదినా సూచింపబడింది. దీనికి కృష్ణాపత్రిక యేమంటుందో! తన్నుతాను విమర్శించుకుంటుందా? లేక "తప్పులెన్ను వారు తమతప్పు లెరుగరు." అన్న వేమనపద్యములోని సత్యాన్ని ఋజువుచేస్తుందా? ఆ! ఇంతకూ మరచాను. యిది పత్రికచేసింది - గ్రంథచౌర్యం కాదుగా? ఇది పత్రికాసంపాదకీయచౌర్యము! అనుభవజ్ఞులగల ప్రతిక *News copyright* యిరవైనాలుగుగంటలతోనే అంతమౌతుందని చెప్పినా చెప్పవచ్చు!"—ఆనందవోధిని.




### ఒకే కాన్పున ముగ్గురు బిడ్డలు:—

కాండేమండలమునకు చెందిన భాగ్‌డంగాయందు పలుసరకులు అమ్మువాడగు హరిచరణహాతియను వాని భార్య అక్టోబరు 27-వ తేదీని ఒకేసారి ముగ్గురుబిడ్డలను ప్రసవించినది. ముగ్గురును ఆడపిల్లలు. ఇందు ఒకపిల్ల బాగుగ ఎదిగియుండెను. మిగిలిన ఇరువురును మిక్కిలి అతిపేదగానుండిరి. ఈఅతిపేదపిల్లలలో ఒకపిల్ల పుట్టినరెండవనాడును, రెండవపిల్ల మఱిరెండురోజులకును చనిపోయెను. మూడవపిల్ల సజీవయైయున్నది. తల్లి ఆరోగ్యముమాత్రము సరిగాలేదు.

### ఆతేసి వ్రేళ్లుగల నాలుగు చేతులు, నాలుగు కాళ్లుగల బిడ్డ:—

సెంట్రల్ పెరిషియాకు చెందిన కర్మనుదగ్గిరనున్న పారిజ్ అను చిన్నపట్టణమున ఒకస్త్రీ ఒకమగ శిశువును ప్రసవించెను. ఆబిడ్డకు నాలుగుకాళ్లున్నవి, నాలుగుచేతులున్నవి. ఒక్కొక్కచేతికి ఆరేసి వ్రేళ్లున్నవి. ఈవింతబిడ్డడు మృతుడైపుట్టెను. ఇది రూటరుపంపినవార్త.

### మేకపోతు పాలు ఇచ్చుట:—

కృష్ణనగర్‌లో ఒకమేకపోతుగలదు. అదిమిక్కిలి వయసుముదిరినదికాదు. ఈమేకపోతునకు పోతుమేకకు ఉండు అవయవములకుతోడు పొదుగుకూడగలదు. దాని ఆపొదుగు ఎల్లవేళల పాలతో నిండారియుండును. ఒక్కొక్కప్పుడు ఆమేకపోతు తనపొదుగుపాలను తానేతాగుచుండును. ఈవింతను ప్రజలు విరగబడి చూచుచున్నారు.

### సైకిలుమీద ఎడతెగక నలుబదియొక్కగంట:—

రంగూనులో బెంగాలుయువకులు సైకిలుపందెమువైచిరి. ఎడతెగక సైకిలుతొక్కుచునే ఉండవలెను. యస్.యన్. డే అనుయువకుడు ఎడతెగక నలుబదిగంటల ఏబదినిమిషములు సైకిలుతొక్కుచు ఆపందెమున విజయముబడసెను.

### తేనెటీగలు:—

కొన్ని కొండలమీదను, కొన్ని నేలమీదను, కొన్ని చెట్లమీదను తేనెపట్టులు పెట్టును. రాణీఈగ తప్ప తతిమ్మాపన్నియు ప్రతివసంతకాలములో చచ్చిపోవును. వసంతకాలమయినవెంటనే ప్రతిరాణీఈగయు

గ్రుడ్డు పెట్టును. ఆగ్రుడ్లు పనిచేయు తేనెటీగలగును. ఇవి పెద్దవికాగానే ఆహారము వెతకి గూటికి చేర్చును. వేసవికాలమంతయు జీవించి శీతాకాలములో రాణీఈగ తప్ప అన్నియు మరణించును. ఈఈగలు తమఆహారము తాము తినలేనప్పటికి చిన్న ఈగలను పోషించగలవు ఒకగుంపు పెద్దదయినప్పుడు వాటిలో రాణీఈగ కొన్ని ఈగలను తీసుకుపోయి వేరొకచోట నివాస మేర్పరచుకొనును. ఇది తేనెపువ్వులనుండి తీసిన మైనముతో తయారుచేసినగూటియందు ఉంచును. ఒక్కొక తేనెపుట్టయందు 80,000 ఈగలు నివసించుచుండును. ప్రతిపుట్టయు ఒక పట్టణమువలెనుండును. ఆపట్టణములో న్యాయచట్టములు ఆచారములు కలవు. వాటిలో రాణీ, రాణీకుటుంబము, పనివాళ్ళుందురు. ఆపట్టణపునివాసు లొక్కొక్కరు ఒక్కొక్కపని నెరవేర్చుచుందురు. కొందరు మైనము చేయుదురు, కొన్ని మైనమును గూడుక్రింద తయారుచేయును, కొన్ని తేనె పువ్వులనుండి చేర్చును, కొన్ని పుప్పొడిని తీసి వాటిపిల్లలను పోషించును, కొన్ని వేటకవెళిపోయి తిరిగివచ్చి ఎచ్చట మంచిపువ్వులుండునో చెప్పును, కొన్ని గూడును శుభ్రపరచుచుండును, కొన్ని పారా కాయుచుండును, మఱికొన్ని రాణీబిడ్డలను పోషించును. బాగుగ తయారైన పుట్టయందు 60,000 చిన్న (సొరుగు) గూళ్ళుండును. ప్రతిగూడు ఆరుపలకలుగలిగియుండును. వాటి కోణములు కొద్దిగా నొక్కియుండును. ఇట్లు చేయుటవలన కొద్దిస్థలములో ఎక్కువ తేనెపట్టును. రాణీఈగ పిల్లలనుపెట్టును. ఈపట్టణమందు నివాసులు ఎక్కువకాగానే క్రొత్తరాణీనుంచి పాతరాణీ తన అనుచరులైన ఈగలతో వేరొకచోటుకుపోయి క్రొత్త పుట్టనుపెట్టును. ఇవి పట్టణమువదలకపూర్వము 120 పౌనుల తేనెచేయును. అనగా ఆఈగలకన్న 12 రెట్లు ఎక్కువ తేనెను తయారుచేయును. ఈ తేనెయంతయు పాతపట్టణమునకై నిలువయుంచి వెడలిపోవును. ఎక్కువ రాణీపిల్లలు పుట్టిన సేవకులు పనికిరాని రాణీపిల్లలను చంపివేయుదురు. రాణీలన్నియు చచ్చిన సేవకులు ఒకచిన్న ఈగను ప్రత్యేకఆహారమునిచ్చి పోషించెదరు. అట్లు పెంచినయెడల ఆఈగ రాణీఈగ అవును. లేకున్న సేవకుడగును. ఈతేనెటీగలు ఎల్లప్పుడుసంతోషముగనుండుటకు ప్రయత్నించును. మనము ప్రస్తుతపు విషయములకొరకు నాలోచించెదముగాని ఈతేనెటీగలు జరుగబోవువాటికై పనిచేయుచుండును.

—కో కా అఖండ కృష్ణవేణమ్మ.

### చేతిగాజులో చిన్న పాము:—

ఖర్గపురముచెంతగల హారతార గ్రామములో రాజేంద్రమహతో నివసించుచుండెను. రాజేంద్రునిభార్య పద్మావతి. పద్మావతి నవంబరు మూడవతేదీని వడ్లుదంచుచుండగా తనచేతిగాజునందొకదానియందు తల చెంట్రుకనుబోలిన సన్నని పొడుగుపాటి ఆకార మేదియో కదులుచున్నట్లు కనుగొనెను. నిదానించిచూచెను. ఆఆకారము కదలుచు నేయుండెను. వెంటనే ఆమె తనగాజును పగులగొట్టెను. తలవెంట్రుకనుబోలిన ఆసన్నని పొడుగుపాటి ఆకారమువెలుపడి కదలనారంభించెను. గాలిపీల్చికొల్చొని అది కొద్దికాలములో పదిఅంగుళములపొడుగుపాము అయ్యెను. ఆగాలిమేపరి ఆగాజులో ఎట్లు చిక్కుకొనెనో? అందు ఎన్నాళ్లుగానుండెనో? ఎట్లుజీవించియుండగలిగెనో? ఈవింతచూడవచ్చినవారిలో నొకరు ఆపామునుచంపిరి. ఈవింతసమాచారమును వినుచునే హారతార గ్రామమునందలియు, ఆపరిసర గ్రామములయందలియు స్త్రీలు తమచేతిగాజులను చిట్లగొట్టుకొనిరి.

### కుక్కలకు, పిల్లులకు హోటలు:—

చికాగోలో 14,5000 పౌనులఖర్చులతో కుక్కలకు, పిల్లులకు హోటలుకట్టబడినది. ఆజంతువులకు వలయు సౌకర్యములన్నియు అందు సమకూర్చబడినవి. స్నానమునకు సబ్బులు, వేడుంగదులుగలవు.

# పత్రికాపరిచయము

## నవయుగ:—

ప్రతినెల 10, 25 తేదీలలో వెలువడు జాతీయపక్షపత్రిక. జాతీయ, సాంఘిక, సారస్వతాదివిషయము లను స్వతంత్రముగ, నిష్పాక్షికముగప్రకటించి దేశభాషాసేవలచేయుటయే నవయుగపత్రిక ముఖ్యోద్దేశము. ఈపత్రిక తొలిసంచిక అక్టోబరు 25-వ తేదీని వెలువడినది. రవీంద్రుడు, గాంధి, గెటీ, జోన్ ఆఫ్ ఆర్క్, మేజినీ మున్నగు ప్రపంచవిఖ్యాతిగన్న మహనీయులవాక్యరత్నములు 'స్వర్ణకణములు' అనుశీర్షికతో ఇందు ప్రచురింపబడినవి. అవిచాలబాగున్నవి. 'నవయుగారంభము' సంపాదకీయము. శైలి పటుత్వముగలిగియున్నది. ఈసంపాదకీయమునుండి కొంతభాగము పుష్పచయములో ఉద్ధరించితిమి. 'విమర్శనలు' అనుశీర్షికతో చేయ బడిన సంపాదకీయవిమర్శనములు చక్కగనున్నవి. ఇతరములగు వ్యాసములుగలవు. నవంబరు 10-వ తేదీని వెలువడిన రెండవసంచికయు యథారీతిని ఒప్పుచున్నది. గ్లేజుకాగితములమీద ఫూల్‌స్కాప్‌టావుసైజున ముద్రింపబడి పత్రిక సుందరముగనున్నది. 'డేవిడ్‌సన్' గ్రంథకర్తలగు గద్దె లింగయ్యచౌదరిగారు సంపా దకులు. చిరునామా: ఎలమఱ్ఱు, కృష్ణాజిల్లా. 'గగనతలముమ్రోగ్మోవగ గంఠమెత్తి ఆంధ్రజగమునిండ స్వేచ్ఛా గానరవమునించు' పవిత్రోద్దేశముతో ప్రారంభింపబడిన ఈపక్షపత్రిక ఆంధ్రప్రజాసంఘమువారి ఆదరణకు పాత్రమగుగాకయని కోరెదము.

## అర్చకపత్రిక:—

ఆంధ్రదేశమునందలి అర్చకసంఘాభివృద్ధికొఱకు ప్రచురింపబడు మాసపత్రిక. ఐదవసంపుటము ఒకటి, రెండు సంచికలు సెప్టెంబరు, అక్టోబరుమాసములవి మాకార్యాలయమునుజేరినవి. పత్రికాధిపతులు శ్రీయుత వేదాన్తం శ్రీనివాసాచార్యులుగారు. సాలుచందా రు. 1—8—0. డబుల్ రాయల్ సైజున గ్లేజుకాగిత ములపై ప్రచురింపబడుచున్నది. చిరునామా: మేనేజరు, అర్చకపత్రిక, బెజవాడ.

## పశ్చిమగోదావరి సహకారపత్రిక:—

లోకకల్యాణమునకు మూలాధారమగు సహకారోద్యమాభ్యుదయమును కీర్తించుమాసపత్రిక. పశ్చిమ గోదావరిమండల సహకారకేంద్రబ్యాంకువారితరఫున ఏలూరునుండి ప్రచురింపబడుచున్నది. సంపాదకుడు చామర్తి వేంకటచలపతిరావుగారు. మాపత్రికాపీఠ మలంకరించుచున్న 10-వ నవంబరునాటి మొదటిసంపుటపు రెండవసంచికలో పెనుగొండనివాసులు శ్రీ చెట్లపల్లి శేషగిరిరావుపంతులుగారువ్రాసిన 'కర్తవ్యము', వసంతవాడ వాస్తవ్యులు శ్రీసామవేదం సత్యనారాయణమూర్తిగారువ్రాసిన 'సహకారోద్యమము: రైతులదురవస్థ'; లంకల కోడేరుగ్రామీణులు శ్రీద్రోణంరాజు నరసింహముగారువ్రాసిన 'సహకారపత్రములు: రిజిస్ట్రేషన్ ఫీజు' అను విష యములు చదువదగియున్నవి. సహకారమునకుసంబంధించిన ఇతరవ్యాసములుగలవు. సహకారోద్యమాభిమాను లాదరింపదగినపత్రిక. ఫూల్‌స్కాప్‌టావుసైజున గ్లేజుకాగితములమీద సుందరముగ ముద్రింపబడి ప్రచురింప బడుచున్నది. పెక్కువత్సరములు దేశసేవచేయునుగాక!

## స్వతంత్రరైతు:—

నెల్లూరునుండి ప్రతిశుక్రవారము ప్రచురింపబడుపత్రిక. సంపాదకులు దేశిరెడ్డి శేషురెడ్డిగారు. రాజ్యాంగ మునకు పూనాదిరాయియగు రైతును సేవించుటకుపుట్టినది ఈపత్రిక. సంవత్సరచందా రు 3-0-0. ఫూల్‌స్కేప్ టావుసైజున గ్లేజుకాగితములపై ప్రచురింపబడున్నది. ఈపత్రిక ౧-వసంపుటపు 6 (6-11-31) 7 (13-11-31)

సంచికలు మాకార్యాలయమునకు చేరినవి. ప్రస్తుతము నెల్లూరునందున్న వారపత్రికలన్ని ఇక నీ తెనుగుపట్టణము నందును లేవు. నెల్లూరుప్రముఖుల ప్రజాహితబుద్ధికిని, ఆమండలమునందలి రైతుజీవసంఘమున ఎసరేగిన ఉద్రేకమునకును ఈపత్రికల ప్రచురణ మొకనిదర్శనము.

నివేదన:—

ముఖ్యముగా ఆధ్యాత్మికధర్మము, సాంఘికపునర్నిర్మాణమును ప్రబోధించుటకు ప్రతిబుధవారము కాకినాడనుండి ప్రచురింపబడు పత్రిక. నవంబరు 18-వ తేదీని వెలువడిన రెండవసంపుటము 31-వ సంచిక అందినది. ఆదర్శమునకు తగినట్లుగ వ్యాసములున్నవి. సంపాదకుడు జి. సత్యనారాయణమూర్తిగారు. పోస్టేజి సహా ఈపత్రికసంవత్సరచందా కాకినాడలో రు. 1-0-0. ఇతరచోట్ల రు. 1-8-0 ఆంధ్రబ్రహ్మధర్మప్రచారక సంఘమువారు ఈపత్రికను ప్రచురించుచు దేశసేవ చేయుచున్నందులకు కొనియాడవలసియున్నది.

శాంతి:—

తోటపల్లికొండలలోని శ్రీమల్లికార్జునధారకు అనతిదూరమున నొకవిశాలసుందరారామమున నెలకొనియున్న శ్రీశాంతిఆశ్రమమునుండి ప్రకటింపబడు ఆధ్యాత్మికమాసపత్రిక. జాతిమతవర్ణశాఖావిభేదముల గణింపక ఎల్లరును శాంతిని అనుభవించుకొనుటకు పారమార్థికవిజ్ఞానమును ప్రచారముచేయుట దీనిప్రధాన గమ్యము. ఆంధ్రలోకమున సర్వత్ర ప్రతిపురుషుడును, ప్రతిస్త్రీయు, బాలబాలికలు సయితము శాంతిసందేశమును గ్రహించి ధన్యజీవులగుటకు ఈపత్రిక ఉచితముగనీయబడుచున్నది. పత్రికను గోరువారు ప్రచారపు కర్చులకు అనగా తపాలావ్యయములకుగాను సంవత్సరమునకు నాలుగుఅణాలు పోస్టుబిళ్లలను పంపుచు తమ పేరును, చిరునామాను, వయస్సును, మతసాంప్రదాయమును వివరముగ తెలుపవలెను. నిత్యశాంతియే పరమప్రాప్యముగాగల ఈసత్ చిత్ ఆనందమాసపత్రిక ఉచితముగ లభించుచున్నది గావున ఎల్లరు తెప్పించుకొని తగులాభమును పొందుదురుగాకయని కోరెదము. చిరునామా: శ్రీశాంతి ఆశ్రమము, పెద్దాపురము తాలూకా, తూర్పుగోదావరిజిల్లా.

కల్యాణి:—

సచిత్రమాసపత్రిక. సంపాదకులు గంటి సూర్యనారాయణశాస్త్రిగారు. సహాయసంపాదకులు పండిత పురాణం సూర్యనారాయణతీర్థులుగారు. శృంగారగ్రంథమాలను సంపాదించి అపూర్వప్రబంధములను వెలికితీసి సుందరతరముగముద్రించి తెలుగువారికిచ్చిన గంటి సూర్యనారాయణశాస్త్రిగారును, 'కామేశ్వరి' పత్రికను సంపాదించి ఆంధ్రపత్రికానిర్వాహకలోకమున పేరుమిగిలిన పండిత పురాణం సూర్యనారాయణతీర్థులుగారును 'కల్యాణి'కి కామందులైయుండ దాని జయనిర్వాహము నిశ్చయమైనవిషయము. ఈపత్రికారాజము యొక్క ఒకటిరెండుసంచికలు మాకార్యాలయమును అలంకరించినవి. దీనియుద్దేశములుచాల ఉత్కృష్టములుగానున్నవి. వేషాడంబరము పొంతబోవక విషయాడంబరముమాత్రముగలిగియుండుట పత్రికప్రధానోద్దేశము. నెఱవేరునుగాక! శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ, శ్రీయుతులు పురాణం సూర్యనారాయణతీర్థులు, ఆచంట వెంకటరాయసాంఖ్యాయనశర్మ, అధికార్ల సూర్యనారాయణరావు, సెట్టి లక్ష్మీనరసింహముగార్లవంటిపెద్దలీపత్రికకు వ్యాసభూషలర్పించుచున్నారు. పెక్కురుదయుపకులును వ్రాయుచున్నారు. కల్యాణి ఆంధ్రజన కల్యాణిరైయై పెక్కుపత్సరములు పేరుతోవర్ధిల్లి పండితులగు సంపాదకులప్రజ్ఞకు ప్రచారభూమియై విలసిల్లుగాకయని మనఃపూర్వకముగకోరెదము. ఈపత్రికకు సంవత్సరచందా రు. 2 మాత్రమే. విడిసంచిక అ. 4. చిరునామా: కల్యాణి, తపాలపెట్టె నెం. 110, మదరాసు.

# డైరి

## అక్టోబరు

**20:**—స్త్రీడుకన్య బంధువులలోనొకరు అస్పృశ్యుడగుటవల్లనువారిలోనొక గ్రామమున నివసించుచుంటచే గాంధిగారచట రైలుదిగి ఆబంధువునిఇంటికివెళ్లిరి.

**21:**—మంగుళూరులో మునిసిపలుఎన్నికలలో లలితాబాయి, శుభాదేవి, లూసీశ్రేష్ఠ, మేరీబ్రిటో అను నలుగురుస్త్రీలు అభ్యర్థినులుగానిలచిరి. మొదటిఇరువురును జయముగాంచిరి.

**22:**—హిందూస్థానీసేవాదళమహిళాశాఖాస్థాపకురాలగు శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయగారు అహమ్మదాబాదులో ఉపన్యసించిరి.

**23:**—కాంకెప్ నిల్లాడేప్రోస్టోఅను అమెరికాదేశపుస్త్రీ తనయిష్టముచొప్పున హిందూమతమును స్వీకరించెను. శ్రీనగరమునందలి సనాతనధర్మప్రతాపసభవారి యాజమాన్యమున హిందూమతస్వీకారమునకవసరమగు కర్మకాండ జరుపబడెను.

**24:**—బళ్లారి మ్యునిసిపలుఎన్నికలలో శ్రీమతి సింగనపల్లి మంగమ్మగారు పోటీచేసి గెలుపొందిరి.

:—చెన్నపురి స్త్రీలవిద్యావిషయకసంఘసంస్కారమహాసభ 6-వ వార్షికసమావేశము మంగంబాకములోని స్త్రీల క్రైస్తవకళాశాలయందు మిస్. మాగ్‌డొగల్ గారి యధ్యక్షతను జరుపబడెను.

**25:**—కీర్తిశేషురాలైన శ్రీమాగంటి అన్నపూర్ణాదేవిగారి చతుర్థస్మారకవార్షికోత్సవము ఆంధ్రదేశమున వివిధప్రాంతములందు జరిగెను.

**26:**—

**27:**—నరసారావుపేట న్యాయవాదులలో వృద్ధులైన తాడేపల్లి ఆంజనేయశాస్త్రిగారు చాలజబ్బుగనుండినందున వారి సహధర్మచారిణి శ్రీమతి మహాలక్ష్మమ్మగారు ఆదుఃఖమును భరింపజాలక నూతిలోబడి మరణించిరి.

:—శ్రీమతులు వెల్లంకి అన్నపూర్ణమ్మ, చింతా కనకమ్మగార్లు ఏలూరు మ్యునిసిపలుకౌన్సిలుకు సభ్యులుగా ఎన్నుకొనబడినట్లు గెజెటులో ప్రచురింపబడినది.

**28:**—కాలికట్టు మునిసిపల్ సంఘముఎన్నికలలో శ్రీమతి ఇ. నారాయణికుట్టిఅమ్మగారు విజయముగాంచిరి.

**29:**—

**30:**—కాకినాడలో పత్తి కనకమ్మగారి వితంతుశరణాలయములోనున్న బాలవితంతువ వరసమ్మగారికిని, దింట్యాల సుందరరామయ్యగారికిని వివాహముజరిగెను.

**31:**—లాహోరునజరిగిన పంజాబురాష్ట్రవిద్యార్థిమహాసభకు శ్రీమతి కమలాదేవి చటోపాధ్యాయిగారు అధ్యక్షతవహించిరి.

## నవంబరు

**1:**—గంజాముమండల రాజకీయమహాసభ. ఇచ్ఛాపురము. శ్రీమతి వేదాంతము కమలాదేవిగారు జాతీయపతాకను ప్రతిష్టించిరి.

:—గంజాముమండల స్త్రీలసభ ఇచ్ఛాపురముతెలుగుబాలికాపాఠశాలయందు శ్రీమతి వేదాంతము కమలాదేవిగారి అధ్యక్షతనుజరిగెను. శ్రీమతి తూముల వరహాలమ్మగారు ఆహ్వానసంఘాధ్యక్షురాలు.

**2:**—గుంటూరు స్త్రీల సనాతనధర్మమండలి షడ్వింశతివార్షికోత్సవప్రారంభము.

3:—గురువాయూరు సత్యాగ్రహములో పాల్గొనుటకై బొంబాయి సిక్కుసంఘమువారు సిద్ధముచేసిన జట్టులో ఆర్గురుస్త్రీలు గలరు.

4:—బి. అమృతమ్మాళ్ నెల్లూరుజిల్లా రెండవసర్కిలు బాలికాపాఠశాలల తనిఖీదారినిగ నియమింపబడినది.

5:—గాంధిమహాత్ముడు మామూలుదుస్తులతో సార్వభౌమదంపతుల విందునకువెళ్లెను. సార్వభౌమునితో సంభాషించెను. శ్రీమతి సరోజనీదేవిగారు మహాత్మునివెంటనుండిరి.

6:—దక్షిణాఫ్రికా సమ్మావేశమునకు నియమింపబడిన ప్రజాప్రతినిధులలో శ్రీమతి సరోజనీదేవిగారొకరు.

:—బెర్నార్డుషాదంపతులు గాంధిగారినిసందర్శించిరి.

:—గుంటూరు మునిసిపలుసంఘమునకు శ్రీమతి ఉన్నవలక్ష్మీబాయమ్మగారు పోటీలేక ఎన్నుకొనబడిరి.

7:—శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయగారు కాన్పూరుచేరిరి.

:—ఉభయగోదావరిమహిళాసభ శ్రీమతి ఆదుర్తి భాస్కరమ్మగారి అధ్యక్షతను ఏలూరునందు జయప్రదముగ జరిగెను.

8:—శ్రీమతి వేదాంతము కమలాదేవిగారికి భీమునిపట్నము కాంగ్రెసుసంఘమువారు సన్మానపత్రమునిచ్చిరి.

9:—ప్రత్యేకాంధ్రరాష్ట్రము నేర్పరుపవలెనని బొబ్బిలిరాజాగారుచేసిన ప్రకటన లండనులో ప్రతినిధుల కందరికిని బంపబడెను.

10:—

11:—

12:—శ్రీ పెనుబోతు వెంకటసుబ్బమ్మగారు బెజవాడపురపాలకసంఘమునకు పోటీలేకుండగ ఎన్నుకొనబడిరి.

13:—లండనులో శ్రీమతి సుబ్బరాయనుసతిగారిబసలో స్మట్సుగారును, గాంధిగారు చాలసేపుసంభాషించిరి.

14:—గంజాముమండలస్త్రీలసభ బరంపురము మహిళామందిరమున దావులూరి సీతలక్ష్మమ్మగారి యాధిపత్యమున జరిగినది.

15:—

16:—ఆంధ్రదేశమును ప్రత్యేకరాష్ట్రముగా నేర్పరుపవలెనని ఆంధ్రప్రతినిధు లిండియాసహాయమంత్రికి తెలిపిరి.

17:—లండను బ్యారిస్టరు పరీక్షలందు ఐదుగురు స్త్రీలు నెగ్గిరి. అందు నాగపూరువాస్తవ్యులగు ఖాన్ బహదూరు బైరాంజీగారికుమార్తె శ్రీమతి డినివవజా బైరంజీగారొకరు.

18:—లండను మార్లీకళాశాలయందలి స్త్రీలభారతసభలో గాంధిగారుపన్యసించిరి.

19:—

## వ్యాసములు వ్రాయువారికి

గృహలక్ష్మికి వ్యాసములు వ్రాయువారు కొంచము మార్జనువదలి కాగితమునకు ఒకతట్టు నసే సిరాతో విడివిడి అక్షరములతో వ్రాయవలెను. పెన్సిలుతో వ్రాయబడినవియు కాగితమునకు రెండుప్రక్కల వ్రాయబడినవియునగు వ్యాసములు చేకొనబడవు. వ్యాసములను గూర్చి ప్రత్యుత్తరములు కోరువారు రిప్లయికార్డువ్రాయవలెను. వ్యాసములు వాపసుకోరువారు తపాలాబిళ్లలు పంపవలెను. వ్రాయు ప్రతిలేఖయందును తమ చిరునామా పూర్తిగ నిచ్చుచుండవలయును.

—సంపాదకుడు.

# గ్రంథపరిచయము

## మేఘదూత:—

ఆంధ్రగ్రంథమాలలో పదునాఱవకుసుమము. కృతికర్త నెల్లూరునివాసులు దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు. చాటుపద్యరత్నాకరసంపాదకులుగా పిచ్చయ్యశాస్త్రిగారు తెలుగుదేశమునకు ఎఱుకపడియున్నారు. వారి 'ప్రణయకుసుమము' చక్కని పద్యకావ్యము; పండితకవులు మెచ్చిన కవితాశిల్పముగలది. ఈసుప్రసిద్ధాంధ్ర పండితులిపుడు కాళిదాసుని మేఘసందేశమును తెనిగించి తెనుగువారి కరకమలముల కందించినారు. 'మేఘదూత విప్రలంభశృంగారరసకల్పనలమయమైన వ్యంగ్యభావకావ్యము.' సంస్కృతమునుండి దీని ననువదించుటలో శ్రీశాస్త్రిగారు నన్నయతిక్కనాదికవిముఖ్యు లవలంబించిన అనువాదపద్ధతిని చేకొనిరి. 'మొలనూలి చిఱుతగంటలు' 'మంజీతినూడిగంబుల నిక్వణము' మొదలగు శ్రీనాథాదులపలుకుబళ్లతో ఇందలి శైలి ధారాళమై కావ్యమును స్వతంత్రగ్రంథ మనిపింపజాలియున్నది. ఉత్తరమేఘములోని 38-వ సీసపద్యము నన్నయ నలోపాఖ్యానములోని దమయంతివర్ణనను తలపించుచున్నది. మేఘసందేశమును ఇంతకుమున్ను పలువురు ఆంధ్రీకరించియున్నారు. అందీయనువాద మగ్రస్థానమునందగలదు. పదియాఱువన్నె బంగారమునకు పద్మరాగముతోడి సంపర్కలబ్ధిగలిగినట్లు ఈయుత్తమకావ్యమునకు విద్వత్కవిప్రభువులగు శ్రీజయపురము రాజా విక్రమదేవవర్మగారు కృతిభర్తలైనారు. శ్రీవారిచిత్తరువు ఇందు చేర్చబడినది. ఈగ్రంథప్రకాశకులగు శ్రీకాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు ఈకావ్యమునకు పరిచయవాక్యములు వ్రాసియున్నారు. మేలిరకము గ్లేజుకాగితములమీద సుందరముగ ముద్రింపబడినది. క్రౌనుసైజున 82 పుటలు. వెల రు 0-12-0అణాలు. వలయువారు గ్రంథకర్తపేర నెల్లూరు వ్రాయవలెను.

## తన్త్రజ్యోత్స్నా:—

జగద్గురు శ్రీకల్యాణానన్దభారతీమహాస్వామివారు రచియించినది. గ్రంథప్రకాశకులు శ్రీవంగిపురపు జగన్నాథరావుగారు. చిరునామా: సీతారామాంజనేయపేట, తెనాలి. గ్రంథము క్రౌనుసైజున 160 పుటలు. వెల ప్రతియొకటికి రు. 1-0-0. ఇది ఖర్దున తీసికొనువారికి మాత్రమే. పోష్టుద్వారా తీసికొనగోరువారు ముందుగా ప్రకాశకులకు రు 1-4-0 మనియార్డరుచేయవలెను. గ్రంథమునుగూర్చి పీఠికలోనిట్లు తెలుపబడినది: "స్వామివారు తమనిరంతరానన్దహేతుకను అపరోక్షజ్ఞానముచే సకలనిగమాగమోక్తమన్త్రశాస్త్రమును చిలికి తత్సారమును సాధకజనశీఘ్రసిద్ధికై "తన్త్రజ్యోత్స్నా" యను గుప్తనామముతో ప్రసాదించిరి. ఈగ్రన్థము గీర్వాణమందు సులభశైలిలో రచింపబడినది. ఈగ్రన్థమందుపాసనాకాండయందలి నిత్యకృత్యము లపూర్వభావనలతో సోపపత్తిగను సాంగముగను సాధకులసౌకర్యార్థ ముపదేశింపబడినవి. సాధకులేగాక సామాన్యముగ సిద్ధులుగను, గురువులుగను గణింపబడువారుకూడ గ్రహించి సుఖింపదగిన సత్సాంప్రదాయసిద్ధ శ్రీవిద్యారహస్యరత్నములను శ్రీవారు అజపాప్రాణాయామదేవతాధ్యానాది విషయములందు ప్రకటించి జగద్గురుయోగ్యతాహేతువై జగద్గురుదీపకమగు తమ యనుభవజ్ఞానమును ప్రదర్శించిరి."

## శ్రీగాంధీమహాత్మ్యకము:—

గ్రంథకర్త ఆదిపూడి సోమనాథరావుగారు. ఈగ్రంథమును గ్రంథకర్తగారికి దేశోద్ధారక శ్రీకాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు 'ఉచితమ్ముగా మఱియుత్తమముగ' ముద్రించియిచ్చిరి. గాంధిస్తుతి, శాంతిసమరము, ఒడంబడిక, లండనుయాత్ర మొదలగు విషయములు సీసము, గీతము, మంజరి మొదలగు ఛందము

లందు వివరింపబడినవి. వీనిని గ్రంథకర్తగారు మాకార్యాలయమునపాడి వినిపించిరి. కలము, కాగితములతో మాత్రమే కొట్టుమిట్టులాడుటచే పత్రికాకార్యాలయమునందు సహజముగకలుగు మాంద్యము శ్రీవారు కంఠమెత్తి ఈపద్యముల చదువుటచే విచ్చినది. ప్రచారమునకు అనువైన గ్రంథము. క్రౌనుపైజున 24 పుటలు. మంచికాగితము. వెల ప్రతిఒక్కంటికి 0-2-0. గ్రంథమున మహాత్ముల చిత్రమునుగలదు. వలయువారు గ్రంథకర్తపేర 18, ప్రసన్నవినాయకు కోవెలవీధి, మైలాపూరు, మదరాసునకు వ్రాయునది.

## ఫ్లూటుట్యూన్స్ (Flute Tunes):—

గ్రంథకర్త వి.యస్. భూషణ్ గారు (ఆనంద ఎకాడమి, మచిలీపట్టణము) [Ananda Academy: Masulipatam] ఇదిఒక ఆంగ్లేయఖండకావ్యము. కావ్యనామమునకు అనుగుణ్యముగ ముఖచిత్రము భావప్రపూరితమైయున్నది. కవికుమారుడు శ్వాసకోశములతో స్వేచ్ఛామురళమును పీల్చుచు లేవఖండికలకు సహజగాంభీర్యమును, ప్రసాదించినాడు. యావనావిర్భూతభావపరంపరలు సహజములైనవి. సువిశాలపృథ్వీతలములోని అనాథజీవితము హృదయవిదారకమై పాషాణములనుకూడ కరిగించుచున్నది. విరామములుండగు ఆర్తుడు అత్యాశతో తండిపిలుపునకువేచియున్నాడు. ఆంధ్రప్రతిభకు ఆటపట్టు. ఆంధ్రశౌర్యమునకుదిట్ట. ఆంధ్రప్రాభవమునకు సాక్షి. అట్టి విజయనగరసామ్రాజ్యస్మృతికీర్తి సంస్తవనీయము. 'శిలలు ద్రవించివీడ్చె తుంగభద్రలో' అనునట్లు స్రవంతిసైకతములనుండి విషాదమర్మరధ్వానము వినవచ్చుచున్నది. కవిసార్వభౌమరవీంద్రనాథ ఠాకూర్ మహాశయుని నవజన్మదినోత్సవమున కానుకగఅర్పించిన 'గీతమాలిక' ఇందు పొందుబరపబడియున్నది. ప్రకృతిప్రబోధితములగు భావములు, భావములకుతగిన భాష, భాషకుతగినధార కావ్యమునకు వన్నె తెచ్చినవి.

—తుమ్మలపల్లి వేంకటసీతారామారావు.

## బాలతంత్రము:—

భిషగ్వరులు, ఆంధ్రవైద్యమండలి కార్యదర్శులు, నిఖిలభారతాయుర్వేదమహామండలి ఆంధ్రరాష్ట్రీయ కార్యదర్శులు అయిన వల్లూరు సుబ్బారావు ఏ. ఎం. ఏ. సి గారిచే సంగ్రహితము. ఇందు శిశుపోషణవిధానమునుగూర్చియు, బాలరోగనిదానచికిత్సలనుగూర్చియు ఆంగ్లాయుర్వేదవైద్యగ్రంథములందు చెప్పబడిన విషయములు సేకరింపబడి విషయవిభాగమొనర్పబడి సులభశైలిలో ప్రదర్శింపబడినవి. ఇది బహుళగ్రంథముల సారము. అత్యావశ్యకము ప్రతి ఆంధ్రస్త్రీయు తనసొంతగ్రంథసముచ్చయమున ఈగ్రంథము తప్పక చేర్చుకొనదగినదని మేము చేయెత్తిచెప్పుచున్నాము. తల్లిపాలనుగూర్చి వ్రాయబడిన ఇందలి రెండుమూడు ప్రకరణములు ప్రత్యేకప్రశంసనీయములుగనున్నవి. Spiritualism సుస్థాయినొందిన ఈదినములలో ఈగ్రంథమునందలి ద్వితీయభాగమున తెలుపబడిన బాలగ్రహవిషయములు పిచ్చినమ్మకములుగా తోసివేయబడవని నమ్ముచున్నాము. 'నాభినాళచ్ఛేదన, స్నానము'అను విషయములనుగూర్చి ప్రథమప్రకరణమున క్రొత్తవిషయములు పెక్కు చెప్పబడినవి. ఇప్పటి మనపురిటిండ్లు చీకటినూతులుగాను, మనమంత్రసానులు ఎద్దుమొద్దులుగాను నుండి పాశ్చాత్యవైద్యుల ఈసడింపునకు తావలమగుచున్నవి. కాని ప్రాచీనశాస్త్రగ్రంథములను పరిశోధించితిమేని ఆనాటి ప్రసవగృహములు 'అరిష్టశూన్యములుగా, వనిష్టహైన్యములుగా' నుండినవనియు; ఆనాటిమంత్రసానులు దక్షులుగా, చతురలుగా నుండిరనియు తెలియవచ్చును. ఈపుస్తకమునందలి కుమారాగారవివరమును చూచితిమేని ఈవిషయము విస్పష్టమగును. ఈగ్రంథము నాల్గవప్రకరణమున బాలరోగవివరణము, ఐదవప్రకరణమున ఆరోగములచికిత్స. ఈచికిత్సలలో పెక్కుసాధారణముగ చేసికొనదగు మూలికాయోగములైయున్నవి. 'బాలురయౌషధములు'అను భాగమున వివిధగ్రంథములనుండి ఏర్చికూర్చబడిన బాలురయౌషధయోగములు

గలవు. విషయావబోధమునకు గ్రంథమున పెక్కు చిత్రములు చేర్చబడినవి. భిషగ్రత్న, ప్రాణాచార్యాది బిరుదాంకితులగు డాక్టరు ఆచంట లక్ష్మీపతి బి. ఏ., యం.బి.,సి.యం. వారి ఆమోదమునందిన ఈగ్రంథమునుగూర్చి విస్తరించి వ్రాయుట అనవసరము. చిన్నసైజున చక్కనివదళసరికాగితములమీద సుందరముగ ముద్రింపబడినది. కాలికోతో గట్టిఅట్టబెండు చేయబడినది. దాదాపు నాలుగువందలపుటలు. వెల రు 1-8-0 మాత్రమే. నూతనముగాసంతానవతియైన తనబంధువురాలిని సందర్శించబోవునపుడు ప్రతిపురుషుడు ఈగ్రంథము ప్రతియొకటి బహుమానముగా గొనిపోవదగును. చిరునామా: వి. సుబ్బారావుగారు, వల్లూరు, (వయా) పొన్నూరుపోస్టు, గుంటూరుజిల్లా.

శ్మశానవాటిక:—

కర్తలు శ్రీపాదసుబ్రహ్మణ్యశాస్త్రిగారు. చిరునామా: కలాభివర్ధనీపరిషత్తు: రాజమహేంద్రవరము. పులిబూరుసంస్థానలక్ష్మి భట్టాచార్యుని మరణముతో కృశించినది, ప్రసాదరాయని అంత్యముతో నశించినది. రాక్షసుడు ఘటనాఘటనసమర్థుడు: ప్రతిద్వంది చాణుక్యుడు ప్రజ్ఞాధురీణుడు. ఎర్రగడ రాక్షసునిది. నిర్మాలనము చాణుక్యునిది. భుజంగరాయని వ్యూహము దుర్భేద్యము. అరమరలు స్వపక్షమున ఉత్పత్తిల్లినవి. పరాజయము అనివార్యము. పులిబూరుసంస్థానమునకు అంజలిరొగ్గినాడు. శత్రుత్వమునఉన్న తాశయములు భుజంగరాయని ఆశ్రయించినవి. రాధాదేవి పాతివ్రత్యమునకు కళంకము ఆపాదింపలేదు. పాతివ్రత్యమహిమచేత స్త్రీచరిత్రమును ప్రశంసనీయముగజేసినది. రాధధర్మము, విశుద్ధప్రేమ సహగమనమునకు ప్రోత్సహించినవి. ఆంధ్రావని పాలకపాలితుల అన్యోన్యానురాగములకు మూలస్థానము. ప్రభుభక్తి, పాతివ్రత్యదీక్ష, దయ, దాక్షిణ్యములను చాటుచున్నదీనవల. శైలి ఉపజ్ఞామహితము. —తుమ్మలపల్లి సీతారామారావు.

అనుభవయోగాభ్యాసము:—

యోగవిద్యకు భారతభూమి పుట్టుభూమి. అయినను అనేకవిద్యలతోబాటు అదియు ఈపరాధీన భారతమున మఱుగుపడిపోయినది. శ్రీవివేకానందులవారు అమెరికాయందు రాజయోగమునుగూర్చి యిచ్చిన ఉపన్యాసములతో మరల యోగవిద్యనుగూర్చినమీమాంస బయలుదేరినది; ఇడాపింగళసుషుమ్నా నాడులను గూర్చిన సమాలోచనముసాగినది. ఆదినములలోనే ఓ. వై. దొరసామయ్యగారు రాజయోగరత్నాకరమును, హఠయోగప్రదీపికను తెలుగుతాత్పర్యములతో ప్రచురించిరి. వానిని దీక్షతోచదివితిమి. పద్మాసనము, మృత్యుంజయాసనములను సాధనచేసితిమి. ఆగ్రంథములందలి వివరములు పూర్తిగలేకనో, గురుముఖమున నేర్వకుండుటచే మెలకువలు తెలియకనో కృతార్థతబడయలేదు. యోగవిషయికములగు మఱికొన్ని ఆంగ్లగ్రంథములను తెప్పించిచదివితిమి. సందేహములు హెచ్చినవిగానితీరలేదు. ఈఅనుభవయోగాభ్యాసము ఇపుడు చదివితిమి. సందేహములు విచ్చిపోవుటయేగాక తిరిగి సాధనకు పురిగొలుపుచున్నది. కేవలశారీరకపరిశ్రమగా పరిగణింపబడు హఠయోగమునకును, కేవలమానసికసాధనగాఎంచబడు రాజయోగమునకును ఇందు సమన్వయము చక్కగచేయబడినది. ఈగ్రంథమునందలి ఆసనములవివరణము కూలంకషముగనున్నది. చేర్చబడిన చిత్రములును హఠయోగప్రదీపికయందలి చిత్రములకు మెఱుగులు దిద్దజాలినవిగనున్నవి. ఈరీతిని ఇది ఆంధ్రమున నొకఅపూర్వగ్రంథమగుచున్నది. గ్రంథకర్తగారి ప్రకృతివైద్యకదృష్టి ఈయోగసాధన విమర్శనమున తరళించుచున్నది. శాస్త్రమునకు గ్రంథకర్తగారి అనుభవముతోడైనది. గ్రంథమున అయిదు ప్రకరణములు. మొదటిప్రకరణమున ముఖ్యములగు పదమూడుఆసనములు వివరింపబడినవి. రెండవ ప్రకరణమున

షట్క్రియలు, తృతీయప్రకరణమున బంధములు, చతుర్థప్రకరణమున ప్రాణాయామము, పంచమప్రకరణమున నాడులు, షష్ఠప్రకరణమున కుండలినీతత్త్వము ప్రస్తరింపబడినది. గ్రంథమున పందొమ్మిది యోగసాధన పటములుగలవు. ఈగ్రంథరచనమున యోగవిషయకగ్రంథములు పెక్కు పరిశోధింపబడినవి. ఇట్టి ఉత్తమ గ్రంథమును రచియించి ఆంధ్రులకు ప్రసాదించిన శ్రీపాలపర్తి ఆంజనేయులుగారికి ఆంధ్రలోకము తరఫున ఆంధ్రధనమంత్రులు శ్రీఆచంట లక్ష్మీపతిగారు అభినందము తెలిపియున్నారు. క్రౌనుసైజున 152 పుటలు. గ్లేజు కాగితములు. మూల్యము రు. 1-4-0. గ్రంథప్రకాశకులు: యోగవ్యాయామప్రకృతిచికిత్సాలయము, బందరు.

### భావతరంగములు:—

గ్రంథకర్త కల్లూరు అహోబలరావుగారు. చిరునామా: శ్రీకృష్ణదేవరాయగ్రంథమాల: బళ్లారి. ఆగ్రంథమాలయందిది రెండవకుసుమము. ప్రతిఒక్కంటికి రు 0-8-0. ఇదియొక ఖండకావ్యముల సంపుటి. కొన్నిఖండికలు వాడుకభాషయందున్నవి. మరికొన్ని గ్రాంథికములు. భావములు గంభీరములుగ లేకున్నను సులభస్ఫోరకములుగానున్నవి. నిరంతవ్యాసంగమున కవితరాణదేరగలదు. —తుమ్మలపల్లి సీతారామారావు.

### ఋతుసంహారము:—

శ్రీతాడూరి లక్ష్మీనరసింహరావు పంతులుగారిచే రచియింపబడినది. ఇది కాళిదాసుని ఋతుసంహారమను సంస్కృతకావ్యమునకు ఆంధ్రీకరణము. అనువాదము మూలానుసరణమై చక్కనిశైలితో ధారావేగము గలిగి ఒప్పారుచున్నది. శృంగారము రసరాజము. అట్టి రసరాజముయొక్క సుపాలింపుతో ఇందు ఆఱు ఋతువులవర్ణనములుగలవు. డెమ్మీసైజున 24 పుటలు. వెల రు. 0-3-0 అణాలు. వలయువారు గ్రంథకర్త పేర, ఇన్నీసుపేట, రాజమండ్రి అని వ్రాయవలయును.

### శ్రీరామదండకము:—

రఘునందనగ్రంథమాల ప్రథమకుసుమము. కాకినాడతాలూకా వేళంగిగ్రామ కాపురస్థులు శ్రీయుత గుండం లక్ష్మణశాస్త్రి విరచితము. కాకినాడ పిటీప్రెస్‌వందు 1926-న ముద్రితము. చిన్నసైజు. 16 పుటలు. వెల రు. 0-1-0.

### జగన్నాయికాస్తవము:—

గ్రంథకర్తవిద్యార్ణవ సాహిత్యసరస్వతి నూతలపాటి పేరరాజుగారిచే రచియింపబడినది. శార్దూలమత్తేభవృత్తములు. భక్తిరసమయములుగానున్నవి. ధారయుగలదు. చిన్నసైజున పండ్రెండుపుటలు. వెల రు. 0-1-0 అణా. చిరునామా: యస్. పేరరాజుగారు, తెలుగుపండితులు, బోర్డుహైస్కూలు, ఉరవకొండ, అనంతపురంజిల్లా.

### ఆగ్నేయాశుగములు:—

11-5-1921, 6-7,-1921 తేదీల యంగిండియా పత్రికలలో ముద్రితములైన 'ప్రాలిచర్డు' గారి ఇంగ్లీషు వాక్యరత్నములకుఁ దెలుఁగుపద్యములు. ఈతెలుగుపద్యములు కూచి నరసింహముగారు రచించినవి. ఆధునికాంధ్రరచయితలలో నరసింహముగారు ఖ్యాతిగాంచినవారు. ప్రౌఢమధురములగు వారిరచనమునుగూర్చి ప్రత్యేకించి వ్రాయవలసినదిలేదు. ఇందలి వాక్యములన్నియు నీతిగర్భితములు, గభీరములు. చిన్నసైజున 16 పుటలు. వెల రు 0-1-0 మాత్రమే. శుచిభావముల నలవఱచుకొనఁగోరువారు చదువదగు గ్రంథము. రు 0-1-6 వెల చేయు పోష్టుబిళ్లలుపంపిన గ్రంథముపంపబడును. దొరుకుచోటు: యమ్.యస్. శాస్త్రిఅండ్ సన్సు, వేలుపాక, విశాఖపట్టణముజిల్లా.

**చతుశ్శ్లోకి భాగవతం:—**

సన్మార్గప్రచారక గ్రంథమాలిక ఒకటవపుష్పము. ఈగ్రంథమాలయందు నీతి, జ్ఞాన, భక్తి, వేదాంత, వైరాగ్యరహస్యములను బోధించు చిన్నచిన్న గ్రంథములు, కరపత్రములు ప్రకటింపబడి వీలువెంబడిని ప్రజలకు ఉచితముగ నొసగబడును. ఈగ్రంథమాలలో మొదటిపుస్తకమగు ఈచతుశ్శ్లోకి భాగవతముకూడ ఉచితముగనే ఈయబడుచున్నది. చిన్నసైజు: గ్లేజుకాగితములు. 12 పుటలు. చిరునామా: కొత్తపల్లి నరసింహముగారు, పాలమూరు, అత్తిలిపోష్టు, పశ్చిమగోదావరిజిల్లా.

**శ్రీ తులసీరామాయణము:—**

కిష్కింధాకాండము. గ్రంథకర్త భాగవతుల నృసింహశర్మగారు, డెమ్మీసైజు 96 పుటలు, గ్లేజు కాగితములు, కాగితపుబైండు, వెల 1-0-0. 1929 సంవత్సరమున ప్రచురితము. శ్రీనృసింహశర్మగారు చేయుచున్న తులసీదాస్ రామాయణానువాదములో ఇది నాల్గవసంపుటము. తులసీదాస్ రామాయణము వాల్మీకి రామాయణముకంటె ఒకవిషయములో భిన్నముగానున్నది. అదేదన భక్తిరసము. గ్రంథమందు అధునికులమగు మనకు రుచించు విషయమొకటిగలదు. ఈసంపుటమందుగల 540 పద్యములలోను సీసము, ఆటవెలదులమాట అటుంచి 340 గీతపద్యములు రచింపబడినవి. కవిగారు గీతముయొక్క ప్రాశస్త్యమును కొంతవఱకెఱింగిరనుట కిది యొకనిదర్శనము. గ్రంథమంతయు గీతములో వ్రాసినను నష్టములేదు. దీనియందుపయోగింపబడిన వృత్తము లాగంతుకులవలెనున్నవి. శైలి రసవంతముగానున్నది. పద్యములు సుళువుగాబోధపడుచున్నవి. శబ్దకాఠిన్యమంతగా గానరాదు. నడక ధారాళముగనున్నది. చిరునామా: వేగుజుక్క గ్రంథమాల, పూాడిపెద్దివారి వీథి, బరంపురము.

—టేకుమళ్ల కామేశ్వరరావు.

**కోటీశుతనయ:—**

రచయిత తాత కృష్ణమూర్తిగారు బి.యె. చిరునామా: వేగుచుక్క గ్రంథమాల: బరంపురము వెల, రు. 1—4—0 లు. ఇదిఒక అపరాధపరిశోధనము. రంగము వంగదేశముకాదు. సింధుదేశమునుకాదు. నాయకుడు, ప్రఫుల్లకాంతుడుకాదు. ఛటర్జీకాదు. మరెవరు? రోలోరాప్, మేరీ మున్నగుపాశ్చాత్యులు. కథాప్రదేశము ఆంగ్లదేశము. ఆంగ్లేయసంఘనిబంధనలను, మర్యాదలను విపులీకరించి సర్వతోముఖవికాసము పొందుచున్న నాగరికతాజీవితమునందలి విప్లవములు విశదీకరింపబడినవి. మనసంఘమునందు షర్‌లాక్ హోమ్సు (*Sherlock Homes*) అర్సెన్ లూపిన్ (*Aresene Lupin*) వంటి హంతకులులేరు. మేటి అపరాధపరిశోధకులును లేరు. ఇంతవరకును మనము అదృష్టవంతులము. ఇందులో అట్టివారెవరును సృష్టింపబడలేదు. ఆయాదేశములందలి ఆచారములు వర్ణింపబడినవి. అపరాధపరిశోధకనవలలు వ్రాయువారు అనుకరింపదగిన క్రొత్తపద్ధతి.

—తుమ్మలపల్లి సీతారామారావు.

**శ్రీ శారదావాచకములు:—**

ఆఱవవాచకము. సంపాదకులు తేకుమళ్ల రాజగోపాలరావుగారు. ఇది ఉన్నతపాఠశాలలలో పాఠ్యగ్రంథముగ నుంచదగియున్నది. ఆంధ్రబాలకుల నాకర్షించువిషయములుగలవు. పద్యపాఠములలో మంగళగిరి, గౌతముడు గోదావరిని దెచ్చుటయు; గద్యపాఠములలో ఆంధ్రనామము, శ్రీముఖుని కారాగృహవిముక్తి, గోదావరీనది, కృష్ణరాయలు బహుమానమునందుట, ఆంధ్రపితామహుడు మొదలగునవి యిట్టివి. ఆంధ్రపాఠశాలలయందీవాచకము ప్రవేశముగనుట యెంతయు ఉచితము. క్రౌను సైజున 116 పుటలు. వెల 0-10-0 చిరునామా: తేకుమళ్ల రాజగోపాలరావుగారు బి.యే., యల్.టి. 124, పిళ్లాశవీథి, పరశువాకము, వేపేరిపోష్టు, చెన్నపురి




**కృష్ణామండలమహిళాసభ:—**

అక్టోబరు 18-వ తేదీని బెజవాడయందు భారతమహిళామండలిభవనమున జయప్రదముగ జరిగినది. శ్రీమతి రాజమానూరి సుశీలాబాయిగారు అధ్యక్షురాలు. శ్రీమతి బొడ్డపాటి సీతాబాయిగారు ఆహ్వానసంఘాధ్యక్షురాలు. ఉభయగోదావరీమండలమహిళాసభయందు సిద్ధాంతరాద్ధాంతములకు గురియైన విడాకులచట్టతీర్మానము ఇందుగానము. ఖద్దరునుగూర్చినతీర్మాన మీసభయందొకవిశేషము. మిగిలినతీర్మానములు పండ్రెండును దేశహితకరోద్యమములయందు స్త్రీలస్థానమును నిర్ణయించునవిగను, నూతనసంస్కరణములను ప్రతిపాదించునవిగను, స్త్రీలహక్కుల నిర్వచించునవిగనుఉన్నవి.

**ఉభయగోదావరీమండలమహిళాసభ:—**

నవంబరు 7-వతేదీని ఏలూరున సమావేశమైనది. డాక్టరు గానుగపాటి సేనమ్మగారు ఆహ్వానసంఘాధ్యక్షురాలు. శ్రీమతి ఆదుర్తి భాస్కరమ్మగారు సభాధ్యక్షురాలు. ఆహ్వానసంఘాధ్యక్షురాలు తమ ఉపన్యాసమున స్త్రీలకు హక్కులెవ్వియులేకుండుట, వారికుండెడి యనవసరనిర్బంధములు మొదలగువిషయములనుగ్గడించి యాసాంఘికదురాచారనిర్మూలము నకై గడంగవలయునని వివరించిరి. సభాధ్యక్షురాలు తమ ప్రారంభోపన్యాసమును మిగుల దీర్ఘముగనసేకవిషయములనువివరించుచుజదివిరి. అందుప్రధానములగువిషయములు స్త్రీలకు ఉన్నతవిద్యయుండవలెననియు, విడాకులచట్టమావశ్యకమనియును.సభలో విడాకులచట్టమును గూర్చియే విశేషచర్చజరిగినది. శ్రీమతి శ్యామలాంబగారు అనుకూలముగ మాటలాడిరి. శ్రీమతి శృంగారకవి లక్ష్మీనరసమ్మగారు ఎదిరించిరి. ఆచట్టమునకు వ్యతిరేకముగ ముప్పది మందిస్త్రీల చేవ్రాళ్లుగల అచ్చుకరపత్రములు సభలో విరివిగ పంచిపెట్టబడినవి. నిరుడు మచిలీపట్టణమునజరిగిన చతుర్థాంధ్రరాష్ట్రమహిళాసభలో విడాకులచట్టతీర్మానమునకు అనుకూలవాదమునులేవనెత్తినది గోదావరీమండలపుస్త్రీలు. ఆతీర్మాన మాసభలో రసాభాసమైనది. ఆస్త్రీలు తమమండలమున సమావేశమైన ఇపుడు దీనినిగూర్చి వాదప్రతివాదము

లను రేపి పూర్ణముగచర్చించి సభ్యురాండ్రసమ్మతినిగొని తేల్చుటో ముంచుటో చేతురను కొంటిమి. కాని చివరకు తీర్మానము సభ్యురాండ్రసమ్మతిగై కొకయే యామోదింపబడినట్లు అయినది. ఇది క్రమమార్గముకాదు. స్త్రీజనము బహుళముగసమ్మతించిననే ఈవిడాకుల చట్టమును గొనిరావలయునుగాని బలవంతముగ వారినెత్తినిరుద్దరాదు. అయినదని తొందరగ అనిపించుటచేగాని, స్త్రీలసమ్మతులగొనకయే దీనినివారు ఆమోదించిరనుటగాని కూడనిపని. సంస్కరణమును కొనిరావలయునని కేగులు తంగేళ్లుగ త్రొక్కరాదుగదా? ఈతీర్మానమిట్లు నిరంకుశముగ ఆమోదింపబడినట్లు భావించుటచే గోదావరీమండలమహిళలలో సనాతనధర్మావలంబులగు స్త్రీలు మఱియొకసభను జరుపనున్నారనివిందుము. ఇదియంతయు విడాకులచట్ట తీర్మానము చర్చాస్థితిని దాటలేదన్నందుకు నిదర్శనము. సంస్కరణమన్న తెలుగుస్త్రీలందరిలో ముందడుగువేయు గోదావరీమండలమహిళలు ఈవిషయమును గమనింతురుగాక!

**ఉభయగోదావరీమండలమహిళాసభ: 'సత్యాగ్రహి' పత్రిక:—**

ఏలూరునజరిగిన ఈసభావృత్తాంతమును స్థానికపత్రికయగు సత్యాగ్రహిపత్రిక నవంబరు 9-వతేదీనాటి సంచికలో ప్రచురించినది. విడాకులచట్టమునుగూర్చి ఇందుజరిగినచర్చను పురస్కరించుకొని ఆపత్రికయందలి ఈసభావృత్తాంతప్రకటనమునకు 'ఈమొగుళ్లు మాకొద్దు బాబో'అను శీర్షిక ఈయబడినది. ఈశీర్షిక లజ్జాసాధ్వములకు పేరుకెక్కిన ఆఆంధ్రస్త్రీలలో అలజడికికారణమైనది. సుప్రసిద్ధపత్రికాసంపాదకులు పాఠకులనరికట్టుటకు విషయములకు పరిహాసద్యోతకములగు శీర్షికలిచ్చుటగలదు. కాని అభిమానము, ప్రోత్సాహము కురియింపవలసిన తావున కేవలము పరిహాసద్యోతకములగు ఇట్టి శీర్షికలకు తావులేదు. మఱియు నీ మహిళాసభవారు కొన్నివిషయముల విస్మరించినట్లును నవి యికముందుజరుగబోవు సభలలోనైన దీర్మానింపబడవలయుననియు గొన్నివిపరీతములగు సలహాలు ఆపత్రికలో చేయబడినవి. ఇవిఅన్నియు ఇప్పుడిప్పుడే వెలుగుచూచుట ఎట్టిదో తెలిసికొనుచున్న ఆంధ్రస్త్రీలకు చాల నిరుత్సాహమును గలిగించునవిగానున్నవి. భారతస్త్రీల ప్రతిభను కీర్తించుటలో సహస్ర జిహ్వలుగల కాంగ్రెసుమహాసభకు చెందినవారును; దేశసేవలో ఆరోగ్యమును, ఐశ్వర్యమును వెచ్చించి మహాశయులునునగు శ్రీఆత్మకూరి గోవిందాచార్యులవారి సంపాదకత్వమున వెలువడుచున్న ఈపత్రిక ఇట్టిఅనౌచిత్యమునకు ఒడిగట్టుట మాకాశ్చర్యమును గలిగించుచున్నది. 16-వతేదీనాటి పత్రికలో సంపాదకులీవిషయమై కొంతవ్రాసి తాముంచిన శీర్షికయందు అపార్థమునకు తావులేదనిరి. కాని ఆవ్యాసమునగూడ వారు ఈసభవిషయములను ఉదారబుద్ధితో తిలకించినట్లు తెలియవచ్చుటలేదు. ఈసభ రాజకీయవిషయములకు దూరముగానుండుట వారికి నచ్చనట్లు గనిపించుచున్నది. రాజకీయమువినా దేశమునుసేవించుటకిక మార్గములేదా? రాజకీయము పొంతబోవక దేశసేవచేయువారియెడ కేవలము రాజకీయమునందే మునిగితేలువారు సానుభూతిగొల్పవలసినదేనా?

**గంజాము మండల మహిళా సభ:—**

నవంబరు 14-వ తేదీని బరంపురమున మహిళామందిరమున జరిగినది. శ్రీమతి దావులూరి వరలక్ష్మమ్మగారు అధ్యక్షురాలు. నేటి ఆంధ్రసంఘసంస్కర్తలలో మేటులగు శ్రీయుత బంకుపల్లి మల్లయ్యశాస్త్రిగారీసభకువెళ్లి శాస్త్రచర్చలతోను, దానికి సంబంధించిన ఉదాహరణలతోడను శారదాచట్టవిషయములనుగురించి చక్కని యుపన్యాసమునిచ్చిరి. శాస్త్రిగారివంటి స్త్రీసంఘోద్ధారకులను తమసభలకు ఆహ్వానించి వారిఉపదేశములను గ్రహించు పద్ధతిని గంజాముమండలస్త్రీలు తమ ఈసమావేశమునందు ప్రారంభముచేసిరి. ఇది అవశ్యము అనుకరింపదగిన మంచిపద్ధతి. ఇతరమండలమహిళలు తాము సమావేశమగునపు డిట్టిపద్ధతిని కూడినమట్టుకు అవలంబింతురుగాకయని కోరెదము. ఈసభయందు పంద్రెండుతీర్మానములు చేయబడినవి. కాని వివాదాస్పదమగు విడాకులచట్ట తీర్మానము ఉపపాదింపబడనేలేదు.

**మహిళా మహాసభలు: రాయలసీమ:—**

ఆంధ్రరాష్ట్రీయమహిళాసభకు ప్రతినిధులనెన్నుకొనుటకు ఏటేట మండలమహిళాసభలు జరుగుచున్నవి. ఈవత్సరము గంజాము, ఉభయగోదావరి, కృష్ణా మండలమహిళాసభలుజరిగినవిషయము పైన తెలిపినారము. విశాఖపట్టణమండలము వఱదదెబ్బలతో వంగిపోయియుండుటచేకాబోలు అచ్చట సభజరుగలేదు. మఱియిక గుంటూరుమండలమున ఆంధ్రరాష్ట్రమహిళామహాసభయేకూడినది. రామాయణగ్రంథకర్త్రిమొల్ల ఊపిరిపీల్చినమండలము నెల్లూరునందు ఈవత్సరమేలనో మహిళాసభకూడలేదు. రాయలసీమ సోదరీమణులు ఈమండలసభలవిషయమున మిక్కిలి వెనుకబడియున్నారు. రాష్ట్రీయమహిళాసభకు ఆసీమనుండి ప్రతినిధురాండ్రు వచ్చుటయేలేదని శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు తెలుపుచున్నారు. శ్రీమతులు తఱికుండ వెంకమాంబ, మోహనాంగి మొదలగు విదుషీమణులను, వానమ్మారమ్మ మొదలగు పాలియకర్త్రిలను తెలుగువారికిప్రసాదించిన రాయలసీమయందిపుడు నెలకొనియున్న స్త్రీజనమున నిట్టిమాంద్యముగపడుట భరింపరానిది. రాయలసీమనాయకు లీవిషయమున శ్రద్ధవహించి తమసీమ స్త్రీలను ప్రబోధింతురుగాకయని కోరెదము. వత్సరములుగ కడపమ్యునిసిపాలిటిసంఘసభ్యురాలుగనుండుచున్న ప్రజ్ఞావతి శ్రీమతి కె.రామసుబ్బమ్మగారిని ఈవిషయమున తమసీమయందు మేలుకొలుపుగీతములుపాడ వినయపూర్వకముగ ప్రార్థించుచున్నాము.

**పంచమాంధ్ర మహిళా సభ:—**

నవంబరు 21,22 తేదీలయందు పంచమాంధ్రమహిళాసభ గుంటూరులో జయప్రదముగ జరిగినది. గడచిన నాలుగుసభలకంటె ఈసభకు ఎక్కువమంది ప్రతినిధురాండ్రు వచ్చిరి. బందరులో చతుర్థాంధ్రమహిళామహాసభ మిక్కిలి ప్రతికూలపరిస్థితులలో కూడి

వది. రాజ్యాంగకల్లోలము. ప్రముఖురాండ్రగు స్త్రీలు వేలూరు కారాగారమున నుండుట. ఊరిలో 144-వ సెక్షను అమలులోనుండుట. వీనికితోడు ప్రకృతిలో ప్రళయము. ప్రకృతి భీభత్సముతప్ప మిగిలిన ప్రతికూలపరిస్థితులేమియు లేకుండుట గుంటూరుసభ చక్కగను, ఉత్సాహముగను జరిగినది. నెల్లూరులో వర్షాధిక్యము, గోదావరిలో కొల్లేరుముంపు, విశాఖపట్టణమున కొండవ్వాగులపొంగు లేకుండినచో ఈసభకు ఇంతకంటె హెచ్చుమంది ప్రతినిధురాండ్రు వచ్చియుందురు.

ఆహ్వానసంఘాధ్యక్షురాలు:—

శ్రీమతి డాక్టరు సి. హెచ్. దానమ్మగారు. ఆమె తనఉపన్యాసమున స్త్రీల పూర్వస్థితి, వారి నేటిపతనము, సాంఘికదురాచారములు, అస్పృశ్యతానివారణము, స్త్రీలకు పురుషులతో సమానమైనహక్కులు మొదలగువిషయములను వివరించినది. శారదాచట్టము అమలులోపెట్టవలసిన ఆవశ్యకతనునొక్కి చెప్పినది. విశేషమేమన విడాకులచట్టము ప్రస్తుత పరిస్థితులలో మనదేశమునకు అనావశ్యకమనియు, అట్టిచట్టములేకుండగనే భార్యాభర్తలు తమ ధర్మములను నెఱవేర్చుకొనవచ్చుననియు వివరించినది.

సభాధ్యక్షురాలు:—

శ్రీమతి ఆదిపూడి వసుంధరాదేవిగారు. ఉన్నతపరీక్షలందు జయమొందిన విషయమున ఈమెతో దొరయుపాటి స్త్రీలు ఆంధ్రదేశమున లేరనవచ్చును. అట్టి అగ్రసరురాలు ఈదేటిసభకు అధ్యక్షతవహించుట సంతోషకరమగువిషయములలో నొకటి. ఆమె ఇచ్చిన ప్రారంభోపన్యాసము ఆమె వైదుష్యమునకు దర్పణమై స్త్రీసమస్యలనెల్ల విమర్శించునదియై యున్నది. ఆమెకుగల ఆంగ్లదేశానుభవముకూడ ఆఉపన్యాసమున అతి విరళముగ తరళించుచున్నది.

చేయబడిన తీర్మానములు:—

1. శ్రీకోకా అహోబలరావుగారి అకాలమరణమునకు సానుభూతి; 2. ప్రాథమిక విద్య నిర్బంధమును, ఉచితమును చేయుట; 3. స్త్రీలు ఉపాధ్యాయినిలుగగల పాఠశాలలయందు సంయుక్తవిద్య నవలంబించుట; 4. గుంటూరున స్త్రీల వైద్యపాఠశాలను స్థాపించుట; 5. పాఠశాలలలో వైద్యపరీక్షయు, బాలికలకు చెప్పువిషయములందు సంగీతము, చిత్రలేఖనము మొదలగు లలితకళలను నిర్బంధముచేయుట; 6. విద్యాగంధములేని స్త్రీలకు గృహపరిశ్రమలయందు తరిబీయతునిచ్చుట; 7. ఆంధ్రదేశమునందలి ప్రతిమండలమునందును స్త్రీల కొరకు ఉన్నతపాఠశాల, దేశమునకంతకును ఒకప్రత్యేకకళాశాల స్థాపించుట; 8. స్త్రీలసెకండరీ ట్రెయినింగుపాఠశాలల సంఖ్యను పెంచి వారికి విరివిగా ఉపాధ్యాయవృత్తి నవలంబింపజేయుట; 9. ఆంధ్రవిశ్వవిద్యాలయమువారి బి. విద్వాన్‌పరీక్షల నెత్తివేయుతలంపును నిరసించుట; 10. శారదాచట్టమును సవరించుటకు చేయబడుచున్న ప్రయత్నములను ప్రతిరో

ధించుట; 11. స్త్రీలకు వారసత్వపుహక్కు ప్రసాదించు హరవిలాసశారదాగారి బిల్లు భారతశాసనసభలో ఆమోదింపజేయుట; 12. బాలవితంతువులకు పునర్వివాహములొనర్చుట; 13. స్త్రీలకు-పదునెనిమిదివత్సరములకుపై బడినవారికి-పురుషులతో సమానముగ ఓటింగుహక్కు, ఎన్నికహక్కు నిచ్చుట; 14. గ్రామపునర్నిర్మాణమున స్త్రీలు యెక్కువగ పాల్గొనుటకు హెచ్చరిక. చేయబడిన ఈతీర్మానముల నొకపరి పరికించితిమేని దేశహితకరోద్యమములందు ఆంధ్ర స్త్రీలు ఎంతటి అభిరుచిని, ఆకాంక్షను చూపుచున్నారో సువ్యక్తమగును.

**ఉన్నతవిద్యను గూర్చిన తీర్మానముపై తీవ్రచర్చ:—**

నిరుడు మచిలీపట్టణమునగూడిన మహిళామహాసభయందు విడాకులచట్టతీర్మానమునుగూర్చిజరిగిన తీవ్రచర్చనుతలపించుచు ఈసంవత్సరము గుంటూరునగూడిన ఈమహిళామహాసభయందు ఉన్నతవిద్యనుగూర్చినతీర్మానముపై తీవ్రచర్చజరిగెను. ఆంధ్రదేశమున ప్రతిమండలమునందును స్త్రీలకొఱకు కనీసము ఒక్కొక్క ఉన్నతపాఠశాలను, దేశమొత్తమున ఒక్కకళాశాలనునిర్మించుటకు ప్రభుత్వమువారిని ప్రార్థింపవలయునని తీర్మానము. శ్రీమతులు కె. లక్ష్మీనరసమ్మగారును, మేరీకన్యగారును దీనికి అనుకూలురు. కళాశాలవిద్య స్త్రీలకు అవసరములేదనియు, గృహజీవనమును అది మట్టుపెట్టుననియు, అది స్త్రీలకు విజ్ఞానవిషయమునగాని నీతివిషయమునగాని మతవిషయమునగాని ఉపకరింపదనియు ఉపన్యసించుచు ఉభయభాషాప్రవీణురాలు శ్రీమతి ఎ. వేంకటసీతమ్మగారు తీర్మానమునుఎదిరించిరి. ఆపై ఎసరేగిన వాదప్రతివాదములకు అంతుపంతులేదు. శ్రీమతులు పి. రామలక్ష్మమ్మ, ఇ. భాస్కరమ్మగార్లు అనుకూలపక్షము; శ్రీమతులు దువ్వూరి సుబ్బమ్మ, జి. రాజరత్నమ్మగార్లు ప్రతికూలపక్షము వహించి వాదించిరి. సభలో గల్లంతు ప్రారంభమయ్యెను. అట్టిసమయమున అధ్యక్షురాలులేచి మహితస్వరమున 'ఆర్డరు' అనెను. చీమ ప్రాకిన విననగునట్లు సభయందు నిశ్శబ్దబ్రహ్మముఅలమెను. స్త్రీలకు ఉన్నతవిద్యవలన గలుగులాభములు ఆమె చక్కగవివరించి సంస్కృతము, దేశభాషలు, లలితకళలు, స్వదేశచరిత్రనేర్చి ఉన్నతవిద్యావతులగుటచే స్త్రీలు వేయిమడుంగులనభివృద్ధినందగలరని నచ్చచెప్పినమీదట సభలో వాదప్రతివాదములు విచ్చిపోయినవి. ప్రతికూలపక్షమువారు అనుకూలపక్షమువారితో చేతులుకలిపిరి. సర్వజనాంగీకారమునుబడసి తీర్మానము పుస్తకమునకెక్కెను. ఈతీర్మానము చర్చింపబడుచుండగను, చర్చనాపుటయందును అధ్యక్షురాలు చూపిన ఓరిమి, ఓపిక ప్రశంసనీయములుగనున్నవి. నేటి ఆంధ్రస్త్రీలలో విద్యాభిలాష ఎట్లు ఉఱకలువేయుచున్నదో ఈతీర్మానముమీద ఎసరేగినతీవ్రచర్చ తేటతెల్లముచేయుచున్నది.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.